జనవరి 2015
రూ. 15/-

# భూమి

❖ జ్ఞానపీఠ గ్రహీత
ఇందిరా గోస్వామి

కన్నయ్యవాడలో క్రీనీడలు .. 6

❖ నవలావలోకనం
హంగామా .. 118

పాఠకులకు
నూతన సంవత్సర
శుభాకాంక్షలు

# భామనే.. సత్యభామనే..!



★ మేకప్ మెరుగులతో పనిలేని సహజసుందరి.. పార్టీలకు, ఫంక్షన్‌లకు దూరంగా ఉండడమే ఆమె సౌందర్య రహస్యమా? ఇంతకీ ఎవరామె? ఆమె సౌందర్య రహస్యాలేంటి?

★ ధనుర్మాసం ప్రత్యేకవంట చిటికెలో రుచిగా..!

★ క్షణాల్లో పునరుత్సాహం పొందాలంటే..?

★ మీ సెల్‌ఫోనే టీవీ రిమోట్ అయితే..!?

తెలుసుకోవాలనుందా?

ఇంకెందుకాలస్యం..?

చలో పేజీ నెం. 122.

– సంపాదకులు

నవయవ్వనం నిత్యనూతనం

YOUNGEVER®
NATURE SOLUTIONS

15 YEARS OF EXCELLENCE Farmwealth

ఓషధి

ఆరోగ్యవంతమైన శిరోజాలకోసం

For online shopping visit:
youngever.com
online store

అందానికి, ఆరోగ్యానికి ఆయుర్వేద ఉత్పత్తులు!



Farmwealth Bio-tech & Youngever Nature Solutions Pvt. Ltd.
205, Raghava Towers, Madinaguda, Hyderabad - 500050
✆ : 040-40215410, 93953 73771, 90300 67801, 90300 67803
Store & Clinic : 103, V.C.Plaza, Opp. BJP Office, Kukatpally, Hyd.

ఏజెంట్లు కావలెను

# మనసున ఉన్నదీ...

★ డిసెంబరు చతురలో వాలి హిరణ్మయీ దేవి నవల 'ప్రేమించు ప్రేమపంచు' ప్రేమలా నిత్యనూతనంగా ఉంది. కొన్న వెంటనే పుస్తకం తెరిచి చదివించేవి 'కొత్తగాలి' కవితలు. 'భామనే.. సత్యభామనే..' శీర్షికలన్నీ అలరించాయి. ముఖ్యంగా శ్రీశ్రీ చతురోక్తులు వాడిగా, వేడిగా, సూటిగా ఉన్నాయి. చతుర 'సమ్'గతులు ఎన్నో విశేషాల్ని క్రోడీకరిస్తున్నాయి. చతురకతలు 'ఆకర్షణ ఖరీదు, అతి' ముచ్చటగా ఉన్నాయి.

– *డాక్టర్ శివభూషణం*, కర్నూలు

★ ఆద్యంతం హృద్యంగా సాగిన 'ప్రేమించు ప్రేమపంచు' నవల మమ్మల్ని మళ్లీ మళ్లీ చదివింపజేసింది. 'ఆకర్షణ ఖరీదు', 'అతి' చతుర కతలు బావున్నాయి. నవలావలోకనంలోని 'కొత్త బంగారులోకం' హృదయ తంత్రుల్ని మీటింది.

– *భాగ్యరాజ్*, పొన్నకల్

★ ఆకర్షణీయమైన ముఖచిత్రంతో చతుర ఆకట్టుకుంది. వాలిహిరణ్మయీదేవి 'ప్రేమించు ప్రేమపంచు' నవల ఆద్యంతం ప్రేమైకంగా ఆనందింపజేసింది. చతురసమ్'గతుల్లో బైబిల్ గురించిన విషయ సరంజామా అపూర్వంగా ఉంది. 'భామనే.. సత్యభామనే..!' పేజీలు బాగా అలరిస్తున్నాయి. మరికొన్ని పేజీలు ఉంటే బాగుంటుంది. ఆర్టిస్టుల చిత్రాలు బాగుంటున్నాయి.

– *నేమాన సుభాష్ చంద్రబోస్*, విశాఖపట్నం

★ వాలిహిరణ్మయీదేవి నవల 'ప్రేమించు ప్రేమపంచు' శ్రీరామ్‌లాంటి వాళ్లకు గుణపాఠంగా ఉంటుందనడంలో సందేహం లేదు. చాలా చక్కని నవలను అందించారు. 'కొత్తగాలి' కవితలు మమ్మల్ని అలరిస్తున్నాయి. ఈ శీర్షికలోని ప్రతి రచయితకూ అభినందనలు. 'భామనే.. సత్యభామనే..!' ఫీచర్‌లో చక్కని భామల ఫిట్‌నెస్ చిట్కాలు ఉపయోగకరంగా ఉంటున్నాయి.

– *కరణం శివానందరావు*, కర్నూలు

★ 'ప్రేమించు ప్రేమ పంచు' నవల ఉత్కంఠగా చదివించింది. గత అరవై డెబ్భై దశకాల్లోని మాస, వార పత్రికల్లో క్రేజీ రచయిత్రులు జ్ఞప్తికి వచ్చారు. పూర్తిగా ట్విస్టులతో నిండి ఉంది. కానీ ఏమాత్రం సామాజిక ప్రయోజనం లేదనిపించిన నవల.

– *ధర్పూరి శ్రీధరాచార్యులు*,
సీతారాంబాగ్, హైదరాబాద్

★ ప్రతి ప్రేమ కథలో కులగోత్రాలు లేదా ఓ విలన్ అడ్డంకిగా నిలుస్తున్నాయి. ఇలాంటి సాధారణమైన కథలు చదివీ చదివీ విసుగెత్తిన మా బుర్రల్ని 'ప్రేమించు ప్రేమ పంచు' నవల కొత్తపంథాలోకి తీసుకెళ్లింది. సరికొత్తగా అన్నాచెల్లెళ్ల బంధాన్ని భిన్నంగా చూపుతూ ఆసక్తిగా సాగి మమ్మల్ని ఆకట్టుకుంది. విభిన్నమైన ఈ నవలలో అందరూ మంచివారే అయినా ఒక్క శ్రీరామ్ చేసిన తప్పు ఎంతమందిని బాధపెట్టిందో తెలియజెప్పింది. మైథిలి, హేమ, భూదేవమ్మ, దీప్తి, మనోజ్ఞ అన్ని పాత్రలూ కళ్ల ముందు సజీవంగా మెదిలినట్లయింది. చకచకా చదివించిన నవల ముగింపు కూడా సుఖాంతం కావడం ఆనందపరిచింది. రచయిత్రి వాలి హిరణ్మయీదేవికి అభినందనలు.

– *టి.యస్. కళాధర్*, గుంతకల్లు

★ డిసెంబరు నవల 'ప్రేమించు ప్రేమ పంచు' ఎంతగానో అలరించింది. బిగువైన కథనంతో.. మలుపులతో సినిమాని తలపించింది. 'చతుర సమ్'గతులు ఆకట్టుకుంటున్నాయి. 'చతురోక్తులు'లో శ్రీశ్రీ గారి హాస్యచతురత అలరించింది. భామనే సత్యభామనే బాగుంది.

– *మహ్మద్ బషీరుద్దీన్*, నర్సాపురం

★ కేథరిన్ ముఖచిత్రంగా వచ్చిన డిసెంబరు చతుర మమ్మల్ని ఎంతగానో అలరించింది. హిరణ్మయీ దేవి నవల 'ప్రేమించు ప్రేమపంచు' ఆద్యంతం ఆసక్తిగా చదివించింది. 'కొత్తగాలి' కవితలు బాగున్నాయి.

– *కవిత*, గుంటూరు

సంపుటి -37
సంచిక - 12
444వ సంచిక, పేజీలు : 132
జనవరి 2015

# చతుర





'**త**లుపు తియ్యి త్వరగా' అర్ధరాత్రి సమయంలో శశి గది తలుపులు తట్టారు. 'ఎవరు మీరు? పేరు చెప్పండి. అపరిచిత వ్యక్తికి ఇంత రాత్రివేళ తలుపు తీయను' అంది శశి. 'బడాయి మాటలతో లాభంలేదు. నేను తలచుకుంటే ఒక్కతాపుతో తలుపు తీయగలను. నువ్వు ఎలాంటి పరిస్థితిలో ఉన్నావో నాకు తెలుసు. నీకు సహాయపడేం దుకు వచ్చాను. రాంలీలా చూద్దా మని వెళ్తూ వెళ్తూ ఇక్కడికి వచ్చాను' అంటూ శశి ప్రతిస్పందన కోసం చూడకుండా ఆ వ్యక్తి తలుపు మీద తన్నడం మొదలెట్టాడు. శశి గాబరాపడింది. చివరికి తెగించి తలుపు తీసింది. ఆ తర్వాతేమైంది? ఇంతకీ ఆ వచ్చిన వ్యక్తి ఎవరు? ఆ సమయంలో ఎందుకు వచ్చాడు? వ్రజభూమిలో రాధేశ్యా మీల బతుకు చిత్రాలను కళ్లకు కట్టిన జ్ఞానపీఠ గ్రహీత **ఇందిరా గోస్వామి** అస్సామీ నవలకు **పాలకోడేటి కృష్ణమూర్తి** అనువాదం **కన్నయ్యవాడలో క్రీనీడలు** 6వ పేజీలో..



బృందావనం
అనగానే బాలకృష్ణుని లీలలు..
భాగవతంలోని అద్భుత ఘట్టాలు..
రాసలీలలు.. గుళ్లు గోపురాలు.. ఆహ్లాదపరిచే
పూదోటలు, యమునా నది పరవళ్లు వంటి విష
యాలే మనసులో మెదుల్తాయి. వాస్తవానికి అక్కడి పరిస్థితి
పూర్తి విరుద్ధం. బృందావనంలో దేహత్యాగం చేస్తే ముక్తి పొందు
తామనే విశ్వాసంతో నిత్యం వందల్లో అక్కడికి చేరే వితంతువుల
దుస్థితి కడు దయనీయం. వీరిని అక్కడ 'రాధేశ్యామీలు' అంటారు.
బృందావనంలో రాధేశ్యామీల స్థితిగతులను స్వయంగా పరిశీలించి,
చలించిపోయారు సుప్రసిద్ధ అస్సామీ రచయిత్రి ఇందిరాగోస్వామి.
కాల్పనిక జగత్తు మాటున దాగిన కఠిన వాస్తవాలను వెలుగులోకి
తేవాలన్న సంకల్పంతో 1986లో ఆమె 'నీలకంఠి బ్రజ' పేర
అస్సామీలో నవల రాశారు. హృదయ విదారకమైన రాధేశ్యామీల
బతుకుచిత్రాన్ని కళ్లముందుంచారు. ఆ విషాదమూర్తుల
సంవేదనల్ని చిత్రికపట్టి పాఠకుల గుండెల్ని పిండేశారు.
ఇందిరాగోస్వామి హృదయ ఘోషకు దర్పణం
కన్నయ్యవాడలో క్రీనీడలు !
పాలకోడేటి కృష్ణమూర్తి ఆ ఘోషను
తేట తెలుగులో మనముందుకు
తెచ్చారు.

# కన్నయ్య వాడలో క్రీనీడలు

అనువాదం :
పాలకోడేటి కృష్ణమూర్తి

## విలక్షణ రచయిత్రి అక్షరకావ్యం

*ప్రముఖ అస్సామీ రచయిత్రి ఇందిరా గోస్వామి 1942, నవంబరు 14వ తేదీన జన్మించారు. అస్సామీలో సుమారు డజను నవలలు, వందలకొద్దీ కథలు రచించారు. అనేక పురస్కారాలు అందు కున్న ఇందిరా గోస్వామి 'మమరె ధారా తరోవల్ ఆరు దుకాన్' ఉపన్యాసకు 1982లో సాహిత్య అకాడమీ అవార్డు, 2000లో జ్ఞానపీఠ్ అవార్డు పొందారు. ఉల్ఫాతో కేంద్ర ప్రభుత్వం జరిపిన చర్చల్లో ఆమె కీలక పాత్ర పోషించారు. బహుముఖ ప్రజ్ఞాశాలి అయిన ఇందిరా గోస్వామి రచ నల ఆధారంగా పలు నాటకాలు, సినిమాలు రూపొందాయి. 'అడజ్య' అనే చిత్రానికి పలు అంత ర్జాతీయ అవార్డులు లభించాయి. ఆమె జీవిత చరిత్ర ఆధారంగా జాహ్ను బారువా దర్శకత్వంలో 'పర్స్ ఫ్రం ది మిస్ట్' అనే సినిమా వచ్చింది. ఆమె రచనలు అనేకం ఆంగ్లంతోపాటు హిందీ త దితర భారతీయ భాషల్లోకి అనువాదమయ్యాయి. విద్యార్థినిగా ఉన్నపుడే ఆమె తొలి కవితా సంపుటిని వెలువరించారు. ఆమె ఢిల్లీ విశ్వవిద్యాలయంలో అస్సామీస్ విభాగానికి అధిపతిగా పనిచేశారు. ఆమె 2011 నవంబరు 29న మరణించారు.*

మధుర కంటోన్మెంట్ రైల్వేస్టేషన్‌లో ప్రయాణికులు ఎక్కువమంది దిగలేదు. బహుశా జంక్షన్‌లో దిగొచ్చు. అంతేకాదు, సాధుసన్యాసుల గుంపులు, లగేజీ, యాత్రికుల కోలాహలంతో స్టేషన్‌లో గందరగోళం మిన్నంటుతోంది. పండాలు(పూజారులు) ప్రయాణికుల్ని చుట్టుముట్టారు.

డాక్టర్ రాయ్‌చౌదరి కూడా సపరివారంగా మధుర కంటోన్మెంట్ స్టేషన్‌లోనే దిగారు. చివరి రోజుల్లో వ్రజవాసం (బృందావనవాసం) చేయాలని ఆయన, ఆయన భార్య అనుపమాదేవీల చిరకాల వాంఛ. శేషజీవితంలో ఎలాంటి ఎదురుదెబ్బలూ తగలకూడదని వాళ్ళ ఉద్దేశం. వాళ్ళ ఒక్కగానొక్క కూతురు సౌదామిని అకాలంలో వితంతువయింది. యవ్వనంలోనే వితంతువుగా మారిన ఆమె ఓ ఈసాయీ (క్రైస్తవ) యువకుడి పట్ల ప్రేమ పెంచుకుంది. సనాతన హైందవ సంస్కృతీ సంప్రదాయాలు పాటించే రాయ్‌చౌదరి పరివారం తమ కుటుంబ గౌరవానికి అదొక మాయనిమచ్చగా భావించారు. యౌవనంలో అనుపమాదేవికి క్షయవ్యాధి సోకడంతో ఆమె శరీరం ఎంతో కృశించింది. ఇప్పుడు ఈ ఆకస్మిక ఘటనతో ఆమె మరింత కుంగిపోయింది. బృందావనంలో డాక్టర్ రాయ్‌చౌదరి తాతగారికి ఆసుపత్రి ఉంది. ఆ పాడుబడ్డ ఆసుపత్రికి మరమ్మతులు చేయించాలన్న ఆలోచన కూడా ఆయనకి వుండేది. అంతేకాక వ్రజభూమి ప్రభావంతో కూతురి మనస్సు మారి పరిస్థితుల్ని ధైర్యంగా ఎదుర్కోగల మనోబలం చేకూరుతుందన్న విశ్వాసం ఆ కుటుంబ సభ్యులందరిలోనూ కలిగింది.

రైలు దిగగానే వాళ్ళకి తెలిసిన పండా గౌతమ్ వాళ్ళవైపు వస్తూ కనిపించాడు. పండా వాళ్ళకి అభివాదం చేస్తూ "బయట టాంగా వుంది. మీరు వెళ్ళి కూర్చోండి. లగేజీ నేను తీసుకొస్తాను" అన్నాడు. లగేజీ టాంగాలో పెట్టించాడు. సౌదామినికి అక్కడ చాలా టాంగాలు కనిపించాయి. అది 'ఝూలన్' (రాధాకృష్ణుల డోలోత్సవం) సమయం. యాత్రికుల్ని ఆకట్టుకునేలా టాంగాల్ని, గుర్రాల్ని అలంకరించారు. గుర్రాల మెడలో తులసి, గవ్వల మాలలున్నాయి. తలపైన నెమలి ఫించాలు వున్నాయి. రంగురంగుల గాజు గొట్టాలు వాటికి మెత్తమెత్తటి కుచ్చులా జట్కాలకి తోరణాల్లా వేలాడుతున్నాయి.

పండాగౌతమ్ టాంగా వెనకాల సైకిల్

మీద బయలుదేరాడు. ప్రధాన రహదారిలో వెళ్తున్న మిగతా టాంగాల గుంపులో రాయ్‌చౌదరి టాంగా కలిసిపోయింది. టాంగాలు మధుర దాటి బృందావనం వైపు తిరగ్గానే లయబద్ధంగా వినిపిస్తున్న గుర్రపు డెక్కల చప్పుడు మధురమైన సంగీతంలా వుంది. టాంగా వెనకాల సైకిల్ మీద వస్తున్న ఓ వ్యక్తి ఉచ్చస్వరం వినిపించింది సౌదామినికి.

"వేయి సంవత్సరాల క్రితం లక్ష అక్షౌహిణుల సైన్యంతో మహమ్మద్ గజనీ వచ్చాడిక్కడికి. ఆ రోజు కూడా గుర్రాల గిట్టలతో చెలరేగిన ధూళి మధురని కప్పేసింది. ఆ విధ్వంసకాండ రెండురోజులు కొనసాగింది. రోడ్డుకిరువైపులా వున్న అడవుల్ని చూడండి"

సౌదామిని కూడా అటూ ఇటూ చూసింది. ధూళిదూసరితమైన పొదలు, తుమ్మచెట్లతో అడవి నిండిపోయింది. వాటిని కప్పేసినట్లుగా వంగరంగు పూలు కనిపిస్తున్నాయి. పొదల మధ్య ఒకటి రెండు నెమళ్ళు పురివిప్పి కనిపించాయి.

ఆ తర్వాత మరో ఉచ్చస్వరం వినిపించింది సౌదామినికి.

"ఇంకా లోపలికంటా చూడండి..గన్నేరు, వేప, తుమ్మచెట్ల మధ్య మీకు మరో రహస్యమైన అడవి కనిపిస్తుంది. ఎప్పుడో సన్యాసుల, భక్తుల రక్తంతో అపవిత్రమైన మందిర ప్రాంగణం, మహమ్మద్‌గజనీ రాక్షసత్వానికి సాక్షీభూతంగా నిలిచింది. ఇదంతా జింకలు, చిరుతలు, గుంపు గుంపులుగా ఈ అడవుల్లో మిట్ట మధ్యాహ్నం తిరిగినప్పటి రోజుల మాట. వ్రజభూమిలో మహమ్మద్ గజనీ కొరడాదెబ్బలు తిన్న భక్తులు ఒకానొకప్పుడు ఇదే అడవిలో ఆశ్రయం పొందారు.."

ఈ వ్యక్తి మాట్లాడే విధానం, అతని మాటలు సౌదామినితో సహా అందరినీ సమ్మోహపరిచాయి. వెనక నించి వస్తున్న టాంగాలు వేగంగా ముందుకి పోవడంతో సౌదామిని టాంగా వెనకబడిపోయింది.

ఝూలన్, రాధాష్టమిలాంటి వేడుకల మూలంగా వ్రజభూమి భక్తులతో నిండిపోయింది. రోడ్డుపైన విచిత్రమైన సాధువుల గుంపు కనిపించింది. వాళ్ళ ముఖాలు, శరీరాలు రాధాబాగ్‌లోని తెల్లటి గోపీ చందనంతో అలంకరించి వున్నాయి. వాళ్లలో ఎలాంటి చింత కనిపించడంలేదు.

మళ్ళీ అదే స్వరం వినిపించింది సౌదామినికి.

"క్రీ.శ. పదివందల పద్దెనిమిది నాటి దుశ్చర్యలు, విధ్వంసాలు మాటల్లో చెప్పలేనివి. ఇరవైరోజులపాటు కొనసాగింది ఆ విధ్వంసం. ఇప్పటికీ నేలని తవ్వితే దేవతా మూర్తుల అవశేషాలు కనిపిస్తాయి"

టాంగాలు ఒక వరుసక్రమంలో మెల్లగా సాగుతున్నాయి. ఈ పండా ఓ భక్తుడి సహాయకుడు. తన వాక్పటిమతో జనాలని వశీభూతం చేయడంలో నిష్ణాతుడు. వ్రజవాసులితడిని చరణ్ బిహారీగా పిలుస్తారు.

"వినండి! మధురలోని సిరిసంపదలు కొల్లగొట్టడానికి మహమ్మద్ గజనీ వస్తున్నాడని తెలిసి బులందర్ నగర రాజు హరదత్తుడు ఏం చేశాడో వినండి" అంటూ చరణ్ బిహారీ ఒక్కక్షణం ఆగాడు. టాంగాలోని ఓ మహిళ అతనికి పాన్ అందించింది. తర్వాత చరణ్ బిహారీ కొనసాగిస్తూ "పిరికివాడైన హరదత్తుడు రాజ్యంలోని దేవతామూర్తుల విగ్రహాలని యమునలోకి విసిరికొట్టి, కొంత ధనాన్ని, ముప్ఫై ఏనుగులని తీసుకుని మహమ్మద్ గజనీ శరణువేడాడు. మరోవైపు ఓజస్వి అయిన 'మహావనం' రాజు గజనీ మహమ్మద్‌తో యుద్ధం చేసి పరాజయం పొందడంతో తన రాణిని... " అన్నాడు.

అత్తిచెట్ల నీడలో చల్లని, స్వచ్ఛమైన నీళ్ళు వున్న తొట్ల దగ్గర టాంగాలు ఆగాయి. దాతృత్వంగల భక్తుడెవరో ఆ రహ

దారి పక్కన ఆ నీటి తొట్లను నిర్మించాడు. టాంగాలన్నీ అక్కడకి చేరాయి. అప్పుడు చరణ్ బిహారీ ప్రతి టాంగా దగ్గరికి వెళ్లాడు. కొన్ని ప్రత్యేక టాంగాల్లో ఒక్కో పండా వున్నాడు. వాళ్లు చరణ్ బిహారీని చూడగానే "నువ్వు యజమానిని వశపర్చుకున్నావుగా. ఇంకా ఇక్కడెందుకు తచ్చాడుతున్నావు? " అంటూ ముక్తకంఠంతో అరిచారు.

నోట్లో బీడీ కుక్కుకుంటూ ఓ పండా అందరి దృష్టి ఆకర్షించేలా "ఈ వ్రజభూమిలో శ్రీరంగనాథుడి గురించి ఎందరికి తెలుసో, అంతకన్నా ఎక్కువ మందికి నీ పేరాశ గురించి తెలుసు" అన్నాడు. తన సహజమైన మాటకారితనంతో ప్రయాణికులపట్ల అతను కనికరం చూపినట్లనిపించి మిగతా పండాలు సంతోషించారు. కొంత సేపు అక్కడ నవ్వుల జల్లులు కురిశాయి. ఆ తర్వాత తిట్లవర్షం కురిసింది. పరిస్థితి అదుపు తప్పి కలహించుకోవడం అక్కడ సహజమే అయినా అంతవరకు రాలేదు.

టాంగావాడు గుర్రాన్ని బండికి పూన్చుతూ "ఇది ఝూలన్, శ్రీరంగనాథుని ఉత్సవం, ఇంకా రాధాష్టమి వేడుక జరిగే సమయం. త్వరపడండి, సమయం మించి పోతోంది" అంటూ అరిచాడు.

అసంఖ్యాక భక్తులు.. రూపాయలు.. అర్ధరూపాయలు.. పావలాలు విసురుతుండడంతో దుమ్ము రేగుతోంది. ఒక్కోక్షణం యౌవనంలో ఆకర్షణ గొలిపే దుపట్టాలా మెరుస్తోంది.

గుర్రాలని టాంగాలకి కట్టారు. నీ ళ్ళుతాగిన గుర్రాల ముక్కుపుటాలు అదురుతున్నాయి. అవి తలలూపుతూ సకిలించాయి. ఈ సారి చరణ్‌బిహారీ సైకిల్ ఎక్కేముందు అందరికీ వినబడేలా "మీకు ఎలాంటి అసౌకర్యం కలిగినా నా దగ్గరికి రండి. నాపేరు చరణ్ బిహారీ గౌతమ్. మహేశ్వరీ కుం జ్, భూత్‌గలీ, రేతియా బజార్ మీరు ఎక్కడైనా వుండొచ్చు" అంటూ అరిచాడు.

దాంతో టాంగాల్లోని పండాలు కోపంతో అతనిపైన విరుచుకుపడ్డారు. గుర్రాలు తారురోడ్డుపైకి రావడంతో లయబద్ధమైన వాటి గిట్టల చప్పుడు, ఇంకా నెమళ్ళ కూతలు మనోహరంగా వినిపిస్తున్నాయి.

టాంగా వెనకాల సైకిల్‌మీద వస్తున్న చరణ్ బిహారీ దృష్టి అకస్మాత్తుగా సౌదామినిపైన పడింది. ఆ యువతి ఉత్తమ శ్రోతగా అనిపించిందతనికి. ఈ చంద్రముఖి వెనకాలే ప్రయాణించడం ఆనందంగా వుంది. ఆమె నొసట సిందూరం ఉందో? లేదో? అని అతని చూపులు పరీక్షించసాగాయి. మెడలో మంగళసూత్రం? లేదు. కాలికి మెట్టెలు? లేవు. తెల్లచీర మాత్రం కట్టలేదు. ఇవాళ రేపు యువ వితంతువులు కూడా తెల్లచీరలు కట్టడంలేదు.

చాలా పాత విషయం ఒకటి జ్ఞప్తికొచ్చింది చరణ్ బిహారీకి. గతంలో కోమిల్లా, రాజ్‌షాహీ, ఈస్ట్ దినాజ్‌పూర్ నించి ఇదే వయసున్న యువ వితంతువులు గుంపుగా వచ్చారు. చాలారోజుల నుంచి ఆకలితో వున్నారు వాళ్ళు. వాళ్ళలో చరిత్రహీనులు కూడా వున్నారు. అప్పట్లో తను నవ యువకుడు. తరచుగా పోకిరీలతో తిరిగే వాడు. కసాయి ఏవిధంగానైతే జంతువుని కోసేముందు పరీక్షిస్తాడో అదేవిధంగా పోకిరీలు ఆ నిస్సహాయ యువతుల దుస్తుల్ని చింపి వాళ్ల అంగాంగాలు పరీక్షించేవాళ్లు. వాళ్ల శరీర నిర్మాణంలో ఎలాంటి లోపం లేదు. కానీ వాళ్ల ప్రధాన సమస్య రెండు పూటలా తినడానికి రొట్టెముక్కలు. భగవాన్ కృష్ణుని రాసలీలాస్థలమైన 'వంశీవట' అనే స్థలం కింద తను, పదిహేను సంవత్సరాల కన్నా తక్కువ వయస్సున్న యువతుల అనాచ్ఛాదిత స్తనాలని చూశాడు - చెమటతో తడిసిన ఆ నగ్న వక్షోజాలు వర్షంలో తడిసిన పసిడి గుట్టల్లా ఉన్నాయి. అలాగే పోకిరీ గుంపు కాశీ,

# జాడీల కథ కమామిషు!

చైనాలోని గ్జియెంగ్ ఖవాంగ్ పీఠభూమిలోని లావోస్‌లో 'ప్లెయిన్ ఆఫ్ జార్స్' (జాడీల మైదానం) ఉంది.
శిలలతో తొలిచిన వేలకొద్దీ జాడీలు ఇలా చెల్లాచెదురుగా కొన్ని వందల కిలోమీటర్ల వరకూ పడి ఉన్నాయి.
వాటిలో దొరికిన మృతకళేబరాల అవశేషాలను బట్టి అవి క్రీస్తు పూర్వం 500 నుంచి క్రీ.శ. 200 మధ్య కాలానికి చెందినవిగా పురాతత్వశాస్త్రజ్ఞులు వెల్లడించారు. అప్పట్లో ఉన్నత కులీనులను పాతిపెట్టకుండా దహనం చేసి, ఆ తర్వాత వారి అస్థికలను, బూడిదను ఈ జాడీల్లో నిల్వచేసేవారట.

వారెవ్వా!



ద్వారక మొదలైన తీర్థస్థలాల్లో కూడా చిరు తపులుల్లా కుట్రపూరితంగా తిరిగేవాళ్లు.

ఛీ!ఛీ!!?

టాంగాలో ఉన్న ఓ వృద్ధురాలి చింపిరి గుడ్డలో మూటకట్టిన రొట్టెముక్కలు చెల్లాచెదురుగా రోడ్డుమీద పడ్డాయి. నిందాపూరక స్వరంతో అరిచిందామె - ఛీఛీ!!?

తెగిపోయిన ఆలోచనల గొలుసుని తిరిగి సంధించాడు చరణ్ బిహారీ. ఆ యువకులకి అమ్మతనంలోని కమ్మదనం లభించి ఉండదు. అలా జరిగి ఉంటే వాళ్ల నగ్న స్తనాలపైన నీటి బిందువుల్లా చంటి బిడ్డలు పాలుతాగిన గుర్తులు అస్పష్టంగానైనా తప్పకుండా కనిపించేవి.

గుర్రాల గిట్టల చప్పుడు, చక్రాల డబడబలు తప్ప అంతా ప్రశాంతంగా ఉంది. టాంగాలోని ప్రయాణికుల ఆసక్తి, సడలని ఏకాగ్రత గమనించి చరణ్ బిహారీ చెప్పడం కొనసాగించాడు.

"ఆ తర్వాత వచ్చాడు సికిందర్‌లోడీ. ఇది నాలుగు వందల యాభై సంవత్సరాల క్రితం సంగతి. లోడీ మధురలోని మందిరాలన్నింటినీ ధ్వంసం చేయించి వాటి స్థానాల్లో మాంసం దుకాణాలు పెట్టించాడు. విరిగిన దేవతామూర్తుల ముక్కల్ని తూకపు రాళ్లుగా తయారుచేయించి మాంసం తూచేందుకు వాడాల్సిందిగా ఫర్మానా జారీ చేశాడు"

ఆ మాటలు విని అందరూ నోళ్లు వెళ్లబెట్టారు. అప్పుడే చరణ్‌బిహారీ ముందుకు చూశాడు. టాంగా కుదుపులకి సౌదామిని దుస్తులు అకస్మాత్తుగా పక్కలకి తొలగడంతో ఎక్కడ ఎంతెంత కండలున్నాయో చూడగలిగాడు. సౌదామిని కళ్లలోకి చూడగానే అతను అవాక్కయ్యాడు. అంచుకు తాకుతున్న కొలనులోని నీళ్లలా ఆమె కనుకొనల్లో కన్నీరు! అయితే అవి తన మాటలు విన్నందుకు మాత్రం కాదుగా..?

అయితే మరి సికిందర్‌లోడీ దేవతామూర్తి విగ్రహాలని అగౌరవ పరచినందుకా? కాదు.. అసంభవం.

బాధ, బాధాతప్త హృదయపు నీడ ప్రతిబింబం స్త్రీ మోహాన్ని మరింత మనోహరపరుస్తుంది. కానీ సరిగ్గా అదే సమయంలో చరణ్‌బిహారీ మనస్సులో ఓ హఠాత్పరిణామం చోటు చేసుకుంది. సౌదామిని ముఖంపైన అలముకున్న ఉదాశీనత ఓ మూర్తి రూపం సంతరించుకున్నట్టుగా అనిపించింది చరణ్‌బిహారీకి. బాగా పరిశీలించిన తర్వాత ఆ రూపం మరెవరిదో కాదు, తన కూతురిదేనన్న అనుభూతి కలిగిందతనికి. తన కూతురు ఇలాగే తన ఆలోచనల్ని ఛిన్నాభిన్నం చేస్తూ తన కళ్ల ముందుకు వచ్చి నిలబడుతుంది. ఆమె మురళీధరుడు కృష్ణుని అలంకరించడానికి మల్లెమాలలు అల్లుతుంది.

టాంగాలు లీలాబాగ్ చేరుకున్నాయి. లీలాబాగ్‌లోని అడవిలో తుమ్మపొదలు పరుచుకుని ఉన్నాయి. ఈ పొదల కారణంగా వాతావరణంలో ఓ విధమైన పసరు వాసన వ్యాపించింది.

సౌదామిని టాంగా పక్క నుంచి సైకిల్‌పైన వస్తున్న చరణ్‌బిహారీ చెప్పడం మొదలుపెట్టాడు. "లీలాబాగ్ ఝూలన్ ఊరేగింపు ఇంకా బయలుదేరలేదు. ఆ ఉత్సవ ఆనవాళ్లు ఇప్పటికీ మీరు చూడవచ్చు"

అన్నిచోట్లా కాలిన బాణాసంచాని, ప్రసాదం దొన్నెలని చూశారు యాత్రికులు. శ్రీమాతా ఆనందమయీ ఆశ్రమం చేరుకోగానే బృందావనం మరో పార్శ్వం చూసే వీలు కలిగింది యాత్రికులకి.

గౌతమ్‌పండా చెప్పడం కొనసాగించాడు. "ఈసారి బర్సానా, హోద్‌రస్ నుంచి వ్యాపారులు రావడం మొదలయ్యింది. అక్కడ క్షామం సంభవించింది.. ఇప్పుడు ఒకట్రెండు ఎడ్లబండ్లు ఇక్కడికొచ్చాయి"

దారిలో ఎడ్లబండ్లు కనిపించాయి. అవి సౌరాష్ట్రలోని ఒంటె బండ్లలా ఉన్నాయి.

## యువమేధావులు

యువతీయువకుల్లో అద్భుతమైన నైపుణ్యం మేధస్సుగలవారు అరుదుగా ఉంటారు. అలాంటి కొందరి గురించి..

★ ఫ్రేజర్ డూహర్టీ: స్కాట్లండ్‌కి చెందిన 14 ఏళ్ల ఇతను తన అమ్మమ్మ చేసే జామ్‌ను చూసి 'సూపర్‌జామ్' పేరిట జామ్‌ని తయారుచేసి అమ్మసాగాడు. 16వ ఏట ఏడాదికి ఐదులక్షల జామ్ సీసాలని అమ్మగలగడంతో ఆ వ్యాపారం మొదలెట్టాడు.



★ మిలన్ కర్కి: నేపాల్‌కి చెందిన ఇతను 18వ ఏట 2 వేల రూపాయలతో సోనార్ పేనల్‌ని మనిషిజుట్టుతో రూపొందించాడు. సిలికాన్ స్థానంలో వెంట్రుకలు ఉపయోగించడంతో ధర తగ్గింది. 9వాట్ల విద్యుత్ ఉత్పత్తి చేసే ఈ పరికరంతో మొబైల్ ఛార్జింగ్‌లాంటివి చేసుకోవచ్చు

★ జోర్డాన్ రొమెరో: అమెరికాకి చెందిన ఇతను తన 13వ ఏట మౌంట్ ఎవరెస్ట్‌ని ఎక్కి రికార్డుని స్థాపించాడు. 9వ ఏటే కిలమంజారో శిఖరాన్ని కూడా అధిరోహించాడు.

★ డేట్రిచ్ లుడ్విగ్: 13 ఏళ్ల ఈ అమెరికన్ 2000 షెవర్లే ఎఫ్-10 పికప్ ఎలక్ట్రిక్ ట్రక్‌ని తయారుచేశాడు. డిసి ఎలక్ట్రిక్ మోటర్ కంట్రోల్ సిస్టమ్‌ని ఇందు కోసం కనిపెట్టాడు.

★ మహమ్మద్ అల్టోమైనీ: 16 ఏళ్ల ఇతను ఇరాక్ నుంచి స్వీడన్‌కి వలస వెళ్లాడు. 300 ఏళ్ల క్రితం స్విస్ మేథమెటీషియన్ జాకప్ జర్‌నౌలీ రూపొందించిన ఫార్ములాకి సొల్యూషన్ కనుక్కున్నాడు.

★ థియాగీ ఓల్సన్: ఓక్లాండ్‌లోని తన ఇంట్లో ఇతను 17 ఏళ్ల వయసులో వెయ్యిగంటలు వెచ్చించి న్యూక్లియర్ ఫ్యూజన్ యంత్రాన్ని రూపొందించాడు. దాన్ని ఎఫ్‌బిఐ వారు స్వాధీనం చేసుకున్నారు.

★ జోనాథన్ జేమ్స్: 15 ఏళ్ల ఇతను నాసా వెబ్‌సైట్‌ని హేక్ చేయడంతో జైలుకి వెళ్లాడు. ఆ వయసులో ఆ నేరానికి జైలుకెళ్లిన ప్రథముడితనే.

★ అలియా సాబుర్: సౌత్‌కొరియాలోని కోన్‌కుక్ యూనివర్శిటీలో 18వ ఏటనే ఈమె ఫుల్‌టైం ప్రొఫెసర్‌గా ఉద్యోగం సంపాదించింది. ఇది ప్రపంచ రికార్డు. రెండో ఏటనే విద్యాభ్యాసం ప్రారంభించడం ఈమె ప్రత్యేకత.

చతుర సమగటు

బరువు ఎక్కువగా ఉండటంతో ఎడ్ల తలలు నేలవైపు వంగి ఉన్నాయి. నోట్లోంచి నురుగు కారుతోంది.

టాంగాలు 'టోలుగేటు' దగ్గరికి చేరుకున్నాయి. గేటు మూసి ఉంది. గేటు దగ్గర సిపాయిల గుంపు కనిపించింది. ఝూలన్ కారణంగా బయట నించి వచ్చే వాహనాల్లోని లగేజీపైన దారి సుంకం వసూలు చేస్తున్నారు. బలిష్ఠంగా ఉన్న ఓ సిపాయి లాఠీతో జనాల్ని ముందుకు కదిలిస్తూ రాయ్‌చౌదరి టాంగావైపు వచ్చాడు. టాంగా చుట్టూ తిరిగి లగేజి ఎక్కువగా ఉందని జరిమానా కట్టాల్సిందిగా గద్దించాడు. గౌతమ్‌పండా రాయ్‌చౌదరి దగ్గరికంటా వెళ్లి "ఓ పదినోటు తియ్యండి సిపాయి నోరు మూయించడానికి అది చాలు" అంటూ గుసగుసలాడాడు.

గౌతమ్‌పండా చెప్పింది నిజమే. సిపాయి పదినోటుని జేబులోకి తోసేశాడు. గేటు తెరుచుకుంది. రాయ్‌చౌదరి టాంగా ముందుకు సాగింది.

శ్రీరంగనాథుని ఆలయ శిఖరం కనిపించింది. దాన్ని చూడగానే సౌదామిని కన్నీటి పర్యంతమైంది. ఆమె భర్తకి ఆ దేవాలయమంటే చాలా ఇష్టం. విద్యార్థిగా ఉన్నప్పుడు ఆయన ఇక్కడికి చాలాసార్లు వచ్చాడు. ఝూలన్ కారణంగా ఇప్పుడు అక్కడ మేళా ఏర్పాటు చేశారు. ఈ మే

ళాలో అన్నిరకాల వ్యాపారులు పాల్గొంటారు. దేవాలయ సింహద్వారం దగ్గర విచిత్రమైన మందులషాపు కనిపించింది సౌదామినికి. పులి కాలేయం నుంచి తీసిన నూనె, మొసలి చర్మాలు ఇంకా అనేక రకాల చేపల ఎముకలు లాంటి వస్తువులు అమర్చి ఉన్నాయి. వాటి మధ్యలో కూర్చున్న ఓ వ్యక్తి పాత లౌడ్‌స్పీకరులో విపరీతంగా ప్రచారం చేస్తున్నాడు. ప్రకటనలు గుప్పిస్తున్నాడు. అక్కడే రంగురంగుల డేరాలతో చిన్న జంతు ప్రదర్శనశాల కూడా ఉంది. అక్కడికొచ్చిన జనాలకి అదొక ప్రత్యేక ఆకర్షణగా మారింది. ముఖద్వారం దగ్గర ప్రేతాల్లా బిచ్చగాళ్లు రెండు వరుసల్లో కనిపించారు. ఉత్సవ సమయాల్లో కోటీశ్వరులైన సేట్లు వ్రజదర్శనం కోసం వస్తారు. వాళ్లు ధోవతులు, చీరలు, కంబళ్లులాంటివి పంచుతారు. వ్రజభూమిలోని ఈ ప్రేతాత్మలకి ఇంతకన్నా గొప్ప ఆకర్షణ మరేముంటుంది?

అంధకారంగా ఉండే నిర్జన వీధుల్లో కుష్ఠురోగుల సమూహం కూడా కనిపించింది సౌదామినికి. ప్రజల దయాధర్మాలు పొందడానికి ఈ కుష్ఠురోగులు వాళ్ల అవయవాలని మరింతగా ప్రదర్శిస్తారు.

టాంగాలన్నీ చౌరస్తాదగ్గర ఒక్కక్షణం ఆగి అక్కణ్ణించి రెండు గుంపులుగా విడిపోయాయి. చరణ్‌బిహారీ తన మాటల గారడీతో అనేక టాంగాలని బిహారీజీ మందిరం వైపు మళ్లించేలా చేశాడు.

డాక్టర్ రాయ్‌చౌదరి టాంగా కూడా గోపినాథ్ బజారుకి వెళ్లే దారిలో సాగింది. సరైన పర్యవేక్షణ, నిర్వహణ లేకపోవడంతో రోడ్డుకిరువైపులా ఉన్న ఇళ్లు పాతబడి శిథిలావస్థలో ఉన్నాయి. అవి పురాతన సాంచీ వృక్షాల్ని తలపిస్తున్నాయి. చిన్న చిన్న సందులు కనిపిస్తున్నాయి. కానీ అంతులేని రోడ్లో ఏమో! చివర ఎక్కడో తెలియటం లేదు.

టాంగా 'దశరథ్ అఖాడా'లోని ఓ మందిరం దగ్గర ఆగింది. మందిరంలోని గదులన్నీ అతిథుల కోసం తెరచి ఉంచారు. డాక్టర్ రాయ్‌చౌదరి లోపలివైపు విడిగా ఉన్న ఓ గదిని సౌదామిని కోసం తెరిపించాడు. గదిలోకి వెళ్లగానే సౌదామినికి ఊపిరి ఆగినంత పనైంది. లోపల వెలుతురు వచ్చే అవకాశం లేకపోవడంతో అంధకారంగా ఉంది. ఏదో భూగర్భంలోకి అడుగుపెట్టినట్లనిపించింది సౌదామినికి. ఆమె కంగారుగా అటూ ఇటూ చూసింది. చెక్కఫ్రేంలతో ఉన్న చిన్న కిటికీ కనిపించింది. ఆ కిటికీని బలంగా తెరిచింది. పలుచని కాంతి గదిలో పరుచుకుంది. కిటికీ బయట వేపచెట్టు కనిపించింది. ఆడ గొంతు వినిపించడంతో అటువైపు తొంగి చూసింది. కొంచెం దూరంలో వృద్ధ స్త్రీలు కొందరు మోకాళ్లపై తలలు ఆన్చి ఓ శవం దగ్గర కూర్చుని ఉన్నారు. కానీ వాళ్లలో ఎవ్వరూ ఏడ్వటం లేదు. వాళ్లు నిస్సహాయంగా ఉన్నారు. మరణించిన వృద్ధురాలి సమీపంలో గుడ్డపీలికలు, కుండ, పిడకలు ఉన్నాయి. అప్పుడే రాబందులా భయంకరమైన దళారి అక్కడికి వచ్చాడు. అతను వ్రజవాసి కాడు. అతన్ని చూడగానే వృద్ధ స్త్రీలు భయంగా ఓ పక్కకు ఒదిగారు.

పండా తాలూకు దళారి అతను. మరణించిన వృద్ధురాలి వస్తువుల్ని చిందరవందర చేసి చూడసాగాడు. కుండని ఓ తన్నుతన్నాడు. అది పగిలిపోయింది. పిడకల్ని గిరాటువేశాడు. వృద్ధస్త్రీలు భయంతో దూరంగా జరిగారు. మెలకిగాని, చేతులకిగాని బంగారు రేకు వేసిన లేక వెండిరాగితో చేసిన తాయెత్తులాంటివి ఏమైనా దొరుకుతాయేమోనని దళారి ఆ వృద్ధురాలిని పరీక్షించాడు. మొత్తానికి ఏదో కనిపించింది. నడుం కింద నుంచి దాన్ని లాగాడు. ఆ కుదుపుకి వృద్ధురాలి ఒంటిపై బట్ట ఓ పక్కకి తొలగిపోయింది. మానవ

# ప్రతికథా ప్రత్యేకమే!

భాషలెన్ని ఉన్నా ప్రాంతాలు వేరైనా
ఆ స్థితిగతులకీ భావోద్వేగాలకీ అద్దంపడుతూ..
మీ అరచేతిలో ప్రపంచాన్ని చూపించే విధంగా
వెరసి తెలుగు, భారతీయ, విదేశీ భాషల కథల మాలికగా
మార్కెట్లోకొచ్చేసింది **విపుల** 2015 తొలి కానుక

- దొంగతనం జాతీయకరణ జరిగితే.. చదవండి
  కడుపుబ్బా నవ్వించే 35 ఏళ్లనాటి విపుల కథ **దొంగలు**
- ప్రసిద్ధ పంజాబీ నవల, కథాకారుడు **జస్వంత్‌సింగ్ విరదీ**
  హిందీ కథ **బెలూన్లు**
- విశ్వవిఖ్యాత ఐరిష్ కథకుడు, నాటకకర్త, కవి,
  నాటకీయతకు చిరునామా **ఆస్కార్ వైల్డ్** **మర్మప్రేయసి**
- తమిళ సాహిత్యాన్ని తన రచనలతో సుసంపన్నం చేసిన
  **ఎస్. రామకృష్ణన్** **రెండు బుడగలు**
- వ్యంగ్యానికి మరో పేరైన బ్రిటిష్ నాటకకర్త,
  నవలాకారుడు **సోమర్‌సెట్ మామ్** **చర్చి అటెండర్**
- వామపక్ష పాత్రికేయురాలు **లిలియానా హెకర్**
  అర్జెంటీనా కథ **కానుక**
- 'బెస్ట్ ఆఫ్ బోడో' **నీల్‌కమల్ బ్రహ్మ** **వెలుగు కోసం**
- వీటితో పాటు నలుమైన నాలుగు తెలుగు కథలు

... ఇలా విభిన్నత, వైవిధ్యాల కలబోత ఈనెల సంచిక

- కథకుల ఫైల్‌లో **బందా**
  **కనకలింగేశ్వరరావు** **పందిలి క్రింద**
- నవ్వుల జల్లు
  **రింగరింగా రింగరింగారేలో**
  కొత్త ఏడాది సంగతులు
  ఇంకా ప్రత్యేకతలెన్నో...
  నూతన సంవత్సర శుభాకాంక్షలతో
  అందుకోండి...
  చదవండి...
  చదివించండి....




# విపుల



## విశ్వకథా వేదిక

త్వాన్ని, జీవితాన్ని హేయంగా ప్రామాణీక రించే ఆ నగ్నశరీరాన్ని చూసి సౌదామిని ముక్కుపుటాలు అదిరాయి.

వెలుగులో ఆ వస్తువుని పరిశీలించి ముఖం చిట్లిస్తూ విసిరేశాడు దళారి.

వితంతుస్త్రీలని రాధేశ్యామీలంటారు. "మీలో ఎవరి దగ్గరో ఈ ముసల్ది కొద్దోగొప్పో దాచే ఉంటుంది. ఎందుకంటే ఈమె భజనాశ్రమంలో రాధేశ్యామీ" అన్నాడు.

వృద్ధస్త్రీలు ఒకరిమొహాలొకరు చూసుకున్నారు. ఓ వృద్ధస్త్రీ ధైర్యం చేసి "ఈ ముసల్ది నీ పాత్రలు శుభ్రం చేసేది, పిండి విసిరేది" అంది వణుకుతున్న కంఠంతో.

"నోర్మూయ్! ఎక్కువగా మాట్లాడావంటే శవాన్ని మోసే ఆ నలుగురినీ పిలుస్తా. వాళ్లు ఈడ్చి యమునలో పడేస్తారు" అంటూ అరిచాడు ఆ రాక్షసుడు.

వృద్ధ స్త్రీలు మళ్లీ ఒకరి మొహాలొకరు చూసుకున్నారు. వాళ్లకి శవాల వాసన పసిగట్టి వాలిపోయే ఆ నలుగురూ గుర్తుకొచ్చారు. వాళ్లు రాధాష్టమి, శ్రీరంగనాథుని రథయాత్ర ఉత్సవాల సమయంలో రోగాలతో బాధపడే వృద్ధమహిళల చుట్టూ ముసురుతారు. ఆ పిసినారి వృద్ధస్త్రీల నోళ్లలో బంగారు పళ్లు దొరకుతాయేమో, ఎవరికి తెలుసు. అందుకనే వాళ్లు వ్రజభూమిలో ఎనభై క్రోసుల దూరం ప్రదక్షిణలు చేస్తూ నందోత్సవంలాంటి గొప్ప గొప్ప ఉత్సవాలలో తిరుగుతుంటారు.

సౌదామిని కిటికీ మూసేసింది. దాన్ని ఇంకెప్పుడూ తెరవకూడదని ఒట్టుపెట్టుకుంది. అంతగా అవసరమనుకుంటే, పగలే దీపం వెలిగించుకోవచ్చుననుకుంది. మధురనించి ఇక్కడిదాకా ఆమెకి ఎలాంటి అయిష్టతా కలగలేదు. కానీ ఈ గదిలోకి రాగానే తను అనుకున్నదంతా అవాస్తవమైపోయింది. అక్కడే ఖాళీగా ఉన్న మంచం పైన తలపట్టుకుని కూర్చుండిపోయింది సౌదామిని. ఇలా ఎక్కువసేపు కూర్చోవాలన్నా కష్టమే. ఇప్పుడు తన రోగిష్టి తల్లి బూజులు దులపడం మొదలెడుతుంది. అసలు తను ఇక్కడ ఎంతకాలం ఉండాలి? మనసు పరిశుద్ధమయ్యేంతవరకా? అసలు తను ఇక్కడికి ఎందుకు వచ్చినట్టు? నిజంగా తను కళంకితా? తను ఇంకా.. కొంచెంసేపు ఇక్కడే కూర్చుని ఏడవాలా? తనపట్ల ఏమాత్రం కనికరంలేని కసాయిలాంటి దుర్మార్గులని గుర్తుతెచ్చుకునే బదులు ఇక్కడే కొంతసేపు కూర్చుని ఎందుకు ఏడ్వకూడదు? సౌదామినిలో ఆలోచనలు ముసురుతున్నాయి.

మధ్యాహ్నం భోజనం చేసిన తర్వాత మేడపైకి వెళ్లింది సౌదామిని. సూర్యుడు వేపచెట్టు కొమ్మలపైన సంచరిస్తూ కనిపించాడు. మేడపైనుంచి విశాలమైన శ్రీరంగనాథుడి గుడి పరిసరాలు కనిపిస్తున్నాయి. అక్కడ జనం చేరుతున్నారు. ఈరోజు 'లట్టా' మేళా ఉంది. నేల మధ్యలో పాతిన స్తంభం స్పష్టంగా కనిపిస్తోంది. దాని అగ్రభాగాన్ని అందుకోడానికి వీరయోధులు తమ తమ ప్రావీణ్యాన్ని ప్రదర్శిస్తారు. పూజారులు ఎత్తయిన వేదిక మీద నుంచి స్తంభంపైన నూనె, నీళ్లు కుమ్మరిస్తారు. అస్తమిస్తున్న సూర్యకాంతిలో స్తంభం, రాత్రిపూట మెరుస్తున్న పాములా ఉంది.

వేదిక దగ్గర అందంగా అలంకరించిన ఏనుగు ఉంది. అక్కడంతా కోలాహలంగా ఉంది. అప్పుడే శ్రీరంగనాథస్వామి ఆలయ శిఖరం దగ్గర గౌరవ వందనంగా తుపాకులు పేలిన శబ్దాలు వినిపించాయి.

అదే సమయంలో "రా! కిందకి రా! మేళా చూడ్డానికి వెళ్దాం!" అంటూ తల్లి పిలుపు వినిపించింది సౌదామినికి.

అనుపమ గతంలో చాలాసార్లు వ్రజయాత్ర చేసింది. అందువల్ల ఇక్కడి వీధులు, సందులు ఆమెకి బాగా తెలుసు. సౌదామిని, అనుపమ ఇద్దరూ ఒట్టి కాళ్లతో మేళా చూసేందుకు బయలుదేరారు. అంగ

## మందు ముచ్చట్లు!

ఆల్కహాల్ డ్రింక్స్‌కి సంబంధించిన కొన్ని ప్రపంచ రికార్డులివి..

★ ప్రపంచంలో అత్యధికంగా నిషా వచ్చే బీర్ పేరు స్నేక్ వీనమ్(పాము విషం). స్కాటిష్ బ్రీవరీ బ్రెమైస్టర్ దీన్ని తయారు చేస్తోంది.




★ స్టీవెన్ అనే బ్రిటిష్ వ్యక్తి 13 క్షణాల్లో ఒక లీటర్ బీర్ తాగి వరల్డ్ రికార్డుని సాధించాడు.

★ ప్రపంచంలోని అత్యంత పురాతనమైన బ్రీవరీ బ్రిటన్‌లోని వెయ్‌హెన్ స్టిఫాన్‌ఎజీ బ్రీవరీ. క్రీస్తుశకం 768లో దీన్ని సీ మోనా స్టీలో ఆరంభించారు. అప్పటినుంచి అక్కడ బీర్ తయారవుతూనే ఉంది.

★ అమెరికాలోని ఓ వీధిలో అత్యధిక బార్లు ఉన్నాయి. ఇది విస్కాన్సిన్ రాష్ట్రంలోని లాక్రోజా స్ట్రీట్. ఇందులో 360కి పైగా బార్లు న్నాయి.

**చతుర సమాచారం**

★ ప్రపంచంలో అమ్ముడైన అత్యంత ఖరీదైన కాక్‌టెయిల్ ఖరీదు 12,916 డాలర్లు. ఆస్ట్రేలియన్ మిక్సాలజిస్ట్ జోయెల్ హెఫర్ మేన్ అత్యంత ఖరీదైన రకరకాల మద్యాన్ని కలిపి దీన్ని తయారు చేశాడు.

★ 74 ఏళ్ల అమెరికన్ సూల్ఖ్ ఏండ్రే ఓ సిట్టింగ్‌లో 120-150 బీర్లని తాగుతాడు! ఇది ప్రపంచ రికార్డు.

★ జర్మన్ వెయిటర్ ఆలివర్ స్ట్రూయంఫెల్ ఒకేసారి 27 బీర్ల మగ్గులను పట్టుకుని 40 మీటర్లు నడిచి రికార్డు సాధించాడు.

★ అత్యంత పెద్ద షాంపేన్ బాటిల్ ఖరీదు 62,199 డాలర్లు. 30 లీటర్లు గల ఆర్మండ్ డి బ్రిగ్‌నేక్ అనే బ్రాండ్ సీసాలో 253 గ్లాసుల షాంపేన్ ఉంటుంది.

★ పోలెండ్‌కి చెందిన స్పిరిటజ్ అత్యంత నిషా కలిగించే మద్యం.

★ ఓ నిమిషంలో 68 బీర్ బాటిల్స్ మూతలను మైసూర్‌లోని కంట్రీక్లబ్‌లో కెసి మురళి తన పళ్లతో తెరిచి 17 సెప్టెంబర్ 2011లో ప్రపంచ రికార్డుని సాధించాడు.

ళ్లలో వేలాడే ద్రాక్షగుత్తులు క్రిస్టల్ బాల్స్‌లా ఉన్నాయి. తులసి మాలలు, గోపీచందనం, విభూతి ఉండలు అమ్మే షాపులన్నీ పండగ వాతావరణం సంతరించుకున్నట్టుగా అలంకరించి ఉన్నాయి. అందంగా మెరుస్తున్న బాలగోపాలుడు, వంశీధరుడు, సూర్యవంశపు రాజుల అష్టధాతువుల మూర్తులు ఉన్న అంగళ్లు అలంకరణలో మిగతా అంగళ్లని అధిగమించాయి. ఈ అంగళ్ల ముందు కొనుగోలుదారుల కంటే వీక్షించేవాళ్లే ఎక్కువగా ఉన్నారు.

జనాన్ని తోసుకుంటూ మందిర సింహద్వారంలోకి అడుగు పెట్టడానికి వాళ్లకి ధైర్యం చాలడంలేదు. సౌదామిని చేయిపట్టుకుని మందిరం మెట్లు ఎక్కే ప్రయత్నం చేసింది అనుపమ. కానీ బయట వరండా కిక్కిరిసి ఉండడంతో విరమించుకుంది.

శిబిరం దగ్గర నుంచి మరోసారి గౌరవ సూచకంగా తుపాకులు పేలిన శబ్దాలు వినిపించాయి. ఆ శబ్దాలు వినగానే జనాలు హర్షాతిరేకంతో ఈలలు వేశారు. వీరయోధులు స్తంభంపైకి ఎక్కే పోటీ మొదలైంది. నీళ్లూ నూనె రాసిన స్తంభం నిగనిగలాడుతూ నున్నగా ఉంది. వేదిక పైన ఉన్న పూజారులు పైనుంచి కుండలతో నీళ్లు గుమ్మరిస్తున్నారు. ఎవరికివారు ముందుగా స్తంభం పైకి చేరుకోవాలని పోటీలు పడుతున్నారు, కిందకి జారిపోతు

న్నారు. వాళ్లు జారుతున్నప్పుడు ప్రేక్షకులు పకపకా నవ్వుతున్నారు.

'గ్రామీణ వాద్యమండలి' సభ్యులు వీరరసంతో నిండిన సంగీతం వినిపించసాగారు. ఆ రాగం విన్న వీరయోధులు రెట్టించిన ఉత్సాహంతో పోటీపడుతున్నారు. వాళ్లు శౌర్యప్రతాపాలు ప్రదర్శించడానికి ఇంతకన్నా మంచి అవకాశం ఎక్కడ దొరుకుతుంది? కానీ ఓ హద్దు వరకు స్తంభం పైకి ఎగబాకి, జారిపోతున్నారు. మళ్లీ ఎగబాకుతున్నారు, మళ్లీ జారిపోతున్నారు. ప్రేక్షకుల హర్షధ్వానాలు మిన్నంటుతున్నాయి. మహాప్రభువు శ్రీరంగనాథుడు బంగారు సింహాసనం మీద కొలువుదీరి తమాషాగా చూస్తూ ఆనందకరమైన రసానుభూతి పొందుతున్నట్టుగా అనిపిస్తోంది. దేవతలందరూ మానవరూపంలో ఆ సరదాని ఆస్వాదిస్తారని ప్రజల విశ్వాసం.

ఇంతలో 'ఎక్కేశాడు, ఎక్కేశాడు' అంటూ అందరూ పెద్దగా అరిచారు. సముద్రఘోషలా ఉన్న జనసమూహం ఒక్కక్షణం పాటు మౌనం దాల్చింది. ఒక వీరయోధుడు నూనె, నీళ్ల జల్లుల్ని లక్ష్యపెట్టకుండా స్తంభంపైకి ఎగబాకేశాడు. అతను ఒక చేతితో అగ్రభాగాన్ని తాకగానే చెవులు చిల్లులు పడేలా ప్రేక్షకుల కేరింతలు, ఏనుగు ఘీంకారాలు, కేకలు, అరుపులతో అట్టహాసంగా అద్భుతమైన వాతావరణం చోటుచేసుకుంది. సింహద్వారం దగ్గర రక్షకభటులు, సేవాసమితి కార్యకర్తల లాఠీలు నదీప్రవాహంలో తేలుతున్న కాడల్లా అనిపిస్తున్నాయి. ఇక ఇప్పుడు శ్రీరంగనాథుని కానుకలు, ఆశీస్సులు.. ఇవన్నీ అక్కడున్న వాళ్లు అందరూ చూడలేరు. "పారిపోండి, పారిపోండి, కిక్కిరిసి ఉన్న జనం గుంపు ఇటే వస్తోంది" అంటూ అనుపమ, సౌదామిని చెవుల్లో అరిచారెవరో.

సౌదామిని ఈ కొత్త జీవితానికి అలవాటుపడే ప్రయత్నం చేసింది. స్వభావసిద్ధంగా ఆమెకి జిజ్ఞాస, కుతూహలం ఎక్కువ. రాధేశ్యామీల జీవితాలు, ఆధునిక, ప్రాచీన మందిరాలు, పురాతన శిథిలాలు, బిల్వమంగళకుంజ్, శృంగార్‌బోట్, సాక్షీగోపాల్.. ఏవీ కూడా చూడకుండా వదల్లేదు ఆమె. ఆమె ధ్వంసావశేషాల దగ్గరకంటా వెళ్లింది. ముళ్లు, తుమ్మచెట్లు సాలెగూళ్లలా అల్లుకున్న స్థలాల్లో గతం తాలూకు గంటల సవ్వడి వినాలన్న కుతూహలంతో ఆమె ఎన్నోరోజులు వ్యాకులపడింది. వ్రజభూమిలోని శిథిలమైన స్థూపాల, మందిరాలలో గుండె లోతుల్ని స్పృశించే భాష ఉంది. జైపూర్ ప్యాలెస్‌లోని పురాతన శిలావిగ్రహాలపైన పాచి పేరుకుపోయింది. అయినా కూడా వీటిల్లో ఇప్పటికీ గుండెల్ని తాకే సంగీత ధ్వనులు ప్రతిధ్వనిస్తున్నట్లు అనిపిస్తుంది. గోవిందుడి పురాతన దేవాలయంలో గోడలపైన చెక్కి అలంకరించిన అరుదైన హంసమెడలాంటి తెల్లని గోపికల కంఠాల అగ్రభాగాలు ఔరంగజేబు దాడిలో నాశనమయినా, ఇప్పటికీ శిథిలమయిన మందిరంలో కూర్చుని చెవులు రిక్కించి వింటే ఎర్రటి బండల నుంచి హృదయాలని స్పృశించే శబ్దాలు వినిపిస్తాయి.

ఈమధ్యలో చాలా రోజులు గడిచిపోయాయి. డాక్టర్ రాయ్‌చౌదరి ఆసుపత్రి పనులు మొదలయ్యాయి. తరచుగా పనులతో ఆయన బయటే ఉండాల్సి వస్తోంది. కొన్నిరోజుల పాటు సౌదామిని మల్లశాల చుట్టుపక్కల తిరిగింది. దాని ఎదురుగా హరాబరీ వైపు ఉన్న సందులో రహస్యమైన లోకం ఒకటుంది. దాని దగ్గర్లోనే కుంజ్‌బిహారీమోహన్ మందిరం ఉంది.

ఒకరోజు సౌదామిని కుంజ్‌బిహారీమోహన్ మందిరాన్ని దాటి మెట్లు దిగి రహస్యమైన లోకంలోకి ప్రవేశిస్తుండగా, మందిరానికి చెందిన 'నింబార్క' సంప్రదాయం గల సాధువు ఒకరు అడ్డుతగిలి "నువ్వ




## వింత వేలం పాటలు

ఈ–బేరెజ్ సైట్‌లో అనేక వస్తువులను అమ్మకానికి పెడుతుంటారు. అలా అమ్మకానికి పెట్టిన ప్రముఖుల వస్తువుల వివరాలు..

★ హాలీవుడ్ నటి ఏంజెలినీ జోలీ, నటుడు బ్రాడ్‌పిట్‌లు తమ నిశ్వాసలతో నింపి మూత మూసిన సీసాని ఒకతను 530 డాలర్లకి అమ్మకానికి పెట్టాడు. వారిద్దరూ కలిసి నటించిన మిస్టర్ అండ్ మిసెస్‌స్మిత్ ప్రీవ్యూకి వచ్చినపుడు వీరు ఆ సీసాలో తమ నిశ్వాసలను నింపారు.



★ జె.డి. శాలంజర్ అనే రచయిత (ది కేచర్ ఇన్ ది రైఫోమ్) 1962లో ఉపయోగించిన టాయ్‌లెట్ పేన్‌ని అతను మరణించాక రిక్‌కోల్ అనే వ్యక్తి ఇటీవల 10 లక్షల డాలర్లకి అమ్మకానికి పెట్టాడు. కానీ అది ఇంకా అమ్ముడు పోలేదు.

★ స్టార్‌ట్రెక్, ది నెక్ట్స్ జెనరేషన్ సినిమాలో నటించిన బాలనటుడు విల్‌లీటన్ పింగ్ పాంగ్ బాల్‌ని 1135 డాలర్లకు కొన్నారు.

★ రొనాల్డ్ రీగన్ మీద 1981లో హత్యాప్రయత్నం జరిగినపుడు ఓ నర్స్ తీసుకున్న అతని రక్తం గల చిన్న సీసాని 10 వేల డాలర్లకి అతని కుటుంబం అమ్మకానికి పెట్టి, ఆ డబ్బుని రొనాల్డ్ రీగన్ ప్రెసిడెన్షియల్ ఫౌండేషన్ అనే ఛారిటీ సంస్థకు విరాళంగా ఇచ్చింది.

★ 'ఒన్ డైరెక్షన్' అనే మ్యూజిక్ బేండ్‌గాయకుడు నియల్ హోరన్ కొరికిన ఓ బిస్కెట్ 99,000 డాలర్లకు అమ్ముడుపోయింది.

★ హాలీవుడ్ నటి స్కార్లెండ్ జొనాసన్ ఉపయోగించిన టిష్యూ పేపర్ 5300 డా లర్లకి అమ్ముడైంది. దానిమీద ఆమె సంతకం కూడా ఉంది.

★ క్వీన్ ఎలిజబెత్-2 ధరించిన సిమ్‌పేంటీస్ 1968వ సంవత్సరంలో 18101 డాలర్లకు అమ్ముడుపోయింది.

★ హాలీవుడ్ నటి మార్లిన్‌మన్రో 1954లో 28వ ఏట తీసుకున్న ఎక్స్‌రే 45000 డాలర్లకు అమ్ముడైంది.

★ హాలీవుడ్ నటి బ్రిట్నీస్పియర్స్ వాడిన ప్రెగ్నెన్సీ టెస్ట్ కిట్ 5001 డాలర్లకు అమ్ముడైంది. కెనడాలో ఆమె ఓ హోటల్లో ఉన్నపుడు దాన్ని ఉపయోగించి చెత్తబుట్టలో పడేసింది.

★ అమెరికన్ టి.వి. సిరీస్ స్టార్ ట్రెక్‌లో నటించిన విలియమ్ షాట్‌నర్ కిడ్నీస్టోన్‌ని 25 వేల డాలర్లకు కొన్నారు.

ఈ ప్రాంతానికి అపరిచితురాల్లా ఉన్నావు. నువ్వు అటువైపు వెళ్లకపోవడమే మంచిది" అన్నాడు.

బాల్కనీలో మంచంపైన పడివుంటూ ముఖ్య సందర్భాలలో మృదంగం వాయించే ఆ సాధువు మాటలు సౌదామినిలో మరింత కుతూహలాన్ని పెంచాయి. సాధువుకి ప్రణామం చేస్తూ సౌదామిని "ఈ వ్రజభూమిలోని అణువణువూ నాకు ఉత్కంఠ గొలిపే విషయమే" అంది.

మురికిగా ఉన్న పురాతన మెట్లమీద నుంచి కిందకి దిగింది సౌదామిని. నాచు పట్టి సగానికిపైగా ఆవరించిన చెక్కలతో పాడుబడిన బావి కనిపించింది. అక్కడే పెచ్చులూడిన చిన్నచిన్న గదులు ఉన్నాయి. ఈ గదుల్లో ఎందరో రాధేశ్యామీలు ఉన్నారు. అస్థిపంజరంలాంటి వాళ్ల శరీరాలపైన మాసి పేలికలైన ధోవతులు చుట్టి ఉన్నాయి. అయినా వాళ్ల నుదుటిపైన గోపీచందనం, విభూతిరేఖలు ప్రకాశిస్తున్నాయి. సౌదామినిని చూడగానే ఆ వృద్ధస్త్రీలు గదుల్లోంచి బయటికి వచ్చి ఆమెని చుట్టుముట్టారు.

"అమ్మా! మీరంతా ఇక్కడ ఎలా బతుకుతున్నారు? " అడిగింది సౌదామిని.

వాళ్లు ఒకరి మొహాలొకరు చూసుకు

న్నారు. ఇంతలో విలక్షణమైన ఓ లావు పాటి స్త్రీ "అవసరమైనప్పుడు అద్దాల మందిరం, శ్రీరంగనాథుని గేటు బయట కూర్చుని బిచ్చమెత్తుకుంటాం. ప్రసాదం కోసం అప్పుడప్పుడు గుడిమెట్లపైన కూర్చుని రాత్రులు గడిపేస్తాం" అంది గదిలోంచి.

"మీరు రాధేశ్యామీలు. భజనాశ్రమంలో కూర్చుంటే రెండుపూటలా రొట్టెముక్కలు దొరుకుతాయి కదా!"

సౌదామిని మాటలకి ఒక వృద్ధురాలు పకపకా నవ్వుతూ, "సేల్ తోటలోని భజనాశ్రమం, గోపీనాథ్ బజారులోని భజనాశ్రమం, బారాబాగ్ భజనాశ్రమం, 'గుడ్ సాల్ భజనాశ్రమం" అంటూ "ఇంకా చెప్తాను వినండి. రాధేశ్యామీల వాటాకి వచ్చే డబ్బులు తిని తిని అకౌంటెంట్ బొజ్జ బానలా కదల్లేనంతగా పెరిగిపోయింది. నువ్వు కొత్తగా వచ్చావు. నీకేం తెలియదు. ఈ బొజ్జబాబు, కాడల్లాంటి మా కాళ్లూ చేతులూ చూసి ఎప్పుడు ఏ ముసల్ది భవసాగరం దాటిపోతుందో అర్థం చేసుకోగలడు. ఎవరెవరు ఎంతెంత కూడబెట్టారో కూడా అతనికి తెలుసు. ఒక రోజు ఈ బొజ్జబాబు దృష్టి నా కాళ్లపైన పడింది. ఉన్నపళంగా నేను పారిపోవడంతో బతికిపోయాను. లేకపోతే నన్ను తీవ్రంగా కొట్టి వెళ్లగొట్టేవాడు. నా కాళ్లు చూస్తావా? " అని ఆమె తన చీలమండపైనుంచి చిరిగిన బట్ట పైకి ఎత్తింది.

గగుర్పాటుతో వెనక్కి జరిగింది సౌదామిని. ఆ స్త్రీలందరూ తెల్లటి కుష్ఠుతో పీడింపబడుతున్నవాళ్లే.

"అమ్మా! మేం బాంకేబిహారీ వీధుల్లోను, షాహ్‌జీ మందిరం దగ్గర, మదన్‌మోహన్ ఆలయం మెట్లపైన కూర్చుని బిచ్చమెత్తుకుంటున్నప్పుడు అకస్మాత్తుగా నీలాంటి వాళ్ల దర్శనం కలుగుతుంది" అంటూ ఓ ముసల్ది నెమ్మదిగా సౌదామిని చేతులు నిమరసాగింది.

సౌదామినికి వణుకు పుట్టింది. ఒళ్లు జలదరించింది. కానీ ప్రేతాత్మలాటి ఆ ముసలిదానికి సుఖానుభూతి కలుగుతున్నట్లనిపించింది.

మరో ముసల్ది ధైర్యం తెచ్చుకుని బంగారు గాజులు చూసే నెపంతో సౌదామిని చేతులు పట్టుకుంది.

మరో వృద్ధురాలు సౌదామిని దగ్గరకంటా వచ్చి ఆమె మొహంలో మొహం పెట్టి "మేం జీవించేందుకు తింటాం. ఏమైనా దానంచేసి పుణ్యం కట్టుకో" అంది.

అదే సమయంలో గదుల్లోంచి మరికొందరు బయటికి వచ్చి నాజూకైన సౌదామిని శరీరాన్ని తాకసాగారు. చివరికి వాళ్ల ఈ అభిలాష అంతకంతకూ ఎక్కువై సౌదామిని మీదపడే స్థాయికి చేరుకుంది.

సౌదామిని జుట్టుముడి విడిపోవడంతో శిరోజాలు చిందరవందరగా ఆమె వీపుపైన పడ్డాయి. జాకెట్టు చిరిగిపోయింది. సరిగ్గా అప్పుడే నింబార్క్ సాధువు గనక అక్కడికి రాకపోయివుంటే ఈ ప్రేతాత్మల గుంపు ఊరకుక్కల రూపం సంతరించుకునేది.

"రాక్షసుల్లారా! పొండి! పొండి!! ఇక్కడ ఎవరూ లేరనుకుంటున్నారా? మీరంతా రంగనాథుని రథచక్రాల కిందపడి ఎందుకు చావరు? " అంటూ అరిచాడా సాధువు.

దాంతో వాళ్లందరూ కంతల్లాంటి గదుల్లోకి దూరిపోయారు.

"బిడ్డా! నేను చెప్పాను కదా.. ఏం చేసేందుకైనా వాళ్లు వెనకాడరు. పద, నేను దగ్గరుండి నీ గదికి చేరుస్తాను. ఇంకో విషయం వీళ్లు చాలా దురదృష్టవంతులు, దౌర్భాగ్యులు, ఆకలిబాధ ఎలాంటి పాపానికైనా ఒడిగట్టిస్తుంది. మీరు వ్రజవాసం కోసం వచ్చారని విన్నాను. ఈ దీనుల కోరిక నెరవేర్చు" అన్నాడు సాధువు.

గోపీనాథ్ బజారుకి వచ్చిన తర్వాత ముక్కుపైన, మెడపైన పట్టిన చెమట బిందువుల్ని తుడుచుకుంది సౌదామిని.

భజనాశ్రమం ఇంకా తెరిచే వుంది. అక్కడ ఉన్న స్త్రీల మధ్యలో ఓ వృద్ధురాలు 'ఖంజరి' వాయిస్తూ పాడుతోంది. తలుపు దగ్గర లెక్కాడొక్కా చూసే కాపలాదారుడు కూర్చుని సంచీలో కుడిచేయి ఉంచి జప మాలను తిప్పుతూ మంత్రోచ్చారణ చేస్తున్నాడు. కానీ రాధేశ్యామీలు భజనలు సరిగ్గా చేస్తున్నారో లేదోనని క్రీగంట గమనిస్తున్నాడు. ఆకలి కడుపుతో ఉన్నా సరే వాళ్లు పాడాల్సిందే. గొంతుపోయినా సరే గొంతు చించుకుని మరీ అరవాల్సిందే. రాధాకృష్ణుల గీతాలు ఆలపించాల్సిందే, వియోగంతో కన్నీరు కారుస్తూ వాళ్లు ఉద్ధవుడి దగ్గరకి వెళ్లి, కృష్ణుడి సందేశం వినిపించాల్సిందే. నిధువన్, నికుంజవన్, ధీర సమీర ఘాట్‌లపైన వాళ్లు పూర్తిగా కృష్ణ మగ్న మానసులవ్వాల్సిందే. భజనలు చేస్తుండగా రాధేశ్యామీలు మధ్యమధ్యలో కూరల అంగళ్లవైపు చూసేవాళ్లు. అంగళ్ల వాళ్లు కుళ్లిపోయిన, వాడిపోయిన ఎండిపోయిన కూరల్ని ఓ పక్కన పడేస్తారు. వాటిని రాధేశ్యామీలు మాత్రమే కొంటారు.

సౌదామిని గదిలోకి వెళ్లిపోయింది. ఒంటరితనాన్ని తరిమే ప్రయత్నం చేసింది. అదేమంత సులువు కాదు. మధ్య మధ్యలో తన శరీరాన్ని పరిశీలించుకుంటోందామె. అందమైన, మంచి కండపుష్టిగల దేహం ఆమెది. గత ఏడు సంవత్సరాల మానసిక దురాచారం కూడా ఆమె దేహంపైన ఎలాంటి శాశ్వతమైన గుర్తులు మిగల్చలేకపోయింది. లేదు లేదు, తన్నుతాను సమర్థించుకోవడం కుదరదు. తనలాంటి మానసికస్థితి ఎప్పుడైనా ఎవరికైనా కలిగిందా?

★ ★ ★

సౌదామిని మొహంలో ఉదాశీనత పెరుగుతున్నకొద్దీ డాక్టర్ రాయ్‌చౌదరి అనుపమాదేవిలలో విచారం అధికమవ్వసాగింది. ఒకరోజు వేకువజామున సౌదామిని మొహంలో ఇలాంటి ఛాయలే కనిపించాయి అనుపమకి. వెంటనే తేరుకుని అనుపమ కారణం అన్వేషించసాగింది. అదే సమయంలో సుదూర ప్రాంతమైన మానస సరోవరం నుంచి దేవఝరి బాబా వచ్చి అందరి సమస్యల్ని తీరుస్తున్నాడని వింది అనుపమ. యమునా తీరంలో నీళ్ల మధ్య మంచె నిర్మించుకుని ఉండే దేవఝరి బాబా గురించి వ్రజవాసులు అద్భుత కథలు వ్యాప్తి చేస్తుంటారు. 'ఇదే సరైన సమయం. ఏమో, దేవఝరి బాబా సామీప్యంలో మూసివున్న సౌదామిని హృదయకవాటాలు తెరుచుకుంటాయేమో. అలా తెరుచుకోవడం తమ కుటుంబ సంప్రదాయంపైన ఎలాంటి ప్రభావాన్నీ చూపకపోవచ్చు' అనుకుంది అనుపమాదేవి.

కొత్తగాలి...

**కలలే కందాం!**
**అలలే అవుదాం!**
**ఓరిమి కోలుపోకు!**
**ఓటమి ఒప్పుకోకు!!**

– గిరి పట్ల,
మణికొండ, హైదరాబాద్

దేవఝరి బాబా వచ్చిన విషయం ఎంతో ఉత్సాహంగా సౌదామినికి చెప్పింది అనుపమ. వెంటనే తల్లీకూతురూ యమున ఒడ్డుకి చేరుకున్నారు. ఇద్దరూ మౌనంగా ఇసుకలో నడుస్తున్నారు.

సౌదామినికి ఓ విచిత్రమైన ఉత్తేజ భావన కలగసాగింది. ఎవరికోసం ఈ ఉత్తేజం. ఇది సాధారణమైందా? లేక భక్తి పూర్వకమైందా? ఏ భక్తిరసంలో మునిగి గౌడీయ వైష్ణవులు ఒకసారి కాకపోతే మరోసారి వెర్రి ఆవేశంతో కూడిన ఆనందాన్ని పొందుతారో, ఆ రసం శృంగార రసం మాత్రమేనని సంప్రదాయవాదులు

తమలో తాము తర్జనభర్జన పడుతుం టారో. తనకు కలుగుతున్న ఉత్తేజం ఇంతకు ముందు ఎన్నడూ అనుభవించని శృంగారరస పారవశ్యమా? వీటినన్నిం టినీ శుష్క ఆలోచనలుగా తన మనస్సు లోంచి తొలగించలేకపోతోంది సౌదామిని. బాంకేబిహారీ ప్రతిమపైన దృష్టి పడగానే సౌదామిని ఇలాంటి ఉత్తేజ పారవశ్యంలో మునిగిపోతోంది. సరిగ్గా ఇలాంటి ఆనంద పారవశ్యంతో ఉత్తేజం పొందే మరో ప్రాణి కూడా ఉంది. ఆమెతో సౌదామిని ముఖా ముఖి అయింది కూడా. ఆమె శ్రీరంగనా థుని మందిరంలోని ఓ వృద్ధురాలు.

మహాప్రభువు శ్రీరంగనాథుని శోభా యాత్ర ఆమ్రకుంజ్ కి బయలుదేరే సమ యంలో పురోహితుల ఇళ్ల దగ్గర జీర్ణావ స్థకు చేరుతున్న ఓ గదిలోంచి పిచ్చిదానిలా ఉండే ఓ వృద్ధురాలు బయటికి వస్తుంది బక్కచిక్కిన చేతులు కాళ్లతో. ఆమెలో పిచ్చి ఎంతగా ముదురుతుందంటే సంపూర్ణ శోభాయాత్ర రూపాన్ని తనలో లీనం చేసుకోవాలన్నంతగా పారవశ్య తీవ్రత అధికమవుతుంది. మరొకప్పుడు భావవిభాను భావాల పారవశ్యంతో సం ధించిన వారిలా ప్రలాపిస్తూంటుంది.

ఆ సమయంలో నాట్యం చేస్తుండగా, ఆ ఉన్మాదంలో మాసిన ఆమె లంగా చెమ టతో చిత్తడయిపోతుంది. ధవళకేశాల కొప్పు వీడిపోతుంది. కొప్పులో ఉన్న మల్లె పూదండ జారిపోతుంది. అంతటి అద్భుత మైన ప్రేమ అది.

ఈ వృద్ధురాలు ఎప్పుడు ఎదురుపడ్డా సౌదామిని కళ్లు అశ్రుపూరితాలవుతాయి.

మెత్తటి ఇసుకలో తల్లీ కూతురూ మౌనంగా నడుస్తున్నారు. రెండు, మూడు తాబేళ్లు నీళ్లలోంచి పైకి వచ్చాయి. ధీరస మీర ఘాట్ దగ్గరున్న అర్జున వృక్షాలపైన నెమళ్ల గుంపు పురివిప్పి ఉంది.

ఇద్దరూ పీపా బ్రిడ్జిప్లే దగ్గరకి చేరుకు న్నారు. యమునలో ప్రవాహం చాలా తక్కువగా ఉంది. పానీగాంవ్ వైపు యమున ప్రవాహం మధ్యలో ఇసుక మేట వేసి ఉంది. కొంచెం దూరంలో దేవరఖురి బాబా డేరా కనిపించింది. జనం పల్చగా ఉన్నారు. పానీగాంవ్, బర్సానా నుంచి భక్తులు తరలి వచ్చారు. వల్లభీఝర్, హాథ్రస్ నుంచి ఇంకా జనాలు రావాల్సి ఉంది. పీపాబ్రిడ్జిని దాటి బాబా దగ్గరకి వెళ్లడం కుదరని పని. అక్కడక్కడ నీళ్లలో తడిసిన పిల్లలు కొందరు మడుగులో పొర్లాడుతున్న గేదెదూడల్లా కనిపిస్తు న్నారు. ఎత్తయిన ఇసుకదిబ్బ దాటిన త ర్వాత లోతుగా ఉన్న యమున ప్రవాహం కనిపించింది. జనాల్ని ఇవతలి ఒడ్డునుంచి అవతలి ఒడ్డుకు చేర్చే సరంగులు నావల్ని లంగరు వేసి వెనక్కి వస్తున్నారు. సౌదా మిని, అనుపమ అక్కడికి చేరుకోగానే మరి కొంతమంది వచ్చేవరకు వాళ్లని వేచి ఉండాల్సిందిగా కోరుతూ సరంగులు ఎత్తుగా ఉన్న ఇసుక దిబ్బమీదకి ఎక్కసా గారు. ఇంతలో వాళ్లు వెనక్కి తిరిగి చూశారు. మరి కొంతమంది ప్రయా ణికులు వస్తూ కనిపించారు. గోవిందుడి మందిరంలో తోటపని చేసే అంధురాలు, లూయియా బజారులో గుర్రపుశాల వృద్ధకావ లివాడు కూడా వస్తూ కనిపించాడు. పసు పురంగు మెడలున్న రెండు గరుడపక్షులు ఇసుక తిప్పపైన ఎగురుతున్నాయి.

వ్రజలోని ప్రసిద్ధ శిల్పి చంద్రభాను రాకే ష్ వస్తూ కనిపించాడు సౌదామినికి. అతను రాధాబాగ్ నుంచి వస్తున్నాడు.

రాధాబాగ్‌లో తాటాకు గొడుగు కింద కూర్చొని చంద్రభాను రాకేష్ అష్టధాతువు ప్రతిమల్ని తయారుచేస్తాడు. నికుంజవ న్‌లో అపూర్వమైన రాసలీల తైలచిత్రాలు అతను తయారుచేసినవే. అతని పూర్వీ కులు కళింగకి చెందినవారు. తాటాకు గొడుగు కింద కూర్చుని తన పూర్వీకుల

గాథల్ని వినిపిస్తాడతను. హిందుకుష్ పర్వత సానువుల్లో స్థావరం ఏర్పరచుకున్న పఠానుల ఘోరమైన హింసాకాండను కథలుగా వినిపిస్తాడు. కథలు చెప్పే ఆచార్య శాంతిభద్రుడు చెప్పింది వాస్తవమే- "అప్పుడు గాంగ వంశానికి చెందిన రాజానర్సింగ్ దేవ్ కళింగదేశాన్ని పరిపాలించేవాడు. ఇతర దేశాల నుంచి వాణిజ్య సంబంధాలు ఒరిస్సాలో మూతబడ్డాయి. సభాపతి అయిన చిత్రకారుడు కూడు, గూడు లేక బాధపడ్డాడు. దుర్భర పరిస్థితులతో విలువైన చిత్రకళ పూర్తిగా అంతరించిపోయింది"

ఇలాంటి దుర్దినాల్లో చంద్రభాను తండ్రి, తాతలు ముళ్లపొదలు చెట్లతో కప్పి ఉన్న దేవాలయ శిథిలాల్లో తలదాచుకున్నారు. వాళ్ల చెవుల్లో నిరంతరం 'మందిరాలు కూల్చండి- మసీదులు కట్టండి' అన్న నినాదం ప్రతిధ్వనించేది.

చంద్రభాను పూర్వీకుల్ని మందిర ప్రాంగణంలో సజీవదహనం చేశారు. హృదయవిదారకమైన ఈ సంఘటనలు ఇప్పుడు చరిత్రలో పురాతనమైనవిగా ఉండిపోయాయి. తాటాకు గొడుగు కింద కూర్చుని ఆలీఘడ్ ఆకురాయితో దివ్యమైన రాధ శిల్పాన్ని రుద్దిరుద్ది మెరుపు సంతరించుకునేలా చేసే శిల్పి చంద్రభాను ఇంతకన్నా ఎక్కువ మరేదీ చెప్పడు.. కానీ రాధ శరీరకాంతి ఇనుమడించే కొద్దీ... అతని ముఖం దుఃఖంతో కాంతిహీనమవుతోంది. ఎండలో మెరుస్తున్న ఇసుకలో చేపల వల విస్తరించినట్టుగా. కాజీ-కోత్వాల్ అపరిచిత దళం మళ్లీ వస్తున్నట్లనిపిస్తోంది. ఏవిధంగానైతే రత్నఖచిత అక్రూర్‌ఘాట్, చిరఘాట్‌లు ధ్వంసం చేశారో అలాగే వాళ్లు అష్టధాతు ప్రతిమల్ని కూడా ముక్కలు ముక్కలు చేసి యమునలో విసిరేస్తారు.

నాశనమయిన ఈ ఘాట్లు ఇప్పుడు యమున ఒడ్డున ఇసుకలో ఎర్రరాళ్ల రూపంలో చెల్లాచెదురుగా పడివున్నాయి. పుష్యమాసంలో చిరఘాట్‌నుంచి యమున ప్రవాహం వెనక్కి మళ్లినప్పుడు అక్కడి ఇసుక వృద్ధురాలి శ్వేతకేశాలు పరుచుకున్నట్టుగా కనిపిస్తుంది.

"అందరూ వచ్చేశారా? త్వరగా రండి. పశ్చిమాన మేఘాలు ముసురుకుంటున్నాయి" కేక పెట్టాడు నావ సరంగు.

చిన్న చిన్న తెడ్లతో టపటపమంటూ నీళ్లలో చప్పుడు చేస్తూ సరంగుల పిల్లలు నావలని ఒడ్డుకు చేర్చారు. "ఇంకా ఎవరైనా మిగిలిపోయారా? " అంటూ అరిచాడు గుంపులోని ఓ వ్యక్తి.

మరో గుంపు చిరఘాట్ వైపు నుంచి వస్తోంది. కానీ ఇక్కడిదాకా రావడానికి సమయం పడుతుంది. ఈలోపల ఇక్కడున్నవాళ్లందరినీ ఆవలి ఒడ్డుకు చేరుద్దాం అనుకున్నాడు సరంగు.

ఒక్కొక్కరు నావలో ఎక్కసాగారు. యమునలో నీరు నులివెచ్చగా ఉంది. ఆకాశంలో నల్లమబ్బులు కమ్మడంతో నీళ్లు మరింత నల్లగా కనిపిస్తున్నాయి.

దేవఝరి బాబా మంచె స్పష్టంగా కనిపిస్తోంది. మంచె కింద చిన్నచిన్న తాత్కాలిక శిబిరాలు వున్నాయి. వాటిల్లో బాబా శిష్యులు వున్నారు. మధ్యమధ్యలో ఒకరిద్దరు లేచి యాత్రికుల్ని పర్యవేక్షిస్తున్నారు.

"యమునా మయ్యాకీ జై" అంటూ యాత్రికులు ఒక్కొక్కరూ నావలోంచి దిగారు.

---

## కొత్తగాలి...

**జీతం భరోసాతోనే**
**జీవితపయనం సగటు జీవికి**
**లంచం భరోసాతోనే**
**లగ్జరీలైఫ్ లంచావతారానికి**

– ఎం.ఎం.ఆర్.
*నరసాపురం, ప.గో. జిల్లా*

కూర్చునేందుకు జంపఖానాలు, చాపలు లాంటివి ఏవీ లేవు. దాంతో అందరూ ఇసులోనే కూర్చున్నారు. కుటీరంలోంచి బాబా ఇంకా బయటికి రాలేదు. ఒక రక మైన తీపి పదార్థం 'రస్‌భరీ' ముక్కలు నలువైపులా చెల్లాచెదురుగా పడివున్నాయి.

'దర్శనమివ్వు ప్రభూ' అంటూ గట్టిగా అరిచాడు ఓ వృద్ధ సరంగు. మిగతావాళ్లు కూడా 'దర్శనమివ్వు ప్రభూ' అంటూ మూకుమ్మడిగా కేక పెట్టారు.

బాబా కుటీరంలోంచి బయటికి వచ్చా డు. నగ్నంగా ఉన్నాడు. అతని శిరోజాలు కాకి ఈకల్లాగా జడలు కట్టి ఫాల్గుణ మాసంలో రాధాకుంజ్‌లోని మట్టిరంగులో వున్నాయి. ఆయన ఓ అడవి మనిషిలా కనిపిస్తున్నాడు.

అందరూ భక్తితో మోకాళ్లపైన వంగి దండప్రణామాలు ఆచరించారు. ఆ తర్వా త వరసగా అందరూ తమ తమ బాధలు విన్నవించుకోసాగారు.

బాబా శిష్యులు వెదురుబుట్ట తీసుకుని ఒక్కొక్కరి దగ్గరికి వెళ్లి కానుకలు సేకరిం చసాగారు. పళ్లు, పుచ్చకాయలు అధికంగా వున్నాయి. శిష్యులు వాటిని మంచెపైన వున్న బాబా ముందుంచారు. బాబా అంద రినీ ఆశీర్వదిస్తూ వాటిని ప్రసాదంగా భక్తు లకి పంచేశారు.

యాత్రికులు భక్తిశ్రద్ధలతో ప్రసాదాన్ని స్వీకరించారు. ఆ సమయంలో కౌపీన స్థానంలో బాబా కట్టుకున్న జింక చర్మం మధ్యమధ్యలో కిందకి జారిపోతోంది. ఆయన తన కుటీరంలోకి వెళ్లబోతుండగా ఓ ఆర్తనాదం ఆయనతోపాటు అక్కడున్న వాళ్లందరినీ తుళ్లిపడేలా చేసింది.

ఎముకల గూడులాంటి వృద్ధుడొకడు మంచె స్తంభం పట్టుకుని నిలబడ్డాడు.

అక్కడున్న జన సమూహంలో కలకలం రేగింది. "అరె, అతను రాంగోపాల్ మందిరం దగ్గర దొప్పులు చేసే ముస లాడు. ఏమయిందతనికి? పుట్టుకురుపా"

జన సమూహంలోంచి ఒకడు 'అవును, పుట్టుకురుపు రోగం' అంటూ అరిచాడు.

ఆ ముసలాడు మళ్లీ గొంతు చించు కుంటూ "స్వామీ నాకు చిన్న పిల్లలు వున్నారు. నేను ఛస్తే వాళ్లు రంగనాథుడి గుడిలో బిచ్చగత్తెల మధ్యన కూర్చోవాల్సి వస్తుంది" అంటూ బిగ్గరగా ఏడుస్తూ ఇసు కలో దొర్లసాగాడు.

దేవరఝురి బాబా ఏమీ మాట్లాడలేదు. బాబా మౌనం అక్కడి వాళ్లందరికీ నిరాశ కలిగించింది. మిగిలిన పళ్లని అకస్మాత్తుగా ఆ ముసలాడివైపు విసిరేశాడు బాబా.

"ఇదే చాలు. దొప్పులు చేసుకునే ఈ ముసలాడికిదే పదివేలు" అనుకుంటూ బా బాకి సాష్టాంగం చేశాడతను. దేవరఝురి బా బా గదిలోకి వెళ్లబోతుండగా ఆర్తనాదం వి నిపించి బాబా వెనక్కి తిరిగిచూశాడు.

సౌదామిని ఆశ్చర్యపోయింది. ఆమె మరెవరో కాదు, తన తల్లి అనుపమ.

"వినండి ప్రభూ! మీరు అప్పుడే వెళ్లిపో కండి! ఈరోజు నేను చెప్పేది వినాల్సిందే"

జనసమూహం మధ్యలోంచి లేచిన అనుపమ మరోరూపం దాల్చింది. ఆమె కళ్లు ఎర్రబడ్డాయి. ఆమె ఆవేశంతో నిలు వెల్లా వణుకుతూ సౌదామిని వైపు వేలెత్తి చూపిస్తూ "ప్రభూ! నాకోసం నేనేమీ కోర ను. కానీ మీరు ఈ అమ్మాయి బాధ్యత తీసుకోండి. ఏదైనా దారి చూపించండి. ఈమె జీవితం నాతో ముడివడిపోయింది. ఈమెకి తగిన మార్గదర్శనం చేయలేనేమో నని నా భయం. ఏం చేయాలో తెలియ డంలేదు. ఆందోళనగా ఉంది!" అంది.

"ఏంటి, ఈమె వితంతువా? " అంటూ జనాలు చెవులు కొరుక్కోసాగారు.

"అయితే ఈ దౌర్భాగ్యురాలు ఒంటరిగా నే యాత్రలు చేయాల్సి వస్తుంది. వ్రజభూ మిలోనైతే కుక్కలు, తోడేళ్లు చాలా వున్నా యి" గుసగుసలాడారు మరికొందరు.



"నోరు ముయ్యండి! చూడండి! బాబా ఆశీర్వదిస్తున్నాడు" అంటూ అరిచాడు గుంపులోంచి ఒకడు.

"ఈ యువతి కుక్కలూ తోడేళ్ల మధ్య ఉందన్న విషయం వాస్తవమే. కానీ చింతించాల్సిన పనిలేదు. మీకు సీత గుర్తు లేదా? ఆమె కూడా ఇలాగే కుక్కలు తోడేళ్ల మధ్యన ఉంది. కానీ ఎవ్వరైనా ఆమెకి హాని తలపెట్టగలిగారా? పశ్చిమాన మేఘాలు ముసురుకుంటున్నాయి. నావ సరంగులు తిరిగి వెళ్లిపోయే సమయం అయింది. వెళ్లండి, వెళ్లిపోండి" అన్నాడు ఉచ్చస్వరంతో బాబా.

భక్తులు సాష్టాంగ దండ ప్రణామాలు చేశారు. వాళ్ల నుదురు, వెంట్రుకలు ధూళి దూసరితమయ్యాయి.

నావలోకి ఎక్కిన సౌదామిని ఒక్కసారి వెనక్కి తిరిగి చూసింది. అందరూ వచ్చేశారు. దేవఝరి బాబా తన శిష్యులతో కుటీరంలోకి వెళ్లిపోయాడు.

నావ బయలుదేరే ముందు సౌదామిని మరోసారి వెనక్కితిరిగి చూసింది. బాబా మంచె కింద స్తంభాన్ని ఆనుకుని ఎవరో నిలబడి కనిపించాడు.

అతను అష్టధాతు వృద్ధ శిల్పి చంద్రభాను రాకేష్. గాలి బాగా వీస్తుండడంతో దుస్తులు అతని శరీరానికి అతుక్కుపోయాయి. దాంతో బక్కగా జ్వరపీడితుడిలా కనిపిస్తున్నాడతను. "రాకేష్ వచ్చేయ్" అంటూ గుంపులోంచి ఎవరో అరిచారు. కానీ అతను వెనక్కి తిరిగి చూడలేదు.

"వచ్చేయ్, నావ మళ్లీ దొరకదు" అరిచాడు మరో వ్యక్తి.

"అతనికి ఈత వచ్చు" అన్నారెవరో వ్యంగ్యంగా.

కానీ రాకేష్‌లో ఏమాత్రం చలనం కనిపించలేదు.

"గత కొద్దికాలంగా అతను ఎంతో ఉదాశీనంగా కనిపిస్తున్నాడు. బహుశా మీకందరికీ గుర్తుండే వుంటుంది. మౌనీ బాబా శవం యమున ఒడ్డున వుంచినపుడు అతని శిష్యులు బిచ్చగాళ్ల దగ్గర నుంచి రాగి, వెండి నాణాలు దోచుకున్నారు. అప్పుడు ఈ శిల్పి శవంపైన భక్తులు విసిరేసిన నాణాల కోసం బిచ్చగాళ్ల మధ్య జరిగిన తోపులాటని యథాతథంగా చిత్రీకరించారు. కసాయి విసిరేసిన మేకమాంసం పైన గద్దలు విరుచుకుపడుతున్నట్టుగా ఆ చిత్రం ప్రతిబింబిస్తుంది. ఆ చిత్రాన్ని తొలగించాల్సిందిగా రాకేష్‌కి సలహా ఇచ్చాను కూడా" అన్నాడు ఓ వ్యక్తి.

"ఔను, ఎంత భీభత్సంగా ఉండేది ఆ చిత్రం!" అన్నాడు మరో వ్యక్తి.

"ఈ మధ్య అతని అంగడిలో వినియోగదారులెవ్వరూ కనిపించడంలేదు దాంతో విగ్రహాలని అదేపనిగా నగిషీలు పెడుతూ కూర్చుంటాడు" అన్నారెవరో అకస్మాత్తుగా.

"ఈ రోజుల్లో అష్టధాతు బొమ్మల వ్యాపారం మందగించింది. ఎక్కువ మంది శిల్పులకి నిలువనీడైనా లేదు. రాకేష్ కోసం వేచి వుండడం అనవసరం. పదండి, వాతావరణం కూడా బాగుండలేదు"

అందరూ ఒకరి తర్వాత ఒకరు నావ ఎక్కారు. అనుపమలో ఏదో తెలియని బాధ చోటుచేసుకుంది. దేవఝరి బాబా కేవలం సీత కథ మాత్రమే వివరించాడు. కానీ ఎందరో సీతలు ఈ భూమ్మీద పు

**కొత్తగాలి...** 

**ఐస్ బకెట్ ఛాలెంజ్**
**రైస్ బకెట్ ఛాలెంజ్**
**ఏ బకెట్ అయితేనేమి**
**నిస్వార్థసేవ ఒక ఛాలెంజ్**

– బిక్కునూరి రాజేశ్వర్, పొన్కల్

ట్టారు. ఎంతోమంది సీతల వృత్తాంతాలు ఈ వ్రజభూమిలో కూరుకుపోయాయి.

యమున దగ్గర వర్షపు చినుకులు టప టపమంటూ పడుతున్నాయి. వర్షం ఇంత త్వరగా వస్తుందని ఎవరూ ఊహించలేదు. గాలి విపరీతంగా వీస్తోంది. "కేశ్ ఘాట్ వరకు వెళ్లనవసరం లేదు. నావని వంశీ ఘాట్ దగ్గర లంగరు వేసేయండి" అన్నారు ఒకరిద్దరు.

నావ వంశీఘాట్ చేరుకుంది. జనాలందరూ నావ దిగి పరుగెత్తసాగారు. ఎవరికీ ఎలాంటి చింతలేదు. తల్లీకూతురూ పరుగెత్తి వంశీఘాట్ దగ్గరున్న ఓ పాడుబడ్డ వసారాలో తలదాచుకున్నారు. దేవఝరి బాబా మంచె కనుమరుగయ్యింది. వర్షపు తెరవెనకాల మొత్తమంతా అలికినట్లుగా ఉంది. 'ఇది అకాల వర్షం' అన్నాడు వసారాకి మరో పక్కన భక్తుల మధ్య వున్న బలభద్రఘాట్ గుత్తేదారు.

"మంచిదేగా, నేల ఎలా ఎండిపోయిందో కనిపించడంలేదా? "

"ఇప్పుడు యమున ఒడ్డున పుచ్చకాయలు ఎక్కువగా పండుతాయి"

"ఈసారి రాధేశ్యామీలు పుచ్చకాయలు తిని ఆకలిమంటను తీర్చుకుంటారు"

"అయితే వాళ్లు మరేదీ తినరు. ఎందుకంటే ఒక్కో పైసకి ఇరవై పుచ్చకాయలు దొరుకుతాయి"

"బాగా చెప్పావు. వీళ్లలో ఎవరో ఒకరు దిట్టంగా తిని షాహ్‌జీ మందిరం మెట్లమీదనో, బాలాజీ మం దిరం ముందరో అజీర్ణంతో వాంతులు చేసుకుని మరణఘడియలు లెక్కిస్తారు.. తన కర్మకాండల కోసం మరణించిన ముసల్ది దాచుకున్న డబ్బుల్ని తీసుకోవడానికి దళారులు చెప్పులతో కొట్టుకుంటారు. నేను నా కళ్లతో స్వయంగా చూశాను. ఈ రకంగా మరణించిన ముసలిదానికి కూ డా ఒకటి, రెండు దెబ్బలు తగుల్తాయి" అంటూ బలభద్రఘాట్ కి చెందిన గుత్తేదారు గట్టిగా నిశ్వసిస్తూ "అసలు ఈ ప్ర జలో ఇలా ఎందుకు జరుగుతున్నట్టు? ఈ ధామం కళంకితమైపోయింది" అన్నాడు.

మైదాసంచుల్లా చతికిలబడ్డ జనం ఒక్కసారిగా పకపకానవ్వారు.

వర్షం తగ్గింది. దేవఝరి బాబా మంచె ఇప్పుడు స్పష్టంగా కనిపిస్తోంది. పాడుబడ్డ వసారాలోంచి ఒక్కొక్కరూ జాగ్రత్తగా బయటకి వచ్చారు.




**గో**పీనాథ్ బజారు నడిబొడ్డున బిహారీ మోహన్‌కుంజ్ ఉంది. ఇక్కడ ఓ ప్రాచీన మందిరం కూడా ఉండేది. మందిరాన్ని ఆనుకుని ఒక పాత వసారా ఉంది. బిహారీ మోహన్‌కుంజ్ ఎదురుగా రహస్యమైన 'హరాబరి' అనే పేరుగల భవనం ఉంది. దీని ద్వారాలు చెక్కతో తయారైనవే. కానీ లోపలికి ప్రవేశించగానే మరో లోకం కనిపిస్తుంది. ఇక్కడ రాయీ దామోదర దేవాలయం ఉంది. అనేక గదులు కూడా వున్నాయి. గడ్డీగాదంతో పావురాళ్ల గూళ్లలా నిర్మించిన కుటీరాల్లో కంకాళం లాంటి వృద్ధవితంతువులు వుంటారు. వాళ్లు రాధేశ్యామీలుగా మారి జీవితాన్ని గడుపుతున్నవాళ్లు.

బిహారీ మోహన్‌కుంజ్ మందిరంలో పూజలు, అర్చనలు చేసేందుకు ఆలంఘడీకి చెందిన పూజారి వున్నాడు. అందరూ

అతన్ని 'ఆలంఘడీ' అని పిలుస్తారు. మందిరానికి చెందిన స్వాములవారు వ్రజ భూమి బయట వుంటాడు. మందిర నిర్వహణలో స్వేచ్ఛ లభించడంతో ఆలంఘడీ బాగా లాభపడ్డాడు. ఎంతగా అంటే, చివరికి విగ్రహాలకి అలంకరించిన వెండి, బంగారు ఆభరణాలని సైతం తస్కరించాడు. కానీ ఈ మధ్యలో వ్రజభూమిలోని పనీపాటా లేని కొందరు యువకులు అతని వెనక పడ్డారు. వాళ్లు మందిరం ఎదురుగా వున్న టీకొట్టు దగ్గర సాయం సమయాల్లో స్థావరాన్ని ఏర్పరచుకోవడమే కాక శీతాకాలంలో మందిరం మెట్లపైన కూర్చుని ఫలహారాలు చేస్తుంటారు.

### కొత్తగాలి...

**ప్రేయసి పైరగాలి**
**పెళ్లాం ఫ్యాన్‌గాలి**
**అన్నాను ఖర్మకాలి**
**ఇక ఇంట్లో వడగాలి!**

– చి. మున్నబాబు,
కారంపూడి, గుంటూరు జిల్లా

ఇదే క్రమంలో ఆ పోకిరి యువకులు కొన్ని ప్రశంసనీయమైన పనులు కూడా చేశారు. ఏదో మందిరంలోని ఓ గుమాస్తా దేవతామూర్తికి అలంకరించిన వడ్డాణం దొంగిలించాడు. ఈ యువకులు అతడ్ని పట్టుకుని మెడలో ఇనపగొలుసులు వేసి అలంకరించిన గాడిదపైన కూర్చోబెట్టి పుర వీధుల్లో ఊరేగించారు. వ్రజలో వుండే పిల్లలే కాకుండా బావిని పూజించే స్త్రీలని అనుసరించే హిజ్రాలు సైతం ఆ ఊరేగింపులో అట్టహాసంగా పాల్గొన్నారు.

మందిరం మెట్లపైన నిలబడ్డ ఆలంఘడీ వాళ్లనుద్దేశించి "వెధవలు నరకానికి పోతారు" అంటూ గొణిగాడు.

కానీ ఆ రోజు నుంచి ఆలంఘడీకి భయం పట్టుకుంది. దాంతో మెట్లపైన కూర్చుని ఫలహారం చేసే పిల్లల్ని ఉత్సాహ పరచాలనుకున్నాడు.

శశిప్రభ అనే పేరుగల ఓ పచ్చి వితంతువు మందిరంలో పనులు చేస్తూ ఆలంఘడీకి సహాయపడేది. చివరికి ఆమె ఆలంఘడీతో పాటు ఒకే గదిలో ఉండసాగింది. కానీ అందుకు ఆ పోకిరీలవల్ల భయపడాల్సిన పని లేదు ఆలంఘడీకి. ఇలాంటి వితంతువుల్ని వుంచుకున్నవాళ్లు మరికొందరున్నారు. కేవలం ఇద్దరు వితంతువులు మాత్రమే నిశ్చింతగా మరణించారు. ఎం దుకంటే వాళ్లని తమతో వుంచుకున్నందుకు పూజారులు వాళ్ల అంత్యక్రియలు నిర్వహించారు.

ఆలంఘడీ సుఖశాంతులతో రోజులు గడుపుతున్నాడు. కానీ అకస్మాత్తుగా జరిగిన ఓ సంఘటనతో అతని సుఖశాంతులకి భంగం వాటిల్లింది. ఆ రోజు రాత్రి సమయంలో మందిరం మార్కెట్లు అన్నీ మూసివున్నాయి. ఆఖరికి సందులు గొందుల్లో బయటపడుకునే వాళ్లు కూడా నిద్రపోయారు. కేవలం మందిరం ఎదురుగా వున్న ఓ పెద్ద అంగడిలో మాత్రం మంద్రమైన కాంతిపరుచుకుని వుంది. ఆలంఘడీ మెలకువగానే వున్నాడు. అతని పక్కన మంచం మీద శశిప్రభ నిశ్చింతగా పడుకుని వుంది.

సరిగ్గా అప్పుడే గుర్రపు డెక్కల చప్పుడు, టాంగా చక్రాల డబడబలు వినిపించాయి. ఆ శబ్దాలు ఆలంఘడీ ఇంటిదాకా వచ్చి ఆగిపోయాయి. ఆలంఘడీ కిటికీ తలుపు తెరిచి చూశాడు. కింద టాంగా ఆగి వుంది. లాంతరు వత్తి కొంచెం పెంచి కంగారుగా కిందకి దిగివచ్చాడు. ఆగంతకుడి ముఖానికి దగ్గరగా లాంతరు ఎత్తిపెట్టి చూసి విస్మయానికి గురయ్యాడు. అతను బిహారీ మోహన్‌కుంజ్ ప్రస్తుత యజ

మాని, కృష్ణకాంత్ ఠాకూర్. అందరికీ అతను ఠాకూర్ సాహెబ్‌గా సుపరిచితుడు. అతనితోపాటు నలభై సంవత్సరాల వయస్సున్న అతని అవివాహిత కూతురు మృణాళిని, మానసిక రోగి అయిన భార్య వున్నారు. దుర్బలమైనవాళ్ల మొహాలు చూస్తుంటే అర్ధరాత్రిపూట ప్రేతాత్మల గుంపు వూడిపడినట్లుగా ప్రతిబింబిస్తున్నాయి.

ఆలంఘడీ మృణాళినితో "బిడ్డా! చెప్పాపెట్టకుండా వచ్చారేంటి?" అని అడిగాడు.

"అదంతా తర్వాత చెప్తాను. ముందు నాన్నగారి సంగతి చూడండి. గత పది సంవత్సరాలుగా మంచం మీదే వున్నారు. ఈమధ్య ఆయన కళ్లు కూడా పూర్తిగా కనిపించడం లేదు"

వాళ్లిద్దరూ కృష్ణకాంత్ ఠాకూర్ టాంగా లోంచి దిగేందుకు సహకరించారు. టాంగాలోంచి దిగుతుండగా కిర్రుకిర్రుమంటూ అతని మోకాళ్ల శబ్దం వినిపించింది. ఇదే సమయంలో అలికిడి విన్న శశిప్రభ లేచి వచ్చింది. ఆమె మంచాన్ని తీసి వరండాలో వేసింది. మృణాళిని లగేజీని దింపి టాంగాని పంపించేసి లోపలికి వచ్చింది.

"ఈ రోజు బండి లేటయ్యిందా? భోజన ఏర్పాట్లు చేయమంటారా?" అంటూ అడిగాడు ఆలంఘడీ.

"లేదు, భోజనాలు అవసరంలేదు"

"అయితే వేడివేడిగా టీ పెట్టిస్తాను. తాగండి!" అంది శశిప్రభ.

మృణాళిని కాళ్లూ చేతులూ కడుక్కోవడానికి బావి దగ్గరకి వెళ్లింది. శశి పాలకుంపటిలో ఆరిపోతున్న నిప్పుని మండించటానికి పిడకలు వేసింది. మృణాళిని లోపలికి వచ్చి శశిప్రభ దగ్గర కూర్చుంది.

"నువ్వేనా శశిప్రభవి? నీ దగ్గర నుంచి దైవానికి మహానివేదన అందడంలేదని నాన్నగారికి ఆకాశరామన్న ఉత్తరం వచ్చింది. ఆయనకు కనిపించదు. అన్నీ నేనే చూసుకోవాలి. వీళ్లతో చాలా ఇబ్బందిగా వుంది"

శశిప్రభ రెప్పవాల్చకుండా మృణాళిని వైపు అలాగే చూస్తూ మౌనంగా ఉండిపోయింది. ఇంతలో ఆలంఘడీ కూడా పాల కుంపటి దగ్గరకి వచ్చి కూర్చున్నాడు.

"బిడ్డా! కొన్నిరోజులపాటు ఇక్కడ ఉండాలని వచ్చారా?"

"శాశ్వతంగా ఇక్కడే వుండిపోవాలని వచ్చాం. మా పరిస్థితులు మీకు తెలిసినట్టు లేదు"

"శ్రీధామం వచ్చినవాళ్లు కొందరు చెప్పగా కొంతవరకు తెలిసింది. నీకు ఇద్దరు అన్నలు వున్నారుగా?"

"మీకు అన్నీ తెలిసినా తెలియనట్లే వున్నారు. పెద్దన్నయ్య మౌలానాపూర్ కాల్పుల్లో మరణించాడు. మీకీ విషయం తెలియకుండా వుంటుందా? అతని పార్టీకి చెందిన కొందరు చీకట్లో వచ్చి మా అన్నయ్య పార్టీ పేరుతో రౌడీయిజం చేస్తున్నాడని అన్నారు. మౌలానాపూర్ కాల్పుల్లో మరణించినందున శవాన్ని గుర్తుపట్టడానికి నేను వెళ్లాల్సి వచ్చింది. మళ్లీ నాకు ఆ విషయం గుర్తుచేయకండి"

"శశీ! నువ్వు వెళ్లి టీ తీసుకురా"

మృణాళిని మాటలు వింటున్న శశి టీ తయారుచేయడం మానేసి ఆశ్చర్యంతో ఆమెనే చూస్తూ వుండిపోయింది.

"నీ రెండో అన్న కూడా సరియైన మార్గంలో నడవట్లేదని విన్నాను"

"అతను కూడా అదే పార్టీలో వున్నాడు. ఒక్కోసారి అర్ధరాత్రి ఎవ్వరికంటా బడకుండా వస్తాడు. రావడం రావడం ఓ రాక్షసుడిలా వస్తాడు. చాలా ఆకలితో వుంటాడేమో విచిత్రంగా కనిపిస్తాడు. అతన్ని చూడ్డంతోటే నాకు కాళ్లూ చేతులూ ఆడవు. ముగ్గురికి సరిపడే భోజనం పళ్లెంలో వడ్డించి అతని దగ్గరే భయంతో కుంచించుకుపోయి కూర్చుంటాను. తినేటప్పుడు ఏదో నసుగుతాడు. 'మరెంతో కాలం లేదు. ఓ భయంకరమైన విప్లవం వస్తుం

## సాహితీ పిపాసి



**పాలకోడేటి కృష్ణమూర్తి**

పుట్టింది వీరవాసరం, పశ్చిమగోదావరి జిల్లా. పెరిగింది, చదివింది భాగ్యనగరంలో. 1972లో జ్యుడీషియల్ డిపార్టుమెంటులో ఉద్యోగప్రవేశం. 2000లో హైకోర్టు కార్యాలయం జుడికేచర్‌లో డిప్యూటీ రిజిస్ట్రార్‌గా ఉద్యోగవిరమణ.

చిన్నతనంలో అంటే 1960లో మల్లేపల్లి నుంచి వెలువడిన 'ఆటపాటలు' మాసపత్రిక నిర్వహించిన 'సినిమా' వ్యాసరచన పోటీలో ఏకైక బహుమతిగా వచ్చిన పారితోషికం ఐదు రూపాయల నోటు ఇప్పటికీ నా మదిలో రెపరెపలాడుతూనే ఉంది. 'బంధం' కథాసంపుటి, 'ప్రతిధ్వని' అనువాద కథాసంపుటి ప్రచురితం.

అపుడపుడు పత్రికల్లో కనిపించే నా రచనల్లో హాస్యం, చిలిపితనం అధికం.

ఈర్ష్య, ద్వేషం, అసూయలకు అతీతంగా సాహిత్యంలోని ఆనందాన్ని పొందుతాను.

ఈ అనువాదనవలను ప్రచురించిన చతుర సంపాదకులకు కృతజ్ఞతాభివందనలు.

**చిరునామా:**
**పాలకోడేటి కృష్ణమూర్తి**
5-9-1/65, కళ్యాణపురి కాలని
సైనిక్‌పురి, సికింద్రాబాద్-500094

ది. ఎందరో మరణిస్తారు. కానీ చెల్లీ! నువ్వు జీవితంలో ఏమీ పొందలేకపోయినందుకు బాధపడకు. నువ్వు ఈ విప్లవాన్ని తప్పకుండా చూస్తావు' అంటాడు. కానీ ఆలంఘడీజీ! ఎప్పుడు ఎవరిని చంపుతాడోనని నాకు భయంగానే వుంటుంది"

మృణాళిని మొహం పాలిపోయింది. ముక్కుపుటాలకి ఇరువైపులా రేఖలతో ఆమె విలక్షణంగా కనిపిస్తోంది. ఏదో ఒక రోజు తన చిన్నన్నయ్య నరహత్య చేస్తాడన్న భయం ఆమెలో చోటు చేసుకుంది.

ఠాకూర్ సాహెబ్‌కి, ఆయన భార్యకి శశి టీ ఇచ్చింది. అందరూ టీ తాగసాగారు. కొంతసేపు మౌనం చోటుచేసుకుంది.

టీ గుటకలు వేస్తూ మృణాళిని తదేకంగా శశిని చూడసాగింది. చిన్నవయసే. అందమైన మొహం. ఆలంఘడీ పూజారికీ, ఈమెకీ నింగికీ, నేలకి వున్నంత వ్యత్యాసముంది. టీగ్లాసులు ఓ పక్కగా ఉంచుతూ "ఇక పడుకుందాం. నేను పైకి వెళ్తాను. శశికి నేలపైన పడుకోవడం అలవాటే. మా గది పరిశుభ్రంగా వుంటుంది. తెల్లవారడానికి ఎంతో సమయం లేదు" అన్నాడు ఆలంఘడీ.

"నాకు నిద్రపోవాలని లేదు. ఆ ముసలాళ్లిద్దరి ఏర్పాట్లు చూడండి. శృంగారవటలో గణగణమంటూ గంటలు మోగే సమయం కూడా అయ్యింది" అంది మృణాళిని.

"నాకు కూడా నిద్రపోవాలని లేదు. యమున ఒడ్డుకి నావలు నడిపే సరంగులు వచ్చే సమయమయింది. వాళ్లు ఇంతక్రితమే వెళ్తుండగా దగ్గడం వినిపించింది" అంది శశి.

"యమునకి వెళ్లే సమయం అయినట్లుంది. మంచిదే. నేను కూడా నీతోపాటే మునకలేస్తాను. లాంతరు ఇటివ్వు. చాలా కాలమైంది. మందిరం గురించి అంతా మర్చిపోయాను"

లాంతరు తీసుకుని మృణాళిని బయటికొచ్చింది. ఇది బావి. పైకి వెళ్లేందుకు ఇవి పెచ్చులూడిన మెట్లు. కొంతసేపు ఇక్కడ విశ్రమిస్తే బాగుంటుంది. విశ్రమించిన మాత్రాన నిద్ర వస్తుందా? అనుకుంది.

గత ఎంతోకాలంగా ఏదో అజ్ఞాత భ

యం మృణాళిని మనస్సుని ఆవరించింది. దాంతో ఆమె చాలా ఇబ్బంది పడుతోంది. తన తండ్రి బరువుని మోస్తున్న తను గాడిదకన్నా ఎక్కువేమీ కాదని భావిస్తుంది. ఓ గాడిదలాగే తన తండ్రి బరువుని మోసి మోసి ఏదో ఒకరోజు నడిరోడ్డుపైన రక్తం కక్కుకుని కుప్పకూలిపోతుంది.

కొన్నిగదులు బావి కుడివైపు కూడా వున్నాయి. రెండు నుంచి ఐదు రూపాయల కిరాయి యిచ్చి వృద్ధ రాధేశ్యామీలు, భిక్షావృత్తిపైన ఆధారపడ్డ వైష్ణవస్త్రీలు ఇందులో వుండేవారు. మృణాళిని లాంతరు వెలుగును కొద్దిగా పెంచి చూసింది. తలుపులు మూసి వున్నాయి. ఎవరో దగ్గుతున్న శబ్దం వినిపిస్తోంది. ఈ వృద్ధరాధేశ్యామీలు బాగా పొద్దుపోయేవరకు నిద్రపోలేరు. లాంతరు పైకెత్తి మృణాళిని చివరి గదివైపు చూసింది. చాలాకాలం కిందట చిక్కిశల్యమైన ఓ ముసలిదాన్ని ఆ గదిలో చూసింది. యమునలో స్నానానికి ఇద్దరు వృద్ధ మహిళలు ఆమెను పట్టుకుని తీసుకువెళ్లేవారు. ఆ వృద్ధరాధేశ్యామీ మంచం పైన కూర్చుని అభాగినులైన సతుల కథలు వినిపించేది. రాజుగారితో పాటు మూడువందల మంది రాణులు సతీసహగమనం గావించిన కథ, వ్రజభూమి అభివృద్ధికి సహకరించిన గోస్వామీల కథ, మీరాబాయి, వల్లభాచార్యుడు, రూపగోస్వామి, సనాతనగోస్వామి, మాన్‌సింగ్ ఇంకా అసంఖ్యాక భక్తులైన రాజపుత్ర స్త్రీల కథలు.

ఆ ముసల్దాని గది ఎదురుగానే వుండడంతో మృణాళిని ఉలిక్కిపడింది. చెదలు తీసేసి డొల్ల అయిన తలుపులు తెరచివున్నాయి. లోపల ఎవరూ లేరు.

ఇంతలో "అక్కా! చీకట్లో ఏం చేస్తున్నావు? పద, వెళ్దాం. సమయం కావొచ్చింది" అంటూ శశి కంఠం వినిపించింది.

"ఆ ముసలాళ్లిద్దరూ పడుకునేందుకు ఏర్పాట్లు చేశావా? " అడిగింది మృణాళిని.

'ఆ ఏర్పాట్లన్నీ పూజారి చేశాడు. పద, రాధాష్టమి కారణంగా స్నానం చేయడానికి సరైన చోటు దొరకడం కష్టం" అంది శశి.

"సరే, నా బట్టలూ తీసుకురా. లాంతరు తీసుకువెళ్దాం. ఇంకా తెల్లవారలేదు"

ఇద్దరూ గోపీనాథ్ మందిరం దగ్గరకి చేరుకున్నారు. మసక చీకట్లో ఆ ఇద్దరూ ప్రేతాత్మల్లా అనిపిస్తున్నారు. ఇంతలో యమున ఒడ్డుకి శిరోముండనం కావించుకున్న వితంతువుల గుంపు వచ్చింది. వాళ్లు కూడా ప్రేతాత్మల్లా గోచరిస్తున్నారు.

"అక్కా! ఆగు, జాగ్రత్తగా దిగు. ఇది చాలా ప్రమాదకరమైంది"

"ప్రమాదకరమా? అంటే? "

"ఇక్కడున్న జలాల్లో ఏదో దేవత నివాసముంటోందని జనాలు అంటుంటారు. ఇక్కడ చాలామంది మరణించారు. రెండు రోజుల క్రితం బర్సానా మందిరానికి చెందిన ఓ పూలమ్మి ఇక్కడే చచ్చిపోయింది. ఆమెని గుర్తుపట్టలేనంతగా తాబేళ్లు కొరికేశాయి"

"అయితే ఇంకొంచెం ముందుకెళ్దాం"

"అఖ్ఖర్లేదు అక్కా! కంగారుపడక్కర లేదు. భయంకరమైన ఆ చోటు వెనకాల వుంది. నువ్వు జాగ్రత్తగా రా"

ఇద్దరూ గట్టుపైకి వచ్చేశారు. నది ఒడ్డున ఇసుకలో నడవడం హాయిగా వుంది.

## కొత్తగాలి...

గ్యాసు లీకు
ప్రశ్నపత్రం లీకు
రహస్యాలు లీకు
ఎక్కడుంది 'వీకు'?

– గు.గో.కృ, అరసవల్లి

యమున నెమ్మదిగా ప్రవహిస్తోంది.

"అక్కా, ఇక్కడ బాగుంటుంది" అంటూ మృణాళిని సమాధానం కోసం వేచి చూడ కుండా బట్టలు విప్పేసింది శశి. శరీరంపై ఓ పల్చటి ఆచ్ఛాదన తప్ప మరేదీలేదు.

"అక్కా, నీళ్లలో దిగడానికి నీకు భయంగా వున్నట్టుంది. నేను సహాయం చేస్తాను, రా"

సమాధానం చెప్పేలోగా అర్ధనగ్నంగా వున్న మృణాళినిని ఒడిలోకి లాక్కుంది శశి. ఆ స్పర్శతో శశిని ఓ పిశాచాన్ని చూసినట్టు చూసి తుళ్లిపడింది మృణాళిని.

"జరుగు, జరుగు. ఇలా తాకకు. తెల్లవా రబోతోంది. సరిగ్గా బట్టలు తొడుక్కుని




నీళ్లలోకి దిగు" అంది మృణాళిని.

"ఎందుకు అక్కా, తెల్లవారేందుకు ఇంకా చాలా సమయం వుంది. నేను ఎప్పుడూ ఇలాగే స్నానం చేస్తాను. అదీగాక నాకు బట్టలు ఎక్కువ లేవు" అంది శశి.

చీకట్లో శశి యవ్వనాన్ని చూసి ఆశ్చర్య పోయింది మృణాళిని. రెండు దశాబ్దాల క్రితంనాటి తన యవ్వనం శశిలో కనిపిం చింది. ఒక విచిత్రమైన అనుభూతి ఆమె శరీరాన్ని అల్లుకుపోయింది.

"బట్టలు సరిగ్గా వేసుకుని నీళ్లలోకి దిగు, లేకపోతే దూరంగా వెళ్లి స్నానం చెయ్యి. నన్నుఒంటరిగా స్నానం చేయనివ్వు.. ఏం చూస్తున్నావు.. వెళ్లు, నన్ను ఒంటరిగా వదిలెయ్" అంది మృణాళిని వణుకుతున్న కంఠంతో.

శశి కొంచెం పక్కకి జరిగి మృణాళినిని చూడసాగింది. కొన్ని క్షణాల తర్వాతగానీ మామూలు స్థితికి రాలేకపోయింది శశి. ఆమె నీళ్లలోకి దిగింది. ఈ సమయంలో యమునలో నీళ్లు గోరువెచ్చగా వుంటాయి. అదే పగలు అయితే శశి యమునలో ఈత కొడుతూ చాలాసేపు గడుపుతుంది - ఉల్లాసంగా, ఉత్సాహంగా. శృంగారవట లోని గంటల శబ్దం విన్న తర్వాత ఆమె నీళ్లలోంచి బయటకి వచ్చేసింది. హారతి గంట ఇంకా మోగలేదు. తెల్లవారడానికి ఇంకా చాలా సమయమున్నట్టుంది.

ఇద్దరూ మౌనంగా దుస్తులు ధరించి ఇంటిదారి పట్టారు. శశి మౌనం వహిం చింది. ఆమె మౌనాన్ని భగ్నం చేస్తూ మృ ణాళిని "ఈసారి అంతా పోగొట్టుకుని ఇక్క డికి వచ్చాం. తిరిగి వెళ్లేందుకు అన్ని మార్గాలూ మూసుకుపోయాయి" అంది.

"అంటే? "

"పాతిక సంవత్సరాలుగా తీరిగ్గా తిని కూర్చోవడంతోనే సరిపోయింది మా నాన్నకి. అంతా హారతి కర్పూరం అయి పోయింది. ఇప్పుడేమీ లేదు"

"మీ నాన్న స్వాతంత్ర్యసమరంలో పాల్గొ న్నాడని విన్నాను"

"నువ్వు విన్నది తప్పు. మానాన్న ఆంగ్లే యుల్ని ప్రశంసిస్తాడు. ఇప్పటికీ ప్రశంసి స్తూనే వుంటాడు. ఆయన ఉద్యమంలో పాలు పంచుకున్నాడన్న విషయం అబ ద్ధం. ఆయన అంత మహనీయుడేంకాదు"

"అక్కా! నేను చెప్పిన ప్రమాదకరమైన చోటు ఇదే. నా చెయ్యి పట్టుకో"

"అక్కర్లేదు. భయంలేదు. వెనక నించి ఎవరో పిలుస్తున్నట్టుగా వుంది"

"రేవు దగ్గర వుండే బ్రాహ్మణుడిది ఆ గొంతు. నేను ఈ రోజు అతని దగ్గర నుంచి పసుపు, కుంకుమ, తిలకం స్వీకరిం

చలేదుగా"

"ఏంటీ నువ్వు రోజూ అతని దగ్గర తీసుకుంటావా? "

"లేకపోతే అతను వదలడు. మనమిచ్చే రెండు పైసల కోసమే కదా అతనక్కడ అర్ధరాత్రినుంచి కూర్చునుండేది"

ఇద్దరూ ఇసుక కప్పేసిన పురాతన మెట్లు ఎక్కసాగారు.

"బిహారీమోహన్‌కుంజ్ అమ్మేయాలన్న ఉద్దేశంతో మేం ఇక్కడికి వచ్చాం" అంది మృణాళిని.

శశి ఆశ్చర్యపోయింది. వెంటనే తమాయించుకుని "మందిరం అమ్మేసి ఎక్కడ వుందామని? " అని అడిగింది.

"వృద్ధరాధేశ్యామీల గదుల్లో ఒకటి ఖాళీగా వున్నట్టుంది"

"అదో మురికి కూపం.. ముసలిదానిలా! ఛీ!ఛీ!! నీకు తెలియదు, ఆ గదిలోని ముసల్ది ఎంతటి పాడురోగంతో చచ్చిందో. అక్కడంతా శుభ్రం చేశాను. అయినా లోపలికి వెళ్లలేకపోయాను"

"ఇవన్నీ పట్టించుకోవడం కుదరదు. ఇప్పుడు మేం నిస్సహాయులం. మందిరాన్ని అమ్మి న తర్వాత ట్రస్టుద్వారా వచ్చే ఆదాయంతో గడపాల్సి వుంటుంది. మరో మార్గంలేదు. ఎందుకంటే ఇంట్లో వస్తువులన్నీ అమ్మేసి బాకీలు తీర్చేసి వచ్చాం"

శశి మరేమీ మాట్లాడలేదు. ఆమె కళ్లు చెమ్మగిల్లాయి. మందిరం అమ్ముకోవడమంటే అంతా ముగిసిపోయినట్లే.

"శశీ! ఘాట్ దగ్గరున్న మందిరం తలుపులు తెరచినట్టున్నారు. వెళ్లి దణ్ణం పెట్టుకొస్తాను" అంది మృణాళిని.

ఇద్దరూ మందిరం నుంచి తిరిగి వస్తున్నప్పుడు కూడా వెలుగురేఖలు విచ్చుకోలేదు. కానీ గోవింద్‌జీ, రాధా-దామోదర్ ఇంకా హనుమంతుడి గుళ్లలోని శంఖనాదాలు, గంటల శబ్దాలతో బృందావనం ప్రతిధ్వనించింది. గతంలో ఎన్ని బాధలు పడుతున్నప్పటికీ ఇలాంటి సుప్రభాత వేళ ఆనందకరమైన అనుభూతి కలిగేది శశికి. కానీ ఈరోజు ఎందుకో ఏకాంతం కోరుకుంటోంది ఆమె మనసు.

★ ★ ★

దేవఝురి బాబాని కలుసుకుని తిరిగి వచ్చిన తర్వాత అనుపమ మరింత ఉదాశీనంగా మారిపోయింది. పూర్తి విశ్రాంతి సాధ్యం కావటంలేదు. వ్రజభూమిలో ఎనభై నాలుగు క్రోసుల ప్రదక్షిణానికి సమయం ఆసన్నమైంది. ప్రదక్షిణ ఏర్పాట్ల కోసం పండాలు హనుమాన్ టీలా, బాంకే బిహారీ ఉద్యానవనాల్లో సమావేశాలు నిర్వహించారు. ఈ క్రమంలో అక్కడ వెలసిన డేరాలు ఒంటె మూపుల్ని తలపిస్తున్నాయి. వివిధ మందిరాల విలక్షణమైన జెండాలు పట్టుకుని సెంట్రీలు గుర్రాలపైన అభ్యాసం మెదలుపెట్టారు. వాళ్లు వ్రజభూమిలోని పవిత్ర స్థలాలన్నింటినీ చుట్టిరావాల్సి వుంటుంది. వేలకొద్దీ భక్తుల పాద ధూళి దూసరితమైన మధురలోని మార్గాలు, కంసుని వధించిన తర్వాత భగవంతుని నుదుటిమీద పట్టిన చెమట బిందువుల్ని తుడుచుకున్న ప్రాంతం, త్రేతాయుగంలో లవణాసురుని వధించిన ప్రాంతం, కృత యుగంలో భగవంతుడు హిరణ్యాక్షుడిని వధించి విశ్రమించిన విశ్రామ్‌ఘాట్, మహారాజ్ సింధియా మానస మందిరం, ద్వారకాధీశుని ఆలయం, కలియుగంలో ప్రభువు వరాహుని చతుర్భుజ మందిరం, గోకర్ణమహాదేవ్, పంచముఖి హనుమాన్, సోమతీర్థం, భూతేశ్వర్.. లేదు, లేదు ఈ అవకాశాన్ని వదులుకోవటానికి ఇష్టపడలేదు అనుపమ. జీవితంలో ఇంతమంచి అవకాశం మళ్లీ రాదని ఆమె ఆలోచన.

ఒకరోజు వృద్ధురాలు రాధేశ్యామీ అనుపమకి బావిలోని నీరందిస్తూ "అమ్మా! మీరు డోలీలో వెళ్లండి. అష్టధాతు శిల్పి రాకేష్ పాతడోలీలని పాలిష్ పెడుతుండగా

చూశాను" అంది.

ఆ మాటలకి అనుపమ సంతోషించింది. నిజమే. మార్గమధ్యంలో ఎలాంటి ఇబ్బంది ఎదురైనా భయపడవలసిన పనుండదు. నందగావ్, బర్సానాలోని వికలాంగ భక్తులు డోలీలు ఏర్పాటు చేసుకోకముందే తను ఒక డోలీకోసం ఈరోజే ప్రయత్నిం చాలని అనుకుంది అనుపమ.

కిటికీ తలుపులు తెరిచింది అనుపమ. రోడ్డుమీద జనబాహుళ్యం అధికంగా వుంది. అందంగా అలంకరించిన గుర్రాల పైన జెండాలు రెపరెపలాడుతున్నాయి. రాధారమణ, గోవిందుని చిహ్నాలున్న ఎరు పురంగు రుమాళ్లు తలకి చుట్టుకుని యాత్రికుల సమూహం ముందుకి వెళ్తోం ది. ఈరోజు కృష్ణాష్టమి. బహుశా అందుకే ఇంత జనం. అనుపమ వాస్తవంలోకి వచ్చింది. సౌదామినిని బాంకేబిహారీ ప్రాంగణంలోకి తీసుకువెళ్లాల్సి వుంది. ఇలాంటి శుభప్రదమైన క్షణాలలో జీవుల మనోద్వారాలు తెరుచుకుంటాయి. కానీ సౌదామిని యువవయసులో వున్న యువ తి. ఆమె మనోద్వారాలు? అనుపమ నాసి కపైన స్వేదబిందువులు చిందాయి. మహ త్తరమైన ఈ క్షణాల్ని సద్వినియోగపరచు కోవాలి. కానీ సౌదామిని ఎనభైనాలుగు క్రోసుల ప్రదక్షిణం చేయగలదా? ఇందుకు ఆమె తట్టుకోగలదా? మూడు నెలలు ఎడ్ల బండిలో ప్రయాణించడం, గుడారాల్లో ఉండడం, ఇలాంటి ఇబ్బందుల్ని తట్టుకోగ లదా ఆమె? కృష్ణాష్టమి వేడుక నందో త్సవం చూడటానికి తల్లీకూతురూ బయ లుదేరారు. హరిద్వార్, ద్వారక, అయోధ్య, లతావన్ సందర్శించే భక్తులతో శ్రీధామ మైన బృందావనం వీధులు, సందులు గొందులు కిక్కిరిసి ఉన్నాయి. కృష్ణమంది రం సందులో ఓ వరుసలో కూర్చుని బిచ్చం అడుక్కునే కుష్ఠురోగుల్ని జనాలు తొక్కుకుంటూ వెళ్లిపోతున్నారు. వాళ్ల బొచ్చెలు నాణాలతో నిండి ఉన్నాయి.

నందోత్సవం మొదలైంది. ముఖద్వారం గుండా లోపలికి ప్రవేశించడం అనుపమ, సౌదామినిలకి అసాధ్యంగా ఉంది. పాదర క్షలు ఉంచే స్థలాన్ని కూడా జనం వద లేదు. ఇంతలో అకస్మాత్తుగా సౌదామిని దృష్టి, స్టోర్ రూం దగ్గర నుంచి వాళ్ల అస హాయ స్థితిని గమనిస్తున్న ఓ వ్యక్తి మీద పడింది. ఆ కళ్లని ఎక్కడో చూసినట్టు అని పించింది సౌదామినికి. కానీ ఎక్కడ? కొన్ని క్షణాల తర్వాత గుర్తొచ్చింది, మధు రలో చూసినట్లు.

జనాన్ని తోసుకుంటూ చరణ్‌బిహారీ వాళ్ల ముందుకొచ్చాడు. అత్యంత భక్తిపూ ర్వకంగా "రాధే-రాధే" అన్నాడు.

అనుపమ కూడా తలవంచి "రాధే - రాధే" అంది.

"ఇలా నిలబడితే మీరు దర్శనం చేసుకో వడం అసాధ్యం. నా వెనకాలే రండి" అన్నాడతను.

జనాన్ని తోసుకుంటూ ఆ ఇద్దరూ వెంట రాగా చరణ్‌బిహారీ ఓ రహస్య మార్గం గుండా విశాలరంగ మండపం పైన ఉన్న వరండాలోకి చేరుకున్నారు. "ఇక్కడి నుంచి కింద జరుగుతున్న ఉత్సవ కోలా హలం, బిహారీజీ దివ్యవైభవాన్ని చూడ వచ్చు, వినవచ్చు" అన్నాడు. ఒక్క క్షణం ఆగి మళ్లీ అతను "మందిరంలోని ప్రధాన పండాలకి తప్ప ఇతర పండాలకి ఇక్కడకి అనుమతి లేదు. నా పరివారం కోసం ఈ స్థలం ప్రత్యేకం. నావాళ్లు రాలేకపోయారు. మీరు ఎలాంటి ఇబ్బందీ లేకుండా దర్శనం చేసుకోండి" అన్నాడు.

"మీకు కృతజ్ఞతలు ఎలా తెలపాలో అర్థం కావడం లేదు" అంది అనుపమ.

"అలా అనకండి. యాత్రికులకి సహాయ సహకారాలందించడం మా ధర్మం. వెళ్లేట ప్పుడు కూడా మీరు గుంపులోంచి కాకుం డా అష్టసఖీ మందిరం ద్వారా మదన్‌మో

హన్ మందిర సమీపానికి చేరుకోవచ్చు.

సరిగ్గా అప్పుడే మందిర ప్రాంగణంలో విస్తారంగా నూనె, నీళ్లు విరజిమ్మారు. జారితే దూరంగా వెళ్లిపడేలా ఉంది ఆ ప్రాంగణం. అప్పుడే నీళ్లలోంచి బయటికొచ్చి ఎండలో తళతళ మెరుస్తున్న బర్రె వీపులా ఉంది ఆ ప్రాంగణం.

ఉత్సవం ప్రారంభమైంది. "ఈసారి కృష్ణుడి ప్రాంగణంలో సువర్ణ కంఠహారం విసిరే భాగ్యం బర్సానాలోని రామ్‌నివాసి అయిన సెఠానీకి ప్రాప్తించింది. అక్బరు చక్రవర్తి కాలంలో సీతారాముల్ని ముద్రించిన బంగారు నాణాన్ని బహుమతిగా ప్రదానం చేస్తారు" అంటూ తళుకులీనుతున్న జోధ్‌పురికోటు వేసుకున్న పండా ఉచ్చస్వరంతో ప్రకటన పత్రాన్ని చదివాడు.

జనంలో గుసగుసలు మొదలయ్యాయి. అనుపమ పక్కన నిలబడ్డ వ్రజవాసి మహిళ ఒకరు "సెఠానీది ఈ ప్రాంతమేనా? " అని అడిగింది.

"తెలియదు" అంది అనుపమ.

ఇంతలో మరో స్త్రీ కలగజేసుకుంటూ "అవును, ఆమె ఈ ప్రాంతానికి చెందిన మనిషే. కృష్ణభక్తురాలు. ఆమె మదనోత్సవంనాడు రాధేశ్యామీలకి, భిక్షాటన చేసే వితంతువులకి కంబళ్లు కూడా పంచుతుంది" అంది.

సరిగ్గా అప్పుడే తుపాకులు పేలిన శబ్దాలు వినిపించాయి. అందరూ ఆత్రుతగా అటువైపు చూశారు.

భక్తిపూర్వకంగా శిరస్సు వంచి కృష్ణుడికి నమస్కరించి కంఠహారాన్ని వేగంగా నేలపైకి విసిరేసింది సెఠానీ. అర్ధనగ్నంగా ఉన్న బ్రాహ్మణ పిల్లలు కొందరు ముందు కురికారు. దానికోసంవారు నేలపై ఈదుతున్నట్టుగా ఉంది. 'లట్టా' మేళాలోని ఆటలో లాగా పిల్లలు మాటిమాటికీ జారిపోతున్నారు. వాళ్లు మోకాళ్లపైన నడుస్తుండటంతో కోతుల్లా కనిపిస్తున్నారు. కంఠహారం ఉన్న చోటుకి చేరుకోవడం అసాధ్యంగా కనిపిస్తోంది వాళ్లకి.

కోలాహలం, ఈలల మధ్య ఎవ్వరికీ మాటలేవీ వినిపించటం లేదు. చాలా మంది పిల్లలు అలసటతో రొప్పుతున్నారు.

అనుపమ దగ్గర్లో కూర్చున్న వ్రజవాసి ఒకరు తలమీద ఉన్న మేలి ముసుగుని పైకి ఎత్తి "మూడు రోజులుగా నూనె పోసి పోసి గచ్చుని నున్నగా చేశారు. ఈ రోజు కంఠాభరణాన్ని ఎవరూ అందుకోలేరేమోననిపిస్తోంది" అంది.

పోటీలో పాల్గొన్న పిల్లలకి కృష్ణచరణామృతం అందింది. తాగేందుకు లస్సీ కూడా ఇచ్చారు. కొంత విరామం తర్వాత ఆట మళ్లీ మొదలైంది. ఈసారి పెద్దగా సమయం పట్టలేదు. పిల్లలు జారిపోకుండా జాగ్రత్తగా ముందుకు వెళ్లే లోపల పండా కొడుకు ఎవరో వింటి నుంచి సంధించిన బాణంలా దూసుకు వెళ్లి తటాలున కంఠహారాన్ని అందుకున్నాడు.

హర్షాతిరేకాలతో, కేరింతలతో ఆ ప్రాంతమంతా మారుమోగింది. ఆ తర్వాత ప్రేక్షకులు చెదిరిపోయారు.

"మనం వెళ్లిపోవడం మంచిది. అష్టసఖి మందిరం వైపు నుంచి మార్గం ఉన్నట్టు చరణ్‌బిహారీ చెప్పాడు" అంది అనుపమ.

జనాల తోపులాటలో ఇద్దరి దుస్తులు చిరిగిపోయే పరిస్థితి వచ్చింది. ఓ వరు

## కొత్తగాలి...

**కొలనులోని కలువ కన్యలు**
**ధవళవస్త్రాలు ధరించి**
**కలవరిస్తున్నాయి**
**నెలరాజు రాకకై!!**

– వెల్మల రాంరెడ్డి,
పూడూరు, కరీంనగర్ జిల్లా

సలో కూర్చున్న కుష్ఠువాళ్లకి కూడా జనాల తొక్కిసలాట తప్పలేదు. అయినా వాళ్లు స్థిరంగానే ఉన్నారు.

"మదన్‌మోహన్ మందిర ద్వారాలు తెరిచి ఉన్నాయి" అంది అనుపమ.

ఇంతలో చరణ్‌బిహారి ప్రత్యక్షమయ్యాడు. "పదండి, మీకు మదనమోహనుడి దర్శనం చేయిస్తాను. ఇప్పుడు పండాలెవరూ దొరకరు. కానీ నాతో మాత్రం పండాలతో వ్యవహరించినట్టు వ్యవహరించకండి" అంటూ చరణ్‌బిహారీ తన తరహాలో చెబుతూ పగలబడి నవ్వాడు. ముగ్గురూ మెట్లదారి పట్టారు. ఎవరో వదిలేసిన రెండు గొడుగులు కనిపించాయక్కడ. అక్కడక్కడ గబ్బిలాలు గూళ్లు కట్టుకుని ఉండటం చూశారు. గతంలో మందిరం వరకు వెళ్లడానికి అనేక మార్గాలుండేవి. ఇప్పుడు వాటి చుట్టూ తీగలు అల్లుకుపోయి కనిపించాయి. ఓ వేపచెట్టు కిందకి చేరుకోగానే చరణ్‌బిహారీ "ఈ వేపచెట్టుని చూడండి. మహాకవి తులసీదాసు దీని కిందనే కూర్చుని 'నువ్వు ఈ శ్యామ రూపం వదిలి నా ప్రియమైన ధనుర్ధారి దశరథుని కుమారుడైన రాముడి రూపం చూపించు' అంటూ మదనమోహనుడిని ప్రార్థించాడు. ప్రజలు చెప్పేది ఏంటంటే ఈ అనన్య భక్తుని మనోవాంఛా ఫలసిద్ధ్యర్థం మదనమోహనుడు ఓ ప్రత్యేకమైన అద్భుత రూపధారణ కావించాడని - వక్షస్థలం మీద భృగుపద చిహ్నం, సింహస్కంధం, కంబుగ్రీవం, బృందావన విహారీ ఓ అద్వితీయమైన భిన్నరూపం" అన్నాడు.

ముగ్గురూ మిగిలిన మెట్లు కూడా ఎక్కి దూరంగా ప్రవహిస్తున్న మనోహరమైన యమునా నది దృశ్యం చూశారు. మధ్య మధ్యన తుమ్మ మొక్కలతో నిండి ఉన్న ఇసుక తిన్నెలు రెండు కనిపించాయి.

"మందిరంలో మహానివేదన జరుగుతున్నట్టుంది. తలుపులు మూసేశారు. ఇక్కడ కొంచెం సేపు వేచి ఉందాం. పదండి మీరు 'ఆదిత్యతిల' (సాహితీపరంగా ఈ సమాధి సూర్యుడి అధిదేవత, సూర్యుడికి పవిత్రమైంది) దగ్గర కూర్చోండి" అన్నాడు బిహారి.

కొంతసేపటి తర్వాత 'ఆదిత్యతిల' మందిరం తలుపులు తెరుచుకున్నాయి. ప్రధాన మందిరం నుంచి శంఖనాదం, గంటల ధ్వని వినిపించాయి. "నేను ఇక్కడ కూర్చుని జపమాలతో ధ్యానం చేసుకుంటాను. ఈలోగా మీరు ప్రదక్షిణలు చేసి రండి" అంది అనుపమ.

పూలదండ, ప్రసాదం తేవడానికి చరణ్ బిహారీ మందిరంలోకి వెళ్లాడు. బాంకే బిహారీ మందిరంలో లాగ ఇక్కడ పెద్దగా జనం లేరు. సౌదామిని పూలతో నిండిన 'గుల్మొహర్' వృక్షం కింద కూర్చుంది. చిన్నచిన్న కొమ్మల రెమ్మల మధ్య పూలు వికసించాయి. ఆకాశం మేఘావృతమైంది. సౌదామినికి ఆహ్లాదంగా ఉంది. చాలా సేపు ప్రశాంతంగా అక్కడే కూర్చుందామనుకుంది. కానీ చరణ్‌బిహారీ ఓ నీడలా ఆమెని అంటిపెట్టుకునే ఉన్నాడు. ఎదురుగా వస్తూ కనిపించాడతను.

"ఇక్కడ నుంచి యమున మనోహరంగా కనిపిస్తోంది. చూడండి, తాబేళ్లు ఎలా పాకుతున్నాయో. బహుశా మీకు గుర్తుండే ఉంటుంది. మొదటి రోజు మధుర నుంచి బృందావనం వరకూ నేను మీ వెనకాలే వచ్చాను. మీరు తీర్థయాత్ర చేసేందుకు వచ్చారేమో అనుకున్నాను. ఇక్కడే ఉండిపోవాలన్న ఉద్దేశంతో వచ్చారని నాకు తెలియదు. మీరు ఇక్కడే ఉంటారా? నిజమేనా! మీలాంటి యుక్త వయస్సు వాళ్లు ఈ వ్రజలో అసంఖ్యాకంగా ఉన్నారు. వాళ్లు మూర్ఛరోగంతో కునారిల్లుతుంటారని జనాలు అంటూంటారు"

సౌదామిని మౌనంగా ఉండిపోయింది. జడలో తురిమిన మల్లెపూదండ వాడిపోవ

డంతో తీసి దూరంగా విసిరేసింది.

★ ★ ★

ఠాకూర్‌సాహెబ్ బిహారీమోహన్ కుంజ్ ఇంకా అమ్ముడుపోలేదు. చేతిలో ఉన్న పైకం అయిపోవచ్చింది. దినపత్రికల్లో ప్రకటనలు చూసి ఇంకా పండాల ద్వారా సమాచారం అందుకున్న కొనుగోలుదార్లు కొందరు వచ్చారు కూడా. కానీ వాళ్ల బేరసారాలు ఠాకూర్‌సాహెబ్‌ని గందరగోళపరిచాయి. డబ్బున్నవాళ్లు కూడా కూటికి అర్రులు చాచే రాక్షసుల్లా కనిపించారు. అంతేకాదు, మందిరాన్ని బేరంపెట్టారని తెలిసి కొందరు పండాలు డబ్బు కోసం దళారీల్లా వ్యవహరించసాగారు.

సాయంకాలం మెట్లమీద కూర్చోగానే

> **కొత్తగాలి...**
>
> **అమ్మ, ఆవకాయ, అచ్చంగిల్లా!**
> **ఆనాటి బాల్యం**
> **మమ్మీ, మ్యాగీ, న్యూడుల్స్,**
> **మొబైల్‌గేమ్స్**
> **ఈనాటి బాల్యం!**
>
> – యస్. వేణుగోపాల్, ఓల్డ్ సఫిల్‌గూడ

ఠాకూర్‌సాహెబ్‌ని పండాల గుంపు చుట్టుముడుతుంది. మెట్లపైన కూర్చుని ఠాకూర్ సాహెబ్ విచిత్రమైన వృత్తాంతాలు వింటుంటాడు. ఒకరోజు రాధామాధవ్ మందిరానికి చెందిన ఓ పండా యువకుడు "ఈ బిహారీమోహన్ కుంజ్ రాధామాధవ్ స్థలంలో వుంది. అందువల్ల మందిరం అమ్ముడవ్వగానే నాలుగు భాగాలలో ఒక భాగం పండాలకి కూడా చెందుతుంది" అన్నాడు. ఇలాంటి విచిత్ర వృత్తాంతాలు ఠాకూర్‌సాహెబ్ మెట్లపైన వింటుంటాడు.

మనదగ్గర మిగిలిన డబ్బుతో గట్టిగా మరో నెలరోజులు గడపవచ్చు. ఆ తర్వాత గదిలో ఉండాల్సిందే. ట్రస్టుద్వారా వచ్చే డబ్బులతో రోజులు గడపాల్సివుంటుంది. చూస్తూచూస్తూ నీ సంపాదనంతా తాగుడికి, చేపల కూరకి ఖర్చు చేసి ఇల్లు గుల్ల చేశావు. అందుకు బతికి వుండగానే శిక్ష అనుభవించాల్సివస్తోంది. గోవర్ధన పూజ (ఈ పూజ 'అన్నకూటం' అని ప్రసిద్ధి చెందింది) వరకు డబ్బు సరిపోవడమే గొప్ప విషయం" అంటూ మృణాళిని అప్పుడప్పుడు తండ్రిని తూలనాడుతోంది.

వైభవమైన 'అన్నకూట' ఉత్సవం వచ్చేసింది. ఈ ఉత్సవ గొప్పదనం వ్రజభూమి విశేషం. ఈరోజు వితంతువులెవ్వరూ గదుల్లో ఉండరు. ఏభై ఆరు నైవేద్యాలు, ముప్పైఆరు కూరలతో చేసిన భక్ష్యాలను పెద్దయెత్తున సిద్ధం చేస్తారు. మందిరంలో ఆహార పదార్థాల రాశుల మధ్య విరాజమానంగా శోభిస్తున్న రాధాకృష్ణుల శృంగార విగ్రహాల సముఖంలో ప్రతి వితంతువూ శిరస్సువంచి నమస్కరిస్తుంది.

ఈ మధురమైన దృశ్యాన్ని చూస్తుండగా సౌదామిని చెవిలో "కళ్ళు తెరచి చూడు! భక్తులకి పుష్కలంగా పంచిపెట్టే 'అన్నకూట' దర్శనం చేసుకో! దీనివల్ల ఒక ఏడాదిపాటు అన్నానికి లోటుండదు" ఎవరో అనడం వినిపించింది.

చింపిరి గుడ్డలతో వున్న ఓ రాధేశ్యామీ నడవలేని ఓ వృద్ధురాలిని చేత్తో ఎత్తుకుని అన్నకూట దర్శనం చేయించడం చూసింది మృణాళిని.

అక్కడున్న జనసమూహంలో అర్థాకలితో జీవనం గడిపే రాధేశ్యామీలు ఎక్కువగా వున్నారు. ఆశతో కూడిన వాళ్ళనయనాలు చూస్తుంటే అవకాశం దొరకితే 'అన్నకూటం'పైన విరుచుకు పడాలన్న కాంక్ష బలంగా కనబడుతోంది. కానీ అది ఎప్పటికీ తీరదని జ్ఞప్తికొచ్చి ఆ కళ్లలో నిరాశ చోటుచేసుకుంది.

చాలాకాలంగా తమ తమ గదుల్లో

మరణ ఘడియల కోసం వేచి ఉండే వికలాంగ వృద్ధస్త్రీలని చేతుల్లో ఎత్తుకుని తీసుకువస్తున్నారు, కొందరు బలంగా ఉన్న స్త్రీలు. వ్రజభూమిలోని సుమారు మూడు వేలమంది దరిద్ర వితంతువులు అన్నకూటాన్ని దర్శించుకోవాలన్న పేరాశని ఎలా వదులుకుంటారు?

మృణాళిని గోవిందుడి ఆలయం అరుగు మీద కూర్చుంది. "రాధావల్లభ మందిరానికి వెళ్ల వా అక్కా? " అడిగింది శశి.

"లేదు గోష్ఠి మొదలయ్యేంతవరకు ఇక్కడే ఉంటాను"

"కానీ గౌరవప్రదమైన స్త్రీలు ఈ గోష్ఠిలో పాల్గొనరు"

"గౌరవప్రదమైన స్త్రీలా! పరిహాసమా? అర్థాకలితో గూడులేని రాధేశ్యామీలతో సమానంగా గదుల్లో ఉంటున్న తర్వాత కూడా మమ్మల్ని గౌరవప్రదమైన స్త్రీలంటారా? ఇప్పుడు మేం బిచ్చగాళ్లం. కలిమి గలవారు బిచ్చగాళ్లుగా మారితే, వాళ్ల బాధలకి అంతే ఉండదు"

అప్పుడే వడ్డనకి సూచికగా గోష్ఠి గంట మోగింది. పంక్తి బద్ధంగా కూర్చుని ఉన్న స్త్రీలని తప్ప మిగతా వారినందరినీ బయటికి పంపించేసి ఆలయ సింహద్వారం మూసేశాడు పూజారి. పంక్తిలో కూర్చున్న శశి దగ్గరికి వచ్చి కూర్చుంది మృణాళిని. వడ్డించిన ప్రసాదం ఆవురావురుమంటూ అందరూ తిన్నారు.

"ఇంకొంచెం పెట్టండి" అంది మృణాళిని పూజారి ఆశ్చర్యపోయేలా.

"పెట్టండి, ఇంకా పెట్టండి. గోవిందుడి భాండాగారం తక్కువేమీ కాదు, చింతించకండి" అంటూ మృణాళినితో శ్రుతి కలిపి అరిచారు ఆకలితో ఉన్న రాధేశ్యామీలు.

పూజారి విసుక్కుంటూ "ఓసి ముసలి పీనుగుల్లారా! ఇక్కడ చూస్తూ కూర్చున్నందువల్ల ఎలాంటి ప్రయోజనం ఉండదు. వెంటనే రాధాదామోదర్ మందిరానికి వెళ్లండి. కొద్దిసేపట్లో అక్కడ కూడా నిండుకుంటుంది" అన్నాడు.

పూజారి హెచ్చరికలతో వృద్ధస్త్రీలు ప్రసాదాన్ని గబగబా నోట్లో కుక్కుకోసాగారు. మృణాళిని దగ్గర కూర్చున్న ఓ మహిళ మరొకామెతో "రాధా దామోదర్ మందిరంలో ఈరోజు ప్రసాదం ఏంటో? " అంది.

"బూందీ లడ్డు, పూరీ"

"కాదు, కాదు. పంచదార బిళ్లలు"

సమయంలేదు, అనుకుంటూ వృద్ధ స్త్రీలు పాత్రలు గబగబా నాకసాగారు.

"అన్ని మందిరాలని దర్శించుకుందామనుకున్నాను. కానీ ఇప్పుడు ఎక్కడికీ వెళ్లాలనిపించడంలేదు. ప్రశాంతమైన చోటుకెళ్లి కూర్చోవాలని ఉంది" అంది మృణాళిని.

ఎక్కువసేపు ఒకేచోట కూర్చుని ఇబ్బంది పడుతున్న శశి అది విని సంతోషంగా మృణాళిని వైపు చూడసాగింది.

"శశీ, నువ్వు ఓ సుగుణవతిలా కనిపిస్తున్నావు" అంది మృణాళిని.

నువ్వు ఆలంఘడీతోపాటు మందిరంలో కలసి ఉండకపోయివుంటే గనక బహుశా నీ జీవితం గొప్పగా ఉండేది" మళ్లీ అంది మృణాళిని.

"నాకు ఇంతకంటే మరో మార్గం లేకపోయింది. అయినా ఆలంఘడీ ఎలాంటి కీడూ తలపెట్టలేదు. 'యుగళ ఉపాసన' పేరుతో వ్రజభూమిలో అనేకమంది స్త్రీలు పురుషులతో కలసి ఉంటున్నారు. ఈ భూమ్మీద ధనం, పలుకుబడి లేనివాళ్లకి, భవిష్యత్తు అంధకార బంధురమై 'కింకర్తవ్యం' అన్న మీమాంసలో పడిపోయినవాళ్లకి ఇంతకుమించి మరో అవకాశం ఉండదు.. అయినా మీలాంటి వాళ్లకి ఇవి అర్థం కావు. అనుభవించేవాళ్లకే తెలుస్తాయి" అంది శశి తలవంచుకుని.

"అయితే ఆలంఘడీ నీకేమీ హాని కలిగించడంలేదా"

"నీ ఉద్దేశం నాకర్థమయింది. విను, ఒక

రోజు అతని మాటల్ని విని నేను వివస్త్రన య్యాను. దీపం వెలుగులో నన్ను తినే సేలా చూశాడతను. ఆ తర్వాత దీపం ఆర్పేసి పక్కమీదకి వెళ్లి పడుకున్నాడు"

"అంటే ఆలంఘడీ నిన్ను ఏమీ చేయ లేదా? "

"ఏమీ చేయలేకపోయాడు"

సమయం గడుస్తున్నకొద్దీ ఎలాంటి మానసిక మార్పుకోసం మృణాళిని ఆలో చించిందో అలాంటిదేమీ తటస్థపడలేదు.




**"తం**డ్రి ఆసుపత్రిలో నర్సు బాధ్యత కూడా నిర్వర్తిస్తోంది సౌదామిని. ప్రదక్షి ణలు చేస్తున్నప్పుడు ఎదురుపడే రోగుల గాయాలు కడగడానికి, మురికి తొలగించి శుభ్రం చేయడానికి సంకోచించదు ఆమె.

ఒకరోజు తన తండ్రితోపాటు బాలాజీ మందిరానికి వెళ్లి మెట్లపైన మృత్యుఘడి యలు లెక్కిస్తున్న ఒక రోగిని తన చేతు లమీద ఎత్తి ఆసుపత్రికి తీసుకువచ్చింది సౌదామిని. ఆ రోగి ఓ బిచ్చగాడు. ఆ రోజు సౌదామిని అతని కాలికి ఉన్న గాయం కడిగి, అన్నం పెడితే ఆ వ్యక్తి కోపంగా "నన్ను బతికించే ప్రయత్నం చేయకు. ఈ వ్రజధామ ధూళి ప్రసాద ప్రాప్తి కోసం చాలాదూరం నుంచి వచ్చాను" అన్నాడు. తర్వాత ఆ వ్యక్తి ఎంతోకాలం బతకలేదు.

మరోసారి లూయీ బజారులోని గుర్ర పుశాలలో చావుబతుకుల మధ్య ఉన్న రోగిని రాయ్‌చౌదరి పరీక్షించి ఆహార లోపం, చికిత్స లోపం అతడిని మృత్యువొడి లోకి చేర్చినట్టు గ్రహించాడు. ఆకలిచావుని చూడడం సౌదామినికిదే మొదటిసారి.

రెండునెలల వరకు తన తండ్రితో కలిసి ఎడతెరిపి లేకుండా సయ్యద్ బజార్, లూయీ బజార్, వనఖండీ మహాదేవ్, అనాజ్ మండీ, చివరికి ముళ్లచెట్లతో నిండి నిర్మానుష్యమైన హరిజనవాడలో కూడా రోగాలతో బాధపడేవాళ్ల కోసం తిరిగింది సౌదామిని. వ్రజభూమిలో చావుకోసం చస్తూ బతుకుతూ జీవిస్తున్న అనేకమం దిని చూసింది. వాళ్లంతా బిచ్చగాళ్లు. వాళ్ల లో కొందరు తమ దహనసంస్కారాల కోసం నడుం దగ్గర డబ్బులుంచుకున్నారు.

ఒకరోజు స్నానార్థం సౌదామిని య మునకి వెళ్లింది. ఎండ తీవ్రంగా ఉండ డంతో పురోహితులు వెళ్లిపోయారు. తర్ప ణాలు వదిలేందుకు వచ్చిన కొందరు వ్యక్తులు అక్కడక్కడా తచ్చాడుతున్నారు.

పీపావంతెనపైన ఓ స్త్రీ నిలుచుని ఉండ డం చూసింది సౌదామిని. దగ్గరికి వెళ్లి చూసింది. ఆమె మరెవరో కాదు, శశి.

"మీతో ఒంటరిగా మాట్లాడాలని ఎప్పటి నుంచో అనుకుంటున్నాను" అంది శశి. వంతెనలా వాలుగా నిలిచివున్న నావ చివ రికి వెళ్లి కూర్చున్నారు వాళ్లిద్దరూ. వంతెన దగ్గర్లోనే ఓ నిర్జన ప్రదేశంలో ఎవరివో శ్రాద్ధకర్మలకి సంబంధించిన తులసి, పూల మాలలు మొదలైనవి పడివున్నాయి. నీళ్ల లో వాటి ప్రతిబింబాలు ప్రకాశిస్తున్నాయి.

"స్నానానికి ఇది సరైన సమయం. జనం దూరంగా ఉన్నారు" అంది శశి. అందుకు సౌదామిని సమ్మతించింది. బట్టలు మార్చుకుని ఇద్దరూ నీళ్లలోకి దిగారు. తాబేళ్లను తప్పించుకుంటూ వాళ్లు చాలాసేపు స్నానం చేశారు.

ఒడ్డుపైకి రాగానే శశి అకస్మాత్తుగా "నిజం చెప్పు! వ్రజధామం వచ్చాక నీకు మానసిక ప్రశాంతత కలిగిందా? ఎందుకు అడుగుతున్నానంటే నీ మిగిలిన జీవితాన్ని ఇక్కడే గడపాలని కోరుకుంటున్నావేమో నని" అంది సౌదామినితో.

అకస్మాత్తుగా అడిగిన ఈ ప్రశ్నకి వెంటనే సమాధానం చెప్పలేకపోయింది సౌదామిని. ఒడ్డుపైన నుంచుని కురులు ఆరబెట్టుకోసాగింది ఆమె.

"నాకు తెలుసు, నువ్వు సమాధానం చెప్పలేవని. కొంతకాలంగా నేను కూడా మానసిక వేదన అనుభవిస్తున్నాను. నువ్వు కూడా ఎన్నోకష్టాలు, బాధలు అను భవించావని విన్నాను. అసలు నువ్వు ఏ విధంగా జీవించాలనుకుంటున్నావో చెప్పు" అంది శశి.

అకస్మాత్తుగా శశి అలా అడగడంతో ఆ మాటలు వినబడనట్లుగా బట్టలు మార్చు కోసాగింది సౌదామిని.

అప్పుడే తర్పణాలు వదిలేందుకు కొంద రు అటుగా వచ్చారు. కొంత దూరంలో ఓ వృద్ధుడు ఖర్జూర చెట్టుకింద నేల తవ్వుతు న్నాడు.

"ఎందుకు అలా తవ్వుతున్నాడతను? " అడిగింది సౌదామిని.

"పాము కోసం" అంటూ నవ్వింది శశి. "అవును, పాముకోసం వెతుకుతున్నాడు. పాముని వెతికి పట్టుకుని ఎవరి ఇం ట్లోనో వదిలేస్తాడతను. తర్వాత తనను తాను పాముల్ని పట్టేవాడిగా పరిచయం చేసు కుని పాముని పట్టుకుని ఇంటి యజమాని నుంచి డబ్బులు గుంజుతాడు" అంది.

వృద్ధుడు తవ్వడం ఆపి ఆ ఇద్దరినీ ఓ క్షణం చూసి మళ్లీ పనిలో లీనమయ్యాడు.

"నేను అడిగిన దానికి సమాధానం చెప్ప లేదు" అంది శశి.

"ఏం చెప్పమంటావు? నీ ప్రశ్నకి సమా ధానం లేదు" అంది సౌదామిని.

"నిన్నెప్పుడైనా వ్రజచంద్ర కలిశాడా? "

సౌదామిని తలవంచుకుంది. కొన్ని క్షణాల తర్వాత "నేను చెప్పేది శ్రద్ధగా విను. సత్యమే మానవ ధర్మం. అది శాశ్వ తమైంది. ఆ మార్గాన్ని అవలంబించడం, అందులోనే కడతేరిపోవడం నా జీవితా శయం. ఈ మాటలు నా హృదయాంతరా ల్లోంచి వచ్చాయి" అంది సౌదామిని దృఢ మైన స్వరంతో.

ఇసుకలో మోకాళ్ల ఆసరాతో కూర్చున్న శశి "కొద్దిరోజులుగా ఓ రకమైన ఆవేదన నా మనసుని తొలిచేస్తోంది. బహుశా నీకు కూడా తెలుసుననుకుంటా. రెండు మూడురోజుల్లో మందిరం అమ్ముడైపోతుం ది. ఇప్పటిదాకా భగవాన్ దామోదర్ సేవ లో గడుపుతున్నాను.. కానీ ఇకముందు ఆలంఘడీ నేను భార్యాభర్తలుగా గడపాల్సి ఉంటుంది. పెళ్లీ పెటాకుల్లాంటివేమీ లేక పోయినా మొగుడూ పెళ్లాలుగా ఉండాల్సి వస్తుంది. ఎంతటి దుర్గతి? రాధేశ్యామీలు కాలేనివారు మరణించిన తర్వాత దహన సంస్కారాల భయంతోగానీ, లోభంవల్లగా నీ ఇలాంటి జీవితం గడపాల్సిందే. కానీ ఇలాంటి జీవితాన్ని నేనెందుకు గడపాలి? బహుశా ఈ మాటలు నీకు అర్థం కాకపో వచ్చు" అంది శశి.

"ఇప్పుడైనా నువ్వు వివాహం చేసుకోవ చ్చుగా" సాంత్వనగా పలికింది సౌదామిని.

"ఆలంఘడీ వట్టి నపుంసకుడు. అతని వల్ల నాకు ఎలాంటి విచారమూ లేదు.. అసలు విషయం ఏంటంటే కొద్దిరోజులుగా నేను ప్రేమలో పడ్డాను" గట్టిగా అరుస్తున్న ట్లుగా అంటూ అకస్మాత్తుగా శశి సౌదా మిని చేతుల్ని తన గుండెలకి హత్తుకుని వెక్కివెక్కి ఏడ్వసాగింది. కొంతసేపటి తర్వాత "నేను కృష్ణమందిరంలోని నవ యువకుడైన ఓ బ్రహ్మచారి ప్రేమలో పడ్డా ను. నా ప్రేమ ఓ అద్భుతమైన రూపాన్ని కూడా సంతరించుకుంది. ఇప్పుడేం చేయా

లో అర్థం కావటం లేదు" అంది శశి.

★ ★ ★

శశి, సౌదామిని ఇద్దరూ ఓ భజనాశ్రమం ముందు నిలబడ్డారు. శ్రీమతి షరాఫీ సెఠానీ ఈ రోజు పేదలకి బట్టలు పంచడానికి వచ్చిందని భజనాశ్రమానికి చెందిన రాధేశ్యామీ వృద్ధస్త్రీలందరూ గుమిగూడారు. అద్దాల మందిరం దగ్గర కూర్చుని వున్న ఆశ్రమానికి చెందని వృద్ధ స్త్రీలు కూడా వచ్చి ఆ గుంపులో కలిశారు. అందరూ ఆశ్రమం మెట్లపైన కూర్చుని షరాఫీ సెఠానీ కోసం వేచిచూస్తున్నారు. శశి కూడా వెళ్ళి వాళ్లదగ్గర కూర్చుంది.

అకస్మాత్తుగా అకౌంటెంట్ సెఠానీ చెవిలో చెబుతున్న మాటలు వినిపించాయి శశికి. "మీరు వీళ్ళకి పంచుతున్న బట్టలు అమ్ముకుని రాత్రివేళ పీపాబ్రిడ్జి దగ్గర డబ్బులు లెక్కపెట్టుకుంటుంటారు. ఆ డబ్బుల్ని తమ దహన సంస్కారాల కోసం దాచిపెట్టుకుంటారు. ఆకలితో అలమటించే వీళ్లు సాక్షాత్తు ఆడపీనుగల్లా కనిపిస్తారు"

ఆ మాటలు విని శశి చిరాకు పడింది. పులిలాంటి నరభక్షకుడైన ఈ అకౌంటెంట్ గురించి వ్రజభూమిలో అందరికీ తెలుసు. ఎందరో యువ రాధేశ్యామీ వితంతువుల పైన ఎన్నో అత్యాచారాలు చేశాడతను. కొందరినైతే లేవదీసుకుపోయాడు కూడా. ముందుకి వెళ్ళాలన్న తపన శశిలో నశించిపోయింది. సెఠానీని విడిగా కలవడం మంచిదనుకుంది శశి.

శశి రోడ్డుపైకి వచ్చింది. బాధతో ఆమె హృదయం ద్రవీభూతమైంది. 'ఈ వయస్సులో ఇలాంటి దురవస్థ భగవంతుడు ఎవరికీ కలగజేయకూడదు. ఎవరినీ ఇంతటి నిస్సహాయస్థితిలో పడేయకూడదు' అనుకుంది శశి తనలో తాను.

"దేశ విభజన సమయంలో రాజ్‌షాహీ చేతిలో మా నాన్న మరణించాడు. ఇంకా అమ్మ.. వ్రజలో ఒకసారి కరువుకాటకాలు సంభవించినపుడు ప్రజలు పుచ్చకాయ విత్తనాలు, ఆకులు అలములతో పొట్ట నింపుకున్నారు. ఈ అక్రూర్ ఘాట్ దగ్గర రక్తం కక్కుకుని మా అమ్మ ప్రాణాలు విడిచింది. ఆ తర్వాత వ్రజలోని ఈ సందులూ గొందులే నాకు ఆవాసంగా మారాయి. ఇక్కడే నేను పెరిగి పెద్దదాన్నయ్యాను" అంటూ సౌదామినికి వివరించింది శశి. శశి చెప్పడం కొనసాగిస్తూ "అయితే ఒక విషయం.. ఆకలితో అలమటించినా నా శీలాన్ని, పవిత్రతను కాపాడుకుంటూ వచ్చాను. ఇప్పటికీ వీటినన్నింటినీ తలచుకుంటే గర్వంగాను, ఆనందంగాను ఉంటుంది. లోకుల నిందను నేను లెక్కచేయను.. కానీ ఇప్పుడు కాలం మారినట్లనిపిస్తోంది. ఓ విచిత్రమైన బాధ నా మనసును తొలిచేస్తోంది" మోకాళ్ళపైన తల ఆన్చి దుఃఖాన్ని దాచుకునే ప్రయత్నం చేస్తూ అంది శశి.

"నీ మాటల్ని విశ్వసిస్తున్నాను. కానీ మందిరం అమ్ముడైన తర్వాత ఎక్కడికి వెళ్తావు? ఆలంఘుడీతో కలిసే వుంటావా? "

"మరో మార్గం లేనపుడు అలాగే వుండాల్సివస్తుంది. షరాఫీ సెఠానీ మళ్ళీసారి రాధేశ్యామీలకి కంబళ్ళు పంచడానికి వచ్చినపుడు ఆమెతో మాట్లాడాలి. బహుశా ఏదైనా మార్గం చెబుతుందేమో? "

ఇద్దరి మధ్య మౌనం రాజ్యమేలింది. టాంగాల గుర్రాల మువ్వల చప్పుడు, గిట్టల శబ్దాలు వాళ్ళ మౌనాన్ని భగ్నం చేయడంతో వాళ్ళు ఈలోకంలోకి వచ్చారు.

"పద! ఇంటికి వెళ్దాం" అంది శశి.

ఇద్దరూ లేచి ముందుకు కదిలారు. తాలవన్ మఠాధిపతి ఏనుగు రంగనాథుడి రథశాల దగ్గర కనిపించింది. దాని అంబారీపైన మల్లెమాలలు అలంకరించి వున్నాయి. "ఈ రోజు వనభాండీ మహంత్‌జీ ఊరేగింపు వుంది" అంది శశి.

గోపినాథ్ బజారు రస్‌భరీ అమ్మేవాళ్ళ

అరుపులు కేకలు మినహా అంతటా నిశ్శబ్దంగా వుంది.

హనుమంతుడి మందిర ప్రాంగణంలో కొందరు కూర్చుని మాట్లాడుకోవడం గమనించింది శశి. వాళ్లు యమున ఆవలి వొడ్డునుంచి వచ్చిన పాలవిక్రేతలు. వాళ్ళ చేతుల్లో ఖాళీ డబ్బాలున్నాయి. శశి వాళ్ళ దగ్గరికి వెళ్ళి కూర్చుంది. వాళ్ళు ఆమె వంక ఒకసారి తలెత్తిచూసి మళ్ళీ మాటల్లో పడిపోయారు.

అకస్మాతుగా శశి కళ్లలో నీళ్లు ఉబికాయి. మందిరం అమ్మకానికి బేరం దరిదాపు కుదిరినట్లే. తాను ఆలంఘడితో ఉండేందుకు కూడా నిర్ణయం అయిపోయింది. అంతేకాక ఆలంఘడీ తనకి ఎలాంటి అపకారమూ చేయడని కూడా నిశ్చయమైపోయింది. జనాల ఎత్తిపొడుపుల గురించిన బాధ కూడా లేదు. అయినా అపకీర్తి కదా. అందులోనూ ప్రత్యేకించి ఒక స్త్రీ మీద. ఈ అపకీర్తి ఓ శిలాశాసనంతో సమానం.. అది శిథిలమైనప్పటికీ ప్రజలు దాన్ని మాటి మాటికీ పెళ్ళగించి చదివే ప్రయత్నం చేస్తారు.

ఒకవేళ ఒకట్రెండు రోజుల్లో గనక ఎలాంటి ఏర్పాట్లూ జరగకపోతే అంతా సర్వనాశనమే. ఆకతాయిలు తన వెంటబడ్డం ఖాయం. మందిరం నుంచి తిరిగి వెళ్ళే సమయంలో ఎన్నో ఆలోచనలు ఆమెని చుట్టుముట్టాయి. తన చేతిలో చిల్లిగవ్వలేదు. గతంలో తాను తులసి మాలలు, గోపీచందనం లాంటివి తయారుచేసి కొద్దోగొప్పో సంపాదించేది. ఇప్పుడు మందిరం అమ్ముడు పోతోందన్న ఆలోచనతో వ్యాకులపడసాగింది.. అయినా ఈ వ్రజభూమిలో ఎన్నడూ ఆకలితో చావనన్న నమ్మకం తనకుంది. బిచ్చగాళ్ళ సరసన కుర్చుంటే పూట గడుస్తుంది. ఆశ్రమంలో కూడా పంక్తిలో కూర్చుంటే భోజనం దొరుకుతుంది. ఇతర రాధేశ్యామీలతో పాటుగా భజనాశ్రమంలో భజనపాటలు పాడి ఎంతో కొంత సంపాదించుకోవచ్చు. ఆకలితో మటుకు చావదు. కానీ ఈ విధంగా నిశ్చింతగా కడుపు నింపుకోవాలంటే ఇంకా సుమారు ఇరవై సంవత్సరాలు నిరీక్షించాల్సి వుంటుంది. ఇరవై సంవత్సరాల తర్వాత ఈ శరీరం వడలిపోయి పరిస్థితులు క్రిమికీటకాలతో నిండిన ఆడకుక్కతో సమానమైనపుడు నిశ్చింతగా తిండికోసం పంక్తిలో కూర్చోగలదు తను. ఆలంఘడీకంటే ముందు తాను రాధేశ్యామీల గదుల్లో గడిపింది. భరించలేని దుర్గంధం నిండిన ఆ గదుల్లో మృత్యువుకి చేరువగావున్న ఇద్దరు ముగ్గురు రాధేశ్యామీల నోట్లో నీళ్ళు కూడా పోసింది. ఎందరో వృద్ధ స్త్రీలు తన చేతుల్లోనే అంతిమ శ్వాస విడిచారు. ఆ భయానక క్షణాలు తను ఎన్నటికీ మరువలేననుకుంది శశి.

ఒకరోజు తనలో ఏదో అద్భుతమైన మార్పు కలిగినట్లనిపించింది. తనని ఓ జీవించివున్న ప్రేతాత్మగా భావించి కుతూహలంతో చూసినవాళ్లందరూ ఇప్పుడు తనని ఓ రకమైన ఆసక్తితో చూస్తున్నారు.

తన ప్రేతాత్మ మొహంలో ఒక వాస్తవమైన మార్పు వస్తున్నట్టుగా తనకు తాను భావించుకుంది. ఒకరిద్దరు రాధేశ్యామీలు తను వ్రజభూమిలో మల్లెలా వికసిస్తున్నట్టు అనడం కూడా తను వింది. ఇన్ని ఆలోచనల్ని నెమరు వేసుకున్న శశి బజారులోకి రాగానే అడుగులు వడివడిగా పడసాగాయి. బిహారీమోహన్ కుంజ్ లో పెద్ద గుంపుగా జనాలు చేరుకున్నారు. బజారుకి అభిముఖంగా వున్న వరండాలో పండాల పిల్లలు ఏదో గలభా సృష్టిస్తున్నారు. కుంజ్ బిహారీ అమ్ముడయ్యేందుకు ఇవాళ ఆఖరిరోజు. ఇక్కడి ప్రతివస్తువు శశికి మమకారంతో కూడుకున్నవే. అక్కడి అత్తిచెట్టు, దానిపైన కోతులు చేసే అల్లరి, తియ్యటి నీటి బావి.. ఇంకా తాను మనశ్శాంతితో

విశ్రమించే విశాలంగా వున్న పొడవైన నేల. శశి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి. జనాన్ని పక్కకి తోసుకుంటూ శశి తన గదిలోకి ప్రవేశించింది.

★ ★ ★

భగవాన్ అటల్ బిహారీ 'అటల్ వనం', గోకులచంద్ర దావాగ్ని పానం చేసిన 'బంజరువనం', యశోద గోదానమిచ్చిన 'గోపాలవనం', రాధ తన చెలికత్తెలతో పూలమొక్కలు నాటిన 'రాజాబాగ్', హరిదాసస్వామి సృష్టించిన 'మానసవనం', 'నిధువన్' ఇంకా అతిరమణీయమైన 'నికుంజవనం' వ్రజభూమి మట్టిని ఆలింగనం చేసుకుంటున్నట్టు వేళ్లానుకున్న శ్వేతపుష్పాల ముళ్ళపొదలు, వాటిపైన రాధ కాలి అందియల్లా వికసించిన పూలు చెవులు పెట్టి జాగ్రత్తగా వింటే వినిపించే రాధ కాలిగజ్జెల ధ్వని, ఇవన్నీ మూర్తిమంతాలై మహదానందం కలిగించే విషయాలుగా గోచరిస్తాయి. అన్ని వేదనలు, దుఃఖాలు ఒక్కోపుష్పంలా రూపాంతరం చెందుతున్నట్టుగా అన్పిస్తుంది.. సౌదామిని కూడా ఎన్నోరోజులు ఈ అనన్య ఆధ్యాత్మిక ఆహ్లాదకరమైన స్వరాన్ని వినాలని ప్రయత్నించింది.

కానీ ఈ శబ్దాలు తాను వినలేనన్న విషయం నెమ్మది నెమ్మదిగా ఆమెకి అవగతమైంది. సందులు, గొందులు, కూడళ్ళలో తిరుగుతూ రోగుల్ని వెతికే ఉత్సాహం కూడా ముగిసిపోయినట్లే.. సౌదామిని విసిగిపోయింది. తగిన నేర్పు ప్రదర్శించినప్పటికీ అనుపమ సౌదామిని ఎనభై నాలుగు క్రోసుల ప్రదక్షిణకి తీసుకువెళ్ళడంలో విఫలమైంది. హతాశురాలైనప్పటికీ అనుపమ మాత్రం ఈ సువర్ణావకాశాన్ని వదులుకోలేదు. కష్టతరమైన ఈ యాత్రని నిర్విఘ్నంగా పూర్తి చేసుకుని అనుపమ ఒకరోజు తిరిగి వచ్చేసింది కూడా. మిగతా యాత్రికులు ప్రదక్షిణ పూర్తి చేసుకుని 'రమన్‌రేతి'లో గుడారాలు ఏర్పాటు చేసుకునేందుకు వచ్చినప్పుడే అనుపమ తిరిగి ఇంటికి వచ్చేసింది.

అనుపమ ఇంటికి తిరిగి రాగానే సౌదామిని ఎంతో ఉదాసీనంగా ఉన్నట్టు గమనించింది. ఆమె కళ్ళకిందున్న నల్లటి వలయాలు అనుపమ చూపుల్ని తప్పించుకోలేకపోయాయి. అయినప్పటికీ ప్రదక్షిణతో అలసిపోయిన తన తల్లికి ఎప్పటిలాగే సేవ చేయసాగింది సౌదామిని. స్నానానికి వేడినీళ్ళు పెట్టింది. తల్లి తీసుకువచ్చిన ప్రసాదం జాగ్రత్త పెట్టింది. చిన్నపిల్లలా తల్లి భుజాల చుట్టూ చేతులు వేసి కుతూహలపూర్వక చేష్టలు చేయసాగింది.

భోజనం చేస్తుండగా అనుపమ తన యాత్ర గురించి చిత్రవిచిత్ర వృత్తాంతాలు సౌదామినికి వివరించసాగింది. సౌదామిని తల్లి కళ్ళలోకి సూటిగా చూసింది. అనుపమ చెప్పడం ఆపేసింది. సౌదామినిలో ఏదో చెప్పలేని క్షోభ ద్యోతకమైంది.

కింద ఆసుపత్రిలో ఇంకా రోగులు గుంపులు గుంపులుగా వున్నారు. పైకి వచ్చేందుకు రాయ్‌చౌదరికి తీరిక కాలేదు.

ఇంతలో ఎందుకనో సౌదామిని అకస్మాత్తుగా సుడిగాలిలా కిందికి దిగిపోయింది. కింద కూర్చుని ఆమె చిన్నపిల్లలా వెక్కి వెక్కి ఏడ్వసాగింది. అది విన్న అనుపమ వెంటనే కిందికి వచ్చింది. రోగుల్ని తప్పించుకుంటూ రాయ్‌చౌదరి కూడా ఆమె దగ్గరకొచ్చి నిలబడ్డాడు. కొంతసేపు విలపించిన తర్వాత సౌదామిని పెద్దగా అరుస్తూ "నేను ఇతరుల దయాదాక్షిణ్యాల మీద జీవితాన్ని గడపలేను. మీలాగ ప్రజాసేవ చేస్తూ జీవితం గడపడానికి నేను గొప్పస్త్రీని కాను. నాకూ స్వేచ్ఛ వుంది. నేను ఎవరికీ భయపడను. నేను మారినట్టుగా భావిస్తే అది మీ తప్పే" అంది. రాయ్‌చౌదరి వైపు వేలెత్తి చూపిస్తూ "మీరంతా మోసగాళ్ళు.. కసాయిల్లా కనిపిస్తున్నారు" అంది గాద్గది

కంగా సౌదామిని.

గాయపడ్డ పావురంలా సౌదామిని కొంతసేపు గిలగిలా కొట్టుకుంది. ఈ మధ్యలో "బహుశా ఆ ఈసాయీ యువకుడు వస్తున్నాడనుకుంటా" గుసగుసగా మాటలు వినిపించాయి.

ఆ తర్వాత అనుపమ ఏడుపు వినిపించింది. బట్టలు చింపుకుంటూ తల గుమ్మానికి కొట్టుకుంటూ ఏడవసాగిందామె.




ప్రాతఃకాలంలో 'జ్ఞాన్‌గోదారి' నుంచి 'మౌనిదాస్' క్వార్టర్ల వరకు వాహ్యాళికి బయలుదేరినపుడు విశాలమైన వ్రజభూమి నాశనమైన ఓ సామ్రాజ్యపు ధ్వంసావశేషంలా గోచరిస్తోంది. నాలుగు వందల సంవత్సరాల కిందట విద్రోహులను అణచివేసేందుకు ఔరంగజేబు ఆడిన రక్తరంజిత హోళీ చిహ్నాలైన మరకలు ఇప్పటికీ కనిపిస్తాయి. ప్రాచీన గోపీనాథ్, మదన్‌మోహన్, రాధావల్లభ్‌ల శిఖరాల శిథిలాలు 'విధ్వంసకాండ జరిగి ఎంతో కాలం కాలేదు. చెవులు ఆనించి వింటే శిథిలాల కింద అణిగిపోయిన పూజారుల దయనీయ అంతర్నాదాలు ఇప్పటికీ వినవచ్చు' అని చెబుతున్నట్టుగా వుంటాయి.

ఈ రోజు వేకువజాము నుంచే సౌదామిని నిరుత్సాహంతో యమున ఒడ్డున తిరగసాగింది. చింపిరిజుట్టు, అస్తవ్యస్తమైన దుస్తులతో పిచ్చిదానిలా తిరుగుతోందామె. రాత్రంతా ఆమెకి కంటి మీద కునుకు లేదు. ఒక్కసారిగా ఇసుకలో మోకాళ్ళపైన కూర్చుండిపోయిందామె. కేసీఘాట్ సమీపం నుంచి సుడిగుండం చేస్తున్న భయంకరశబ్దం విన్పిస్తోంది. బృందావన రథచక్రాల బడబడ ధ్వనులు ఇక్కడికి వినిపిస్తాయని ప్రజలు అంటుంటారు. కానీ ఆమెకి నింగీనేలా ప్రతిధ్వనిస్తున్నట్టుగా ఆ మహాకాలుడి ప్రచండ ధ్వని వినిపించింది. ఆ ధ్వనిలో ఉదయపు చప్పుళ్లు అన్నీ కలిసిపోయాయి.

కొంచెంసేపు అటూ ఇటూ తిరిగిన సౌదామిని కృష్ణమందిరం సింహద్వారం దగ్గరకి వెళ్లి నిలబడింది. ఆఫీసు తలుపులు తీసివున్నాయి. మందిరంలోని ఉద్యోగులు హుండీ, అకౌంటు పుస్తకాలు చూడ్డంలో నిమగ్నమయ్యారు.

గది దగ్గర తల వంచుతూ 'జై శ్రీరాధేరాణీ' అంది సౌదామిని. గుమస్తాలందరూ 'జై శ్రీరాధేరాణీ' అన్నారు. వృద్ధుడైన మేనేజరు ఆమె వైపు చూస్తూ "ముందుకి రా" అన్నాడు.

"నేను దర్శనానికి రాలేదు. ఉద్యోగం కోసం వచ్చాను"

"ఉద్యోగమా? "

గుమాస్తాలందరూ ఆమెని ఆశ్చర్యంగా చూశారు.

"ఎంతవరకు చదువుకున్నావు? " అడిగాడు వృద్ధ మేనేజరు.

ఈ ప్రశ్న సౌదామినిని సందిగ్ధంలో పడేసింది. "నాకు పెద్ద ఉద్యోగం అవసరం లేదు.. గోడౌన్ కీపర్‌గానో, వంటగదిలో సహాయకురాలిగానో లేక.."

ఓ మూల కూర్చుని పనిచేసుకుంటున్న కోశాధికారి పగలబడి నవ్వుతూ "మేం యౌవనంలో ఉన్న యువతులను పనిలో పెట్టుకోం. అప్పుడపుడు ఒకరిద్దరు వృద్ధ రాధేశ్యామీలు పనికోసం ఇక్కడికి వస్తారు. మేం వాళ్లని కూడా దూరంగా ఉంచుతాం.

ఈమధ్య అందరికీ రోజులు భారంగా మారాయనిపిస్తోంది. రెండురోజుల క్రిత మే భూమిశిస్తు వసూలు చేసే ఉద్యోగం కోసం ఇద్దరు గ్రాడ్యుయేట్లు వచ్చారు. కొంతకాలం క్రితం వరకు వ్రజలో గ్రాడ్యుయేట్లు వేళ్లమీద లెక్కించేలా ఉండేవారు" అన్నాడు. ఒక్క క్షణం ఆగి "నువ్వు, నువ్వు డాక్టర్ రాయ్‌చౌదరి కూతురువనుకుంటాను. నేను నిన్ను ఆసుపత్రిలో పనిచేస్తుండగా చూశాను. విను, అంతకుమించి నీకు పని దొరకదు. వెళ్లు, నీకు శుభమగు గాక" అన్నాడు.

ఇంతలో రథశాల నుంచి బయటికి వచ్చిన చరణ్‌బిహారీ గౌతమ్ సౌదామినిని చూసి ఉత్సుకతతో "రాధారాణీకీ జై" అన్నాడు.

సౌదామిని శిరస్సు వంచి ఆ పదాలనే ఉచ్చరించింది.

"ఈమధ్య ఆసుపత్రిలోనే వుంటున్నావని విన్నాను" అన్నాడు చరణ్‌బిహారి.

బృందావనంలోని ఐదువేల మందిరాలని చూడాలన్న ఉత్సాహం సౌదామినిలో సన్నగిల్లింది. ఈసారి చరణ్‌బిహారీ తనని కలవడం ఏమాత్రం అప్రియంగా అనిపించలేదు. అయితే తిరిగి వెళ్లిపోతే తాను చీకటి గదిలో బందీ అవ్వాల్సిందే. ఏదో ఒకరోజు తను ఆ గది శిథిలాల్లో సమాధి అయిపోతానేమోనన్న భావన కలగసాగింది సౌదామినిలో.

"మీకు తీరిగ్గా వుంటే నాతో వస్తారా?" అడిగింది సౌదామిని.

"కొంచెం ఆగండి! పనివాళ్లు రథచక్రాలు శుభ్రం చేస్తున్నారు. వాళ్లకి కొన్ని సూచనలు ఇచ్చి వచ్చేస్తాను"

"అయితే బృందావనంలోని ఐదువేల మందిరాల్ని చూడాలన్న కోరిక ఈరోజు కలిగిందన్నమాట. ఈరోజు మీకు ఇంత ఉత్సాహం ఎందుకు కలిగినట్లు?"

"నేను తిరిగివెళ్లిపోయే సమయం వచ్చింది" చెప్పింది సౌదామిని.

"తిరిగి వెళ్లిపోతావా?" అంటూ బొంగురుపోయిన గొంతుతో "రంగనాథుడి 'నౌకాలీల' జరుగుతుంది. ఆగ్రహాయనంలో రామలీల, పుష్యంలో వైకుంఠోత్సవం, చైత్రంలో బ్రహ్మోత్సవాలు, కృష్ణపక్షంలో.. లేదు, లేదు, ఇవన్నీ చూడకుండా వెళ్లిపోవడం సరైన పని కాదు. అన్నిటినీ మించి రంగనాథుడి రథయాత్ర చూడకుండా వదలకూడదు" అన్నాడు చరణ్ బిహారి.

గోవిందుడి మందిరం నుంచి ఇద్దరూ బయలుదేరారు. ఎండతీవ్రత అధికంగా వుంది. గోవిందుడి మందిరంలోని ఎర్రటి బండలు చాలా సన్నని నెరసులు చిందిస్తున్నట్టుగా వున్నాయి. ఇద్దరూ మౌనంగా నడుస్తున్నారు. మందిరాలని దాటుకుని ఇద్దరూ యమునవైపు సాగారు. పెచ్చులూడిన గోడల మీద అంటించి వున్న రంగు వెలసిన పోస్టర్లు ఎండిపోయిన విస్తరాకుల్లా కనబడుతున్నాయి.

"ఈ పోస్టర్లు ఏంటి?" చరణ్ బిహారిని అడిగింది సౌదామిని.

"ఇవన్నీ కృష్ణమందిరంలో ఆడిన రక్తపు హోళీ చిహ్నాలు"

సౌదామిని గోడ దగ్గరకి వెళ్లి చదివే ప్రయత్నం చేసింది -

"భక్తులు సమర్పించే ధనాన్ని వృథా చేయకండి. వివిధ శాఖాధిపతులకి ఇచ్చే విందులను నిరోధించండి. అనవసర వ్యాజ్యాలకి దేవాలయ సొమ్ముని వృథా చేయకండి. మందిరంలో పోలీసురాజ్యం స్థాపించడాన్ని నిరసిస్తున్నాం. భక్తులు కానుకలుగా సమర్పించే బంగారు, వెండి ముత్యాల ఆభరణాలు, బట్టలు, పాత్రలు సరిగ్గా ఉపయోగించటంలేదు. వీటినన్నింటిని నల్లబజారులో అమ్మేస్తు న్నారు. రాధకి సమర్పించే జరీ చీరల్ని అ ధిక ధరలకి అమ్మేస్తున్నారు. బిహారీ ప్రా సాదాన్ని తగులబెట్టడం క్షమించరాని అప

రాధం.. మీకు అంతా అర్థమయ్యిందని మా విశ్వాసం" అని రాసి వుంది.

నడుస్తూ నడుస్తూ ఇద్దరూ యమున ఒడ్డుకి చేరుకున్నారు. కొద్దిరోజులుగా 'జాతమంగ్షి' తీగలు ఏపుగా పెరిగి వున్నాయి. ఈ సమయంలో ధీరసమీర ఘాట్ దగ్గర శుభప్రదమైన కార్యాలు చేయడానికి ఎవరూ లేరు. 'జాతమంగ్షి' తీగల నీడలో పెద్దపెద్ద తాబేళ్ళు విశ్రమించాయి. కాలిబాటలో ఇద్దరూ నడుస్తున్నారు.

"ఈ సమయంలో సరిగ్గా ఇక్కడే ఓ నిగూఢమైన మహాతేజస్సును చూడగలవు. యమున మడుగులోంచి వచ్చే ఓ విచిత్రమైన ఆధ్యాత్మిక కిరణం వెలుగు అన్నివైపులా ప్రతిబింబిస్తుంది. సరిగ్గా చూడండి" అన్నా చరణ్ బిహారీ.

"లేదు, ఈరోజు దేనిమీదా మనస్సు లగ్నం కావటంలేదు" అన్నది సౌదామిని.

"అదేంటి? నీ మనస్సును నిరాశానిస్పృహలు ఆవరించాయా?"

సౌదామిని మౌనం దాల్చింది. గోడలమీద మందిరం దురవస్థకి సంబంధించిన విస్తరాకుల్లాంటి పాడుబడిన కాగితపు ముక్కలు ఇసుకలో చెల్లాచెదురుగా పడివున్నాయి. అత్తిచెట్టుకింద పాముని వెతికేందుకు గొడ్డలితో తవ్వుతున్న శబ్దం వినిపిస్తోంది.

"ఇటు రండి. ఈ మెట్లమీద కూర్చుంటే మీ ఉద్విగ్నత తగ్గిపోతుంది. ఎదురుగా మీకు విరిగిన మెట్లు కనబడుతున్నాయి కదా! కొన్నిరోజుల క్రితమే ఈ మెట్ల కింద కూరుకుపోయిన భగవాన్ దధికర్ణుని ప్రతిమని తవ్వితీశారు. చేతిలో దానపాత్ర, శిరస్సుపైన ఏడుపడగల సర్ప కిరీటంతో ఆ ప్రతిమ శోభిస్తోంది. ఇదే ధీరసమీర ఘాట్. ఇక్కడే గోకులచంద్ర కృష్ణుడు కోపంగా వున్న రాధ చరణాలపై శిరస్సు వుంచి అలక తీరుస్తూ ఉన్నాడు.."

"మీరు ఇన్ని రోజులుగా బృందావనంలో వున్నారు. నాలాంటి స్త్రీని ఎవరైనా ఎప్పుడైనా బృందావనం రావడం చూశారా?" అడిగింది సౌదామిని అకస్మాత్తుగా.

"మీలాంటి అంటే అర్థం?"

సౌదామిని మాట్లాడలేదు. ఆమె కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

"ఏదైతే మీకు బాధకలిగిస్తుందో దాని గురించి నావద్ద చర్చించకండి. మీలాంటి స్త్రీలు ఒకరిద్దరు వచ్చారు. వాళ్ళకోసం నా మనస్సులో ఇంకా నిట్టూర్పులు విడుస్తూనే వుంది. అంతకు మించి మరేమీలేదు. వినండి, బహుశా వచ్చేవుంటారు"

"ఓహ్, నన్ను ప్రేమించాలని మీకు ఎందుకనిపించడం లేదు? ఇంకా నేను వృద్ధరాధేశ్యామీలా లేనని అందరూ అంటుంటారు"

కానీ అతనికి ఈ సమయంలో తన ఎదురుగా కూర్చున్న స్త్రీ మొహం తన కూతురి రూపంలా అనిపిస్తోంది. తన కూతురు ఈ సమయంలో మల్లెమాలలు...

"ఏంటి, నన్ను తదేకంగా అలా చూస్తున్నారు? నిజం చెప్పండి, నేను ముసలిదానిలా కనిపిస్తున్నానా? ఇప్పటికీ అందరూ నా రూపలావణ్యాలని పొగడుతూనే ఉన్నారా? మన పరిచయం ఏర్పడి కూడా చాలాకాలం అయింది. మీ మనస్సు నా పట్ల ఆకర్షితమవటం లేదా? ఇప్పుడేగా, మీరు అన్నారు.. యమున జలాల్లోంచి ఓ తేజోమయమైన ఆధ్యాత్మిక కిరణం ప్రకాశి

## భలే భలే!

'వు మెన్' నవలిక రచయిత్రి క్లా కాల్డ్‌వెల్ ఆ వారంలో ఏం చేయాలో కాగితం మీద రాసి తన డెస్కుకు అంటించుకుంటుంది. చేసిన పనిని బట్టి దాన్ని ఏరోజుకారోజు తిరిగి రాసుకుంటుంది. యాలకులు వేసిన డికాషన్ తాగుతూ హెడ్‌ఫోన్స్ పెట్టుకునిగాని రచనను మొదలుపెట్టదు. బాధాకరమైన అంశాలను రాస్తున్నపుడు విషాద సంగీతాన్ని వింటుంది.

స్తుందని. దాన్ని మీరు మాత్రమే చూడగలరు... కొద్ది రోజులుగా సరిగ్గా మీలాగే నేను కూడా చీకటినే చూస్తున్నాను. అది నన్ను ఆవరించి నా జీవితాన్ని కబళించాలని చూస్తోంది. అప్పుడప్పుడు నాకనిపిస్తూంటుంది.. ఈ అంధకారం ఆ వెలుగు కన్నా దివ్యంగా వుందని మీరు నమ్మండి" సౌదామిని కంఠం గాద్గదికమైంది.

"అయితే ఆ ఈసాయి, క్షమించండి నాకు అతని పేరు తెలియదు. మీకు సాంత్వన చేకూర్చేవాడా? "

సౌదామిని మళ్లీ మౌనం వహించింది. మోకాళ్లమీద తలవాల్చి వేలితో ఇసుకలో హిందూ, ముస్లిమ్, క్రిష్టియన్ అని రాయసాగింది. హిందూ, ముస్లిమ్, క్రిస్టియన్..

"మీరు జీవించడానికి మీ భర్త జ్ఞాపకాలు ప్రేరణ కలిగించవా? "

"లేదు, ఇప్పుడు నా మనస్సులోనూ, మస్తిష్కంలోనూ అతని రూపు మసకబారింది. గతం మీద ధూళి పేరుకుపోయింది"

"మరి మీరు జీవించడానికి ప్రేరణ ఎవరిస్తారు? "

"ఇప్పుడు మీరు ఏ ఈసాయి గురించి మాట్లాడారో అతని సన్నిధే నాకు గొప్పప్రేరణ. దాన్ని నేను అర్థం చేసుకోలేను. మీరు కూడా సరిగా అర్థం చేసుకోలేరు. నిజం చెప్పాలంటే ఈ భూమిమీద వున్నవారెవరూ అర్థం చేసుకోలేరు. ఏది ఏమైనప్పటికీ నేను అతన్ని గాఢంగా మాత్రం ప్రేమించలేదు. అయినా అతను ఉన్నది నాకోసమే. ఇప్పుడు చెప్పండి నా లాంటి పవిత్ర స్త్రీ ఈ వ్రజభూమిలో మీకు ఇంతక్రితం ఎప్పుడైనా తారసపడిందా? "

చరణ్ బిహారీ తలవంచుకున్నాడు. అతను లోలోపల ఏదో బాధపడుతున్నట్టుగా అనిపించింది. ఇంతకు క్రితం ఎన్నడూ అతనికి అలాంటి బాధ కలగలేదు. తన కూతురి అందమైన మొహం మాటిమాటికీ గుర్తుకు రాసాగింది, చరణ్ బిహారీకి. ఆమె మల్లెల దండలు తయారుచేసి మందిరాల దగ్గర తిరుగుతూంటుంది.

★ ★ ★

ఆఖరికి ఒకరోజు బిహారీ మోహన్ కుంజ్ అమ్ముడయింది. పండాల్ని దళారుల్ని దాటుకుని డబ్బు ఠాకూర్ చేతిలో పడింది. అందులో కూడా కొంత భాగం ఆలంఘడీకి ఇవ్వాల్సివచ్చింది. ఇంకా కావాలనుకుంటే తన తాతలనాడు రాధాదామోదరులకు అలంకరించిన బంగా రు ఆభరణాలు, బంగారు పిల్లనగ్రోవి లాం టివి ఠాకూర్ సాహెబ్ తీసి వాటిని తన దగ్గర ఉంచుకోవచ్చు. కృష్ణుడి కళ్ళు, దుస్తు లు కొనే ఓ పరిచిత వ్యాపారి ఆయనతో "సాహెబ్! గుండెని రాయి చేసుకోండి. లేకపోతే కాలం గడవడం కష్టమైపోతుంది. ఇది మునుపటి వ్రజభూమి కాదు. ఈమధ్య కొందరు మూర్తి మీదున్న దుస్తులు తీసేసి బజారులో అమ్ముకుంటున్నారు" అన్నాడు.

కానీ ఠాకూర్ సాహెబ్ గుండెని రాయి చేసుకోలేకపోయాడు. మూర్తికి అలంకరించిన బంగారు ఆభరణాలు, పిల్లనగ్రోవి తీసుకోలేకపోయాడు. కొన్నిరోజులుగా అతనిలో ఆత్మగ్లాని కలగసాగింది. 'ఈ మందిరం తనకు వంశపారంపర్యంగా వచ్చిన ఒకే ఒక స్మృతి చిహ్నం. తన తాతగారు మరణించే సమయంలో "బిచ్చమెత్తుకోవాల్సిన దుర్భర పరిస్థితులు వచ్చినా మందిరాన్ని తాకవద్దు. ట్రస్టు ధనాన్ని గురించి ఎలాంటి పేరాశా పెట్టుకోవద్దు. అలాంటిదేమన్నా అయితే నీకు అశుభం కలుగుతుంది" అని చెప్పాడు.

ఠాకూర్ సాహెబ్ పరివారం అంతా వృద్ధరాధేశ్యామీలుండే గదుల్లాంటి ఓ గదిలో ఉన్నారు. తన తాతగారి రోజుల్లో ఆ గదిలో టాంగాల గుర్రాలకు దాణా నిల్వచేసేవాళ్ళు. కిటికీలు లేని ఈ చీకటి గదిలోకి వచ్చిన తర్వాత ఠాకూర్ పరివా

రానికి మరొక ప్రారబ్ధం వచ్చి పడింది. మృణాళిని ఇప్పుడు గది బయట కటిక నేలమీద పడివుంటోంది. ముసలి రాధే శ్యామీల్లా బజార్లలో చక్కర్లు కొడుతోంది. ఆశ్రమం దగ్గర, చెత్తకుప్పల దగ్గర తిరుగుతూ రేకు డబ్బాలు, కర్ర ముక్కలు లాంటివి ఏరుకుని ఇంట్లో పోగు చేస్తోంది.. ఈ గదిలోకి వచ్చిన తర్వాత తల్లిలాగే మృణాళిని మెదడు దెబ్బతిందని చుట్టుపక్కలవాళ్ళు అనుకోసాగారు.

ఖాళీ డబ్బాలు, సీసాలు, డబ్బామూతలు అట్టపెట్టెలు లాంటి వాటితో ఈ చీకటి గదిలో కొంతభాగం నింపేసింది మృణాళిని.

మందిరంలో వుండగా ఠాకూర్ సాహెబ్ ఊతకర్ర సాయంతో కొంతసేపు అటూ ఇటూ తిరుగుతుండేవాడు. అప్పుడప్పుడు బజారువైపున్న మెట్లపైన కూర్చునేవాడు. ఇప్పుడు ఆయన బయటికి రావడంలేదు. ఎందుకంటే అంధుడైన సాహెబు కి ఊతకర్ర ఇప్పుడు ఉపయోగపడదు.

ఠాకూర్ సాహెబు ఈ చీకటి గదిలో పడి రోజులు గడుపుతున్నాడు.. ఈలోపల వేసవికాలం వచ్చేసింది. భయంకరమైన రోజులు.. గదిలో ఆ ముగ్గురికీ ఊపిరి ఆడడం గగనమైపోతోంది. పగటిపూట తీవ్రమైన ఎండవల్ల , రాత్రిపూట గోడల వేడితో వాళ్ళు ఉడికిపోతున్నారు.

వ్రజభూమిలోని నాలుగువేలమంది నిస్సహాయ రాధేశ్యామీ వృద్ధస్త్రీలు, ముఖ్యంగా తూర్పువైపు నుంచి వచ్చిన స్త్రీలు వేడిని తట్టుకునేందుకు అలవాటుపడ్డవాళ్లు. వాళ్లు నగ్న శరీరాలతోనైనా భానుడి భగభగలను తట్టుకోగలరు.

ఠాకూర్ సాహెబు పరివారంలో పరస్పర స్పర్ధలు సంభవించాయి. ముగ్గురూ అనాగరికమైన పశువుల్లా మారారు. గదిలోంచి మధ్యమధ్య అశ్లీల దూషణలు బయటికి వినిపిస్తూంటాయి. మానసిక దౌర్బల్యం కలిగిన ఠాకూర్ సాహెబు భార్య కంఠం వినబడసాగింది- “మీ కారణంగానే మాకీ దుర్గతి కలిగింది. నువ్వు ఏఏ సమయాల్లో ఏఏ వ్యభిచారిణి దగ్గరికి వెళ్లావో నాకు అంతా తెలుసు. అవన్నీ నాకు గుర్తున్నాయి. నాకు ఇంకా చాలా విషయాలు గుర్తున్నాయి. 1966 సంవత్సరంలో స్త్రీల, బాలికల వ్యభిచార నిర్మూలన చట్టం కింద కలకత్తాలో ఐదుగురిపైన, 1967 సంవత్సరంలో పందొమ్మిదిమంది పైన కేసులు నమోదయ్యాయి. 1966సంవత్సరంలో సెంట్రల్ మినిస్టర్ ఒకరు వేశ్యలపైన పోలీసుల ‘జులుం’ నిలువరిస్తామని వేశ్యల సమావేశంలో హామీ కూడా ఇచ్చారు” అంటూ ఓ తెలివిగలదానిలా మాట్లాడుతూ హీంహీం అంటూ నవ్వసాగింది. తర్వాత ఆమె ఠాకూర్ సాహెబును వేలెత్తి చూపుతూ “నాకు మరిన్ని విషయాలు తెలుసు. 1962-63 సంవత్సరంలో నాదేశ ప్రజలు 27,68,236 లీటర్లు, 1964-65 సంవత్సరంలో 34,20,748 లీటర్లు విదేశీమద్యం తాగారు. ఈ అంకెలు సరైనవో కావో నాకు గుర్తులేదు. కానీ నువ్వు ఏఏ సమయాల్లో ఏఏ షాపులకి వెళ్లావో, ఎంత ఖర్చు చేశావో ఆ లెక్కలన్నీ నేను చెప్పగలను” అంటూ అరిచింది.

“వెళ్లు, బయట గాలి వీస్తోంది. నూతి దగ్గర చాప వేసుకుని కూర్చో” అన్నాడు సాహెబు వాత్సల్య పూరిత స్వరంతో.

“నువ్వు వేపాకుల కదలిక చూసి గాలి వీస్తోందని అనుకుంటున్నావు. అసలు కారణం అది కోతులపని. కనబడ్డంలేదా, లావు మూతి, వంకరమెడవున్న ఆ కోతి ఒక కొమ్మపై నుంచి మరో కొమ్మపైకి ఎలా దూకుతుందో! కొమ్మలని కుదుపుతున్నందువల్లే వేపాకులు కదులుతున్నాయి” అంటూ ఆ కోతి వైపు చూసి నవ్వింది ఠాకూర్ భార్య. ఆ తర్వాత కోతిని చూసేందుకు బావి దగ్గరికి వెళ్ళి నిలబడింది. ఇదే అదనుగా ఠాకూర్

సాహెబు తడుముకుంటూ తలుపులు మూసేందుకు కదిలాడు. కానీ హింసకి అలవాటుపడ్డ బాధితురాలిలా ఠాకూర్ భార్య వేగంగా తిరిగొచ్చి "తలుపులు మూయకు. అంతా కుళ్ళికుళ్ళి చస్తారు. మొత్తం వంశమే నాశనమైపోతుంది. నువ్వు పాపాలతో పీకలదాకా కూరుకుపోయావు. ఇంక కంఠంపైన ఆ మాల ధరించడంవల్ల ప్రయోజనమేముంది? " అంటూ అరిచింది.

అంధుడైన ఠాకూర్ సాహెబుని తీసుకు వచ్చి మళ్ళీ రేకు కుర్చీ మీద కూర్చోబెట్టిందామె. వరండాలో కూర్చుని భార్య మాటలు పడాల్సివచ్చింది ఠాకూర్ సాహెబుకి. "భగవంతుడు నాకీ సువర్ణావకాశాన్ని ఇస్తాడని తెలుసు. జీవితమంతా బాధ్యతారహితంగా మందుతోను, మగువలతోనూ కుషీగా, జీవితాన్ని జల్సాగా గడుపుతున్నపుడు నువ్వు ఇలాగే రేకు కుర్చీలో కూర్చుని ముత్యాల్లాంటి నా మాటలు వినాలని ఆ భగవంతుణ్ణి ప్రార్థించాను. నా యౌవనం ఎప్పుడో గడిచిపోయింది. నీకూ వృద్ధాప్యం వచ్చేసింది. ఇప్పుడు మన మధ్య మిగిలింది ఈ మాటలు మాత్రమే. ఇప్పుడు నాకు దుఃఖమన్నది లేదు. ఈ ప్రజభూమికి పొమ్మని ఎవరో నిన్ను తన్ని తగలేశారని నువ్వు అన్నందుకు మాత్రమే నేను బాధపడతాను" అంది ఠాకూర్ భార్య ఒకింత ఉద్విగ్నంగా.

అంతలోనే ఠాకూర్ సాహెబు భార్య పెదాలపైన చిరునవ్వు మెరిసింది. నెమ్మది నెమ్మదిగా అది ఏడుపులోకి మారింది. ఆమె చీకటి గదిలో ఏడుస్తూ గోడకేసి తల బాదుకుంది. ఆ తర్వాత మృణాళిని జమ చేసిన రేకుడబ్బాలు మొదలైనవి ఠాకూర్ సాహెబుపైన విసరడం మొదలెట్టింది.

ఆ గగ్గోలుతో గదుల్లో వున్న రాధేశ్యామీ స్త్రీలు బయటికి వచ్చి "ఇది ముసిలాడ్ని కొట్టి చంపేసేట్టుంది. ఎవరైనా పట్టుకోండి దాన్ని" అంటూ అరిచారు.

కానీ ఎవరూ దగ్గరికి వెళ్ళే సాహసం చేయలదు. ఈ భయంకర దృశ్యాన్ని రాధేశ్యామీ వృద్ధస్త్రీలు ఒకరినొకరు చేతులు పట్టుకుని చూస్తూ నిలబడిపోయారు.

ఠాకూర్ భార్య బట్టలు విప్పేసింది. కుంగిన తన స్తనాలని చప్పరించసాగింది. రక్తపు బొట్లు ఎగిసి పడ్డాయి. కానీ ఏ ఒక్క రాధేశ్యామీ కూడా ఆమె దగ్గరకి వెళ్ళే సాహసం చేయలేకపోయింది.

★ ★ ★

ప్రజలో పండగ వాతావరణం నెలకొంది. స్వాముల పండగ. ఎందరో స్వాములు. వీళ్ళలో రఘునాథ మందిరంలోని జోగివాహన స్వామి, పరకాలస్వామి, బారా మునిస్వామి, కాంచీపురస్వామి ఈ స్వాములందరి పండగ. గోదాదేవి మూర్తిని కూడా ఈ శోభాయాత్రలో జోడించారు. దీని తర్వాత అశ్విని మాసంలో పదమూడో నక్షత్రం రోజున నవరాత్రి పండగ ప్రారంభమైంది. స్వర్ణమయ స్తంభం ప్రాంగణంలో మరోసారి గోదాదేవి శోభాయాత్ర ఏర్పాటు చేశారు.

శశి, ఆలంఘడీ నవరాత్రి పండగ పూర్తయ్యేవరకు కలిసి వున్నారు. తర్వాత వన ఖండిలో కొందరు రాధేశ్యామీలు నివాసముండే ఒక చిన్న కుటీరంలోకి శశి వెళ్ళాలని నిర్ణయించుకుంది.

ఆలంఘడీ కూడా బిహారీ మోహన్ కుంజ్‌ని వదిలేశాడు. తన నివాసాన్ని యమున వొడ్డున ఉన్న ఓ పెచ్చులూడిన పాతభవనంలోకి మార్చాడు. ఆ భవనంలో ఓ జ్యోతిష్యుడు కూడా వుంటున్నాడు. అతను రాగినాణాలు విసిరి ఎవరి భవిష్యత్తు అయినా చెబుతాడు. ఆలంఘడీ, జ్యోతిష్యుడూ ఇద్దరూ కలిసి నివసించసాగారు. సరియైన ఉద్యోగం దొరికేవరకు ఆలంఘడీ ప్రజాసేవలో గడపాలనుకున్నాడు. కొంతకాలం ఒంటిపూట భోజనంతో కాలక్షేపం చేయాలనుకున్నాడు.



వనఖండిలో వుండడం శశికి ఇబ్బందిగా మారింది. ఎందుకంటే కొందరు ఆకతాయిల గుంపులు ఆమె కుటీరం ముందు జుగుప్సాకరమైన జోకులు వేయడం మొదలుపెట్టాయి.

గోదాదేవి శోభాయాత్ర గరుడస్తంభం చుట్టూ సాగుతున్నపుడు శ్రీమతి సేఠ్ కోసం ఉత్సుకతతో చూడసాగింది శశి. ఎవరు చెప్పగలరు, ఆమె గోపాలుని సేవలో భాగంగా బహుశా తనని కూడా చేరదీస్తుందేమో! బహుశా అదే జరిగితే తన అదృష్టంకాక మరేంటి? అనుకుంది శశి.

నరసింహస్వామి, శఠగోపస్వామి పండగల సమయంలో రంగనాథస్వామి మందిర సింహద్వారం దగ్గర నిలబడసాగింది శశి. కానీ ఆ మహిళ కనబడలేదు. ఆమె వాహనం గానీ, పల్లకీగానీ కనిపించలేదు. అంతేకాదు, ఆమె పరిచారకుల ఆవాసమూ తెలియరాలేదు. శశి నిరాశ చెందింది.

నవరాత్రి ఉత్సవాల్లో శశి బాగా అలసిపోయింది. ఒకరాత్రి ఉత్సవం నుంచి త్వరగా ఇంటికి వచ్చి పక్కమీద వాలిపోయింది శశి. ఆమె చింతాగ్రస్తమై ఉంది. ఆ సమయంలో కేసీఘాట్ దగ్గర రాంలీలా ప్రదర్శనలో భాగంగా రావణ సంహార కోలాహలం, బాణసంచా ధ్వనులు వ్రజ వాతావరణాన్ని ఉత్తేజపరిచాయి. కవితాగానం చెవులకు సోకుతోంది.

ఆ సమయంలో రాధేశ్యామీలలో అధిక భాగం రాంలీలా ప్రదర్శన తిలకించి ఆనందాన్ని ఆస్వాదించేందుకు వెళ్లారు. ఉన్న కొద్దిమందీ గాఢనిద్రలో ఉన్నారు. శశికి వాళ్ల గురకపెట్టడం వినిపిస్తోంది.

అకస్మాత్తుగా శశికి ఎవరో గట్టిగా నవ్వడం వినిపించింది. ఆ నవ్వు భయంకరంగా ఉంది. శశి కలవరపాటుకు గురయ్యింది. లేచి మంచం పట్టె మీద ఓ వారగా కూర్చుంది. వెంటనే గది తలుపు మీద దబదబమంటూ కొడుతున్న శబ్దం వచ్చింది. శశికి భయమేసింది. వెంటనే ఎవరో పిలుస్తున్న శబ్దం వినిపించింది.

"తలుపు తియ్యి త్వరగా"

"ఎవరు నువ్వు? "

"ముందు తలుపు తియ్యి. తెలుస్తుంది నేనెవరో"

"మీ పేరు చెప్పండి. ఓ అపరిచిత వ్యక్తికి ఇంత రాత్రి తలుపు తీయను" అంది శశి.

"బడాయి మాటలతో లాభం లేదు.

నేను తలచుకుంటే ఒక్క తోపుతో తలుపు తీయగలను. నేను ఆలంఘడీ స్నేహితుణ్ణి అనుకో. నువ్వు ఎలాంటి పరిస్థితిలో ఉన్నావో నాకు తెలుసు. నేను నీకు సహాయపడేందుకు వచ్చాను. రాంలీలా చూద్దామని ఇటువైపు వెళ్తూ వెళ్తూ ఇక్కడికి వచ్చాను"

శశి ప్రతిస్పందన కోసం చూడకుండా ఆ వ్యక్తి తలుపు మీద తన్నడం మొదలెట్టాడు. శశి గాబరాపడింది. ఏ సమయంలోనైనా గురకపెడుతున్న రాధేశ్యామీలకు మెలకువ రావొచ్చు. ఆ తర్వాత తనని కుటీరం వదలి వెళ్లాల్సిందిగా బలవంతం చేయవచ్చు. ఇది తనకి ఏ మాత్రం శ్రేయస్కరం కాదు అనుకుంది శశి.

చివరికి ధైర్యంచేసి తలుపు తీసింది శశి. ఎదురుగా భుజం మీద తెల్లటి కండువాతో ఓ వ్యక్తి నిలబడ్డాడు. "నిజం చెప్పాలంటే నేను నిన్ను కలిసేందుకు ఆలంఘడీ ఒప్పుకున్నాడు. అతణ్ణించి దూరంగా ఉండాలా లేదా అన్నది పూర్తిగా నీ ఇష్టం. కానీ నేను ఇక్కడికి ఓ ప్రతిపాదనతో వచ్చాను. నాకు కూడా ఓ మందిరం ఉంది. నాకు సహకరించేందుకు ఒక మహిళ అవసరం. నువ్వు ఆలంఘడీతో గడిపినట్టుగా నాతోనూ గడపవచ్చు. అవసరమనుకుంటే నాతో పడుకోవచ్చు. ఒక విషయం, ఈ చుట్టుపక్కల అందరికీ నీ భయానక పరిస్థితులు తెలుసు. నీ బాధల్ని వాళ్లు అవకాశంగా తీసుకోవచ్చు. నువ్వు కటువుగా మాట్లాడితే సహించే వ్యక్తిని కాను నేను. నా శక్తినంతటినీ ఉపయోగిస్తాను" అన్నా డు ఆ అపరిచిత వ్యక్తి.

ఆ వ్యక్తి మాట్లాడుతుంటే నోటి నుంచి దుర్వాసన వస్తోంది. ఆ మనిషి మద్యంతో పాటు మాదక ద్రవ్యాలు సేవించాడని శశి గ్రహించింది. ఆ అపరిచితుడు శశివైపు వేలెత్తి చూపుతూ "నా ప్రతిపాదన తిరస్కరిస్తే నువ్వు పశ్చాత్తాపపడతావు. వీధుల్లో ముష్టెత్తుకోవలసిందే! ఆకలిగొన్న తోడేళ్లు చెలరేగిపోయి నిన్ను వశపరచుకునేలోపున దిక్కులేని చావు ఛస్తావు. నేను మృదుస్వభావం గలవాణ్ణి. లోభిని కాను. పేరాశగల తోడేళ్లు వేటాడిన బొమికల్ని గుటుక్కున మింగుతాయని నీకు తెలియదా? " అన్నాడు.

ఆ దుష్టుడు తన నుదుటికి పట్టిన చెమట బిందువుల్ని తుడుచుకుంటూ "తెల్లవారుతోంది. బహుశా రంగనాథ మందిరంలో సుప్రభాతసేవ అయిపోయి ఉంటుంది. అక్కడ అందరికీ విశ్వరూప దర్శనం లభిస్తుండవచ్చు. ఈ సమయంలో రాధేశ్యామీ వృద్ధస్త్రీల గుడిసెలు, కుటీరాల చుట్టూ తిరుగుతుండడం నాకు సిగ్గుచేటు. ఇక వెళతాను. చెప్పాల్సింది చెప్పాను. బాగా ఆలోచించుకో" అన్నాడు.

బాగా మద్యం సేవించి ఉండటంతో అతను వెళుతున్నప్పుడు శశి గమనించింది.. తిన్నగా పడని అతని పాదాలు అతని పరిస్థితిని చెప్పకనే చెబుతున్నాయి.

సరిగ్గా అదే సమయంలో స్వామి బృందావననాథుడి ఊరేగింపు సింహద్వారం దాటి బయటికి వచ్చింది. మూర్తి సమక్షంలో ప్రార్థనాస్తోత్రాలు, శంఖనాదాలు, గంటల శబ్దాలు వంశీగోపాల్, రాధా దామోదర మందిరాల నుంచి గాల్లో తరంగాల్లా తేలివస్తున్నాయి. తరుణ వయస్కుడైన ఓ స్వామి కాళ్లకి చెప్పులు లేకుండా రథానికి వెనకగా ఊరేగింపులో నడవడం చూసింది శశి. గత సంవత్సరం రథయాత్రలో ఆ స్వామి రథం తాడు లాగుతుండగా తను అతని సమీపంలో నిలబడ్డ విషయం జ్ఞప్తికొచ్చింది శశికి.

ఎన్నోసార్లు, ఎన్నో సందర్భాల్లో యువకుడైన ఆ స్వామిని చూసింది శశి. గజేంద్ర మోక్షం ఉత్సవంలో, గజగ్రాహిలీల సమయంలో, ఝూలన్ ఉత్సవంలో రాధా మాధవుల లీలా వినోద సమయంలో,

గరుడ ఉత్సవ సమయంలో, గజేంద్రమోక్ష కుండంలో బోటు రేసులోను, స్వర్ణస్తంభం చుట్టూ గోదాదేవిని ఊరేగించే సమయంలోను.. ఇంకా అనేక ప్రదేశాలలో అనేక సందర్భాలలో అతణ్ణి చూసింది శశి. ఏదో తెలియని ఆనందానుభూతితో ఆ యువకిశోరాన్ని తదేకంగా చూస్తూ ఉండిపోయేది. ఆమె తన కోరికని అణచిపెట్టే కొద్దీ అతణ్ణి అలాగే చూస్తూ ఉండిపోవాలన్న వాంఛ అధికమవ్వసాగింది శశిలో.

ఊరేగింపు చీరహరన్ మెట్ల దగ్గరికి చేరుకుని అక్కణ్ణించి యమున దగ్గరకి చేరుకుంది. దగ్గర్లోని శిథిలమైన మెట్ల మీద స్థావరం ఏర్పరచుకుని పూజకోసం పవిత్ర జలం తీసుకువస్తున్న యువకుడైన ఆ స్వామిని ఎంతో ఆసక్తితో తదేకంగా చూడసాగిందామె. మంత్రోచ్చారణలు, షెహనాయ్ వాద్య మధురిమలతో యమున ఒడ్డు ప్రతిధ్వనించింది. నది ఒడ్డు నుంచి స్వామి తిరిగి వచ్చి విశాలమైన పందిరి నీడలో కూర్చున్నాడు.

కొంతసేపటి తర్వాత శశి తన గదికి చేరుకుంది. గుమ్మం దగ్గర ఇద్దరు రాధేశ్యామీలుండటం శశి గమనించింది.

శశిని చూడ్డంతోటే "ఎవరో ఇద్దరు వ్యక్తులు నిన్ను కలవాలని వచ్చారు. వాళ్ల మెడలో తులసిమాలల్లేవు. వాళ్లేదో ఆశించి వచ్చి ఉండొచ్చు" అన్నారు ఆ రాధేశ్యామీలు.

శశిలో ఎలాంటి ప్రతిస్పందనా లేకపోవడంతో వాళ్లు శశితో "నువ్వు ఆలంఘడీ దగ్గరకి వెళ్లిపోవడానికి నిర్ణయించుకున్నావనిపిస్తోంది" అన్నారు.

"లేదు, లేదు. వెళ్లను" అంది శశి అయిష్టంగా.

ఆ ఇద్దరు రాధేశ్యామీలూ నిరాశ చెందారు. ఎందుకంటే శశి అక్కడ ఉన్నందువల్ల ఆమె యౌవనాన్ని జుర్రుకోవాలనే ఆశతో ఉండే మృగాళ్లని వాళ్లు ఎదుర్కోలేకపోతున్నారు. అంచేత ఆ ఇద్దరూ ఆమెను దుర్భాషలాడుతూ వెళ్లిపోయారు.

వాళ్లు వెళ్లిపోగానే కుటీరాలు నిర్మానుష్యంగా మారిపోయాయి. ఒంటరిదైన శశి పిచ్చి ఆవేశంతో గదిలోకి వెళ్లిపోయింది.




అది శరత్కాలం. మల్లెలు పూచే సమయం. ఉదయాన్నే వ్రజభూమి లో సంకీర్తన చేసే సమయంలో దృష్టి మాంద్యం గల రాధేశ్యామీలు వాళ్లవాళ్ల గదుల్లోంచి బయటకి వచ్చి ఒకరి చేయి ఒకరు పట్టుకుని ముందుకు సాగుతారు. గతకొన్ని రోజులుగా సౌదామిని ఆసుపత్రిలో పనిచేయడం మానేసింది. యమునలో స్నానం కూడా మానేసింది. రంగనాథస్వామి ఉత్సవంలో కూడా ఆమెని చూడడం కష్టమే.

డాక్టర్ రాయ్‌చౌదరి పేరు అతి తక్కువ సమయంలోనే ప్రాశస్త్యం పొందింది. ఆయన ఎక్కడ కనబడినా ప్రజలు వినయంతో శిరస్సు వంచి నమస్కరిస్తున్నారు. ఆయన దగ్గరికి వచ్చే రోగుల సంఖ్య అధికమైంది. అన్ని ప్రాంతాల నుండి ధనిక, పేద భేదం లేకుండా వైద్యం కోసం ఆయన వద్దకు రాసాగారు. రోగుల రద్దీ పెరగడంతో మందిరంలోని ఖాళీ గదులు కూడా ఉపయోగించాల్సి వస్తోంది. కానీ అగ్రవర్ణాలకి, అంటరానివాళ్లకి ఒకే నీటికుండని ఏర్పాటు చేయడంలో మాత్రం విఫలమయ్యాడాయన. ఆసుపత్రి

ఆవరణలో కూడా రెండు కుండలు పెట్టాల్సి వచ్చింది.

సౌదామినిలో పరివర్తన తేవాలనుకున్న తండ్రి కోరిక నెరవేరలేదు. ఆసుపత్రిపట్ల సౌదామినిలో మొదట్లో ఉండే ఉత్సాహం ఇప్పుడు లేదు. అయినా అవమానాలపాలైన, గాయపడ్డ పేదలపట్ల ఆమె మనసులో సానుభూతి సదా ప్రవహిస్తూనే ఉందన్న విషయం ఆయనకి తెలుసు. ఓ చీకటి సందులోని కసువు కుప్పలోంచి కుష్ఠురోగిని తీసుకువచ్చింది సౌదామిని.

లేదు. ఇక మిగిలిందేమీ లేదు. ఆశలన్నీ అడుగంటిపోయాయనిపిస్తోంది. ఈ ఏడేళ్ల కాలం ఆమెని పరిచయం లేని ఈ భూమిపైన ఓ వయసు మీరిన దానిలా మార్చి వేసింది. ఇప్పుడామె స్వయానా ఓ అపరిచితురాలిగా మారింది. తరచుగా తన మదిలో ఏదో ప్రత్యేకమైన కాంతి ప్రకాశిస్తుండటం గమనించింది సౌదామిని. క్షేత్రంలో చాలా దూరంగా ఉన్న వంశీఘాట్ జ్ఞానగోదారి బిళ్వమంగళం ఆవలి పక్క గోవర్ధనం వైపుగా తన గమ్యం ఉన్నట్టుగా అనిపిస్తోంది సౌదామినికి. దీనిని జ్ఞాన ప్రకాశంగా పేర్కొనవచ్చు. జనసమ్మర్దంగా ఉన్న సమయంలో యమునలో నీటి గర్భంలోంచి మెరుస్తున్న ఈ కాంతి తెలుతుండగా కనుగొంది సౌదామిని. ఈ అమూల్యకాంతితో సమానమైంది మరేదీ బహుశా లేకపోవచ్చు.

'లఖ్‌పతీరాజ్' సమాధి వద్ద ఒక అసాధారణమైన ఉదాశీనత చోటుచేసుకుంది. మధురలోని ఒకనాటి బౌద్ధ స్మారకాలు ఇంకా ఉజ్జయిని చిత్రకారుల చిత్రపటాల గ్యాలరీలు ఇప్పుడు అభేద్యమైన ముళ్లపొదలతో నిండిపోయాయి. ఆల్ బకరా మొక్కలు వృద్ధి చెంది చుట్టూ పరుచుకున్నాయి. చెవుల్లో దుఃఖంతో కూడిన ఆవేదన అక్కడ ప్రతిధ్వనిస్తుంది. సౌదామిని ఆత్మకు కూడా ఏకాంత అనుభూతి కలిగింది.

ఈ ఏకాంతం సౌదామినికి తెలియనిది కాదు. సుబ్రత్‌ని కలిసినపుడు, అతనితో వివాహం జరిగిన తర్వాత తాను ఒంటరినన్న భావన తొలగిపోయింది సౌదామినిలో. నిజంగా అది ఓ అద్భుతం. దాన్ని ఎలా వ్యక్తీకరించడం? దాన్ని ప్రేమ అంటారా? ఆ ప్రేమ కారాగారంలోని అస్తిత్వం నుంచి విముక్తి కలగజేయాలి. అక్కడ ఉన్న పరాయి ఆత్మ తనకి అపరిచితమైంది. దీన్ని విముక్తి అనాలా లేక మరేదైనా శక్తా?

తర్వాత ఆ ఈసాయి యువకుడు, అతని గురించి ఏంటి? తరచుగా సౌదామిని మనసు ఓ గుహలోంచి పయనిస్తున్నట్టుగా అనిపిస్తుంది. అప్పుడప్పుడు తనకు తాను చెప్పుకుంటుంది.. ఆ ఉజ్వల ప్రకాశానికంటే ఈ చీకటే బాగుందని. మరెవరైనా ఎన్నడైనా ఇలాంటి ఆధ్యాత్మిక ధర్మసంకటాన్ని ఎదుర్కొన్నారా? తనలాంటి మరో మహిళ ఎవరైనా ఇంతకు ముందు వ్రజభూమిని దర్శించారా?

ఒకరోజు సౌదామిని ఏదో మర్మధ్వని వినబడ్డంతో నిద్రలో ఉలిక్కిపడి లేచింది. అది ఆకులు రాలిన శబ్దమా? లేక గరుకు పోస్టర్ల శబ్దమా? ఎలాంటి పోస్టర్లు? బాంకేబిహారీ మందిరం గోడలపైన అంటించిన లజ్జాకరమైన అభియోగాలతో వున్న పోస్టర్లా? తల ఎత్తి చూసింది

**కొత్తగాలి...** 

**పెళ్లికెదిగిన కూతురే కాదు**
**పనిలేని కొడుకు కూడా**
**గుండెల మీది కుంపటే!**

– బిక్కునూరి రాజేశ్వర్,
పొన్కల్

సౌదామిని. గది కప్పుపైన వాసం దగ్గర వున్న నెరియలోంచి జారుతూ పాకుతున్న ఓ నాగుపాముని చూసి భయభ్రాంతురాలైందామె. సన్నగా వుండి పసుపు రంగుతో ఓ వెలుగుకిరణంలా అది మెరుస్తోంది. ఆ పాము మనిషి వాసన పసిగట్టి నెరియలో దాగినట్టుగా తోస్తోంది. అంతలో ఆ పాము మాయమైపోయింది.

ఉదయం లేవగానే పాముని చూడ్డం దుశ్శకునమా? ఇప్పుడు ఏం చేయాలి? ధీరసమీరకుగానీ, నికుంజ్ వన్ కుగానీ, బాలాజీ మందిరానికిగానీ వాహ్యాళిగా వెళ్ళాలనుకుంది సౌదామిని. కానీ పొద్దున్నే ఒంటరిగా బయటకి వెళ్ళవద్దన్న తల్లి హెచ్చరిక గుర్తుకువచ్చింది. ఎందుకంటే వ్రజభూమి ఇప్పుడు మనుపటిలా లేదు. యువతుల రక్షణకి వ్రజభూమిలో ఎలాంటి హామీ లేదు. వాస్తవానికి పరిస్థితులు ఎంత గంభీరంగా మారాయంటే సౌదామిని తల్లి గోరంతల్ని కొండతలు చేసేసింది. ఓ ఈసాయి యువకుడు చిర ఘాట్ మెట్లమీద కూర్చుని వుండడం చూసినట్టుగా నిన్ననే ఓ రాధేశ్యామీ సౌదామినితో చెప్పింది.

అప్పటి నుంచి సౌదామిని భయపడిపోయింది. ఆమె యమునలో స్నానమాచరించే ఆనందాన్ని కూడా వదులుకుంది. అంతేకాదు, పూజలో భాగంగా దేవికి మారేడు దళాలు సమర్పించేందుకు గోపీశ్వర్ వెళ్ళడం కూడా విరమించుకుంది.

సౌదామిని తలుపు తెరిచి బయటికి వచ్చింది. ఆమె తన ఆలోచనల్లోంచి బయటపడలేకపోతోంది. ఈమధ్య వ్రజభూమిలో ప్రతిఒక్కరూ సంకటస్థితిలోనే వున్నారు. ఇదివరకటి భద్రత లేదు. పురాతన కాలంనాటి వ్రజభూమి ఇసుకలో కూర్చుని ఆలోచనల్లో మునిగిపోయింది సౌదామిని. ఇప్పుడు పురాతన సందుల్లో గొందుల్లో గుంపులు గుంపులుగా ఆడమనిషి మాంసం కోసం ఆశపడే తోడేళ్ళు వున్నాయి. రక్షణ లేకుండా ఏ మహిళ కూడా బయటికి వెళ్ళడం సురక్షితంగా భావించడంలేదు. ఎంతటి దౌర్భాగ్యం?

సౌదామిని తన దుపట్టాతో తలని, మొహాన్ని కప్పుకుంది. ఈ సమయంలో ఒంటరిగా కూర్చోవాలంటే ఇబ్బందిగానే వుంటోంది. రోజులు గడుస్తున్నకొద్దీ తాను ఒంటరినన్న భావన సౌదామినిలో అంతకంతకూ పెరగసాగింది.

దేవాలయాన్ని చేరుకునేందుకు బ్రహ్మకుండ్ దగ్గరున్న చిన్నపాటి సందును ఎంచుకుంది సౌదామిని. తూర్పున విచ్చుకున్న వెలుగురేకలు నెమ్మదిగా పెరగసాగాయి. కొంతదూరం వెళ్ళిన తర్వాత బ్రహ్మకుండ్ దగ్గర చేష్టలుడిగిన దానిలా నిలబడిపోయింది సౌదామిని. తలమీదున్న దుపట్టాను మొహం కనిపించకుండా మరింత ముందుకు లాక్కుంది. దగ్గర్లోనే వున్న ల్యాంప్‌పోస్ట్ కింద నిలబడిన వ్యక్తిని చూసి ఆమె గాభరాపడింది. అతని ముందు మరోవ్యక్తి చచ్చినట్టు పడివుండడం కనిపించింది సౌదామినికి. అత ను పూర్తిగా నగ్నంగా ఉన్నాడు. తొలిసంజవేళలో భూతంలా కనిపిస్తున్నాడతను.

సౌదామిని వెనక్కి తిరిగి వెళ్ళిపోలేదు. ఆమె శిథిలావస్థలో వున్న మందిరం గోడను ఆనుకుని నెమ్మది నెమ్మదిగా జరుగుతూ దగ్గరకంటావెళ్ళి ఆ వ్యక్తిని చూసింది. ఆ వ్యక్తిని గుర్తుపట్టగానే హృదయం బద్దలైనట్టుగా కెవ్వుమని ఒక్క అరుపు అరిచింది సౌదామిని. ల్యాంప్ పోస్టు కింద వున్న వ్యక్తి మరెవరో కాదు తన తండ్రి శ్రీ రాయ్ చౌదరి.

తన తండ్రి ఆ వ్యక్తిని నఖశిఖపర్యంతం పరీక్షించడం సౌదామిని గమనించింది. మరుక్షణంలోనే అతడు తన ఒంటి మీద వున్న దుప్పటిని ఆ వ్యక్తిమీద కప్పి అతనడిని తన చేతుల్లో ఎత్తుకుని వేగంగా నడ

పసాగాడు, తానొక యువకుడైనట్లు, అరవై వసంతాల వృద్ధుడు కాదనే భావన కలిగించే విధంగా.

తన తండ్రి హృదయం పూర్తిగా కరుణతో నిండిపోవడంతో ఆయనని ఈ యుగానికి చెందిన ఓ మహామనిషిగా భావించవచ్చునుకుంది సౌదామిని. ఈ వ్రజభూమికి చెందిన గోస్వామి, శంభూరామ్ అవస్థల ఆఖరి ప్రతినిధి అన్నట్టుగా వుంది అతని దయాహృదయం.

సౌదామిని గోడపక్కనుంచి బయటకివచ్చేసింది. ఆ సమయంలో గాలి తీవ్రంగా వుంది. సౌదామిని నెమ్మదిగా నడుస్తోంది. మందిరం ప్రవేశద్వారం దగ్గర ఆకలి దప్పులతో వున్న బిచ్చగాళ్ళు లైను కట్టడం మొదలయింది. వాళ్ళ లైను చెప్పుల స్టాండు దాకా సాగివుంది. శుక్రవారం కావడంతో మందిరంలో శ్రీవెంటేశ్వర తిరుమంజన సేవ జరుగుతోంది. అది పూర్తయ్యేంతవరకు అక్కడే ఓ మూల కూర్చోవాలనుకుంది సౌదామిని. గదిలోకి అడుగుపెట్టగానే ఒంటరితనం ఆవహిస్తుంది. దానికన్న ఇదే మంచిదనుకుంది సౌదామిని. ఒకవేళ తిరగ్గలిగితే విస్తారమైన వ్రజలో పగటిపూట నలువైపులా తిరగాలనుకుంది. స్వేచ్ఛగా వున్నానన్న భావన కలిగిందామెకి. అన్ని బంధాల నుంచి విముక్తి అయినట్లు.. తన అస్తిత్వానికి తానే స్వామిని అయినట్లు.

తనకి కొద్ది దూరంలో యువకుల గుంపుని చూసింది సౌదామిని. వాళ్ళు బ్రహ్మచర్య ఆరంభదశలో వున్నారు. వాళ్ళ భుజాలపైన భిక్షువుల సంచీలు వేలాడుతున్నాయి. వాళ్ళు సూర్యుడికి అభిముఖంగా భక్తిపూర్వకంగా శిరస్సులు వంచి సూర్యభగవానుని స్తుతిస్తూ మంత్రోచ్చారణ చేస్తున్నారు. వాళ్ళని తేలికగానే గుర్తించింది సౌదామిని. వాళ్ళంతా ఉత్తర కాశీలోని స్వామి బ్రహ్మానందకి చెందిన కళాశాల విద్యార్థులు. నిన్నటి రోజునే మధురలోని ధార్మిక సమ్మేళనంలో సంస్కృతాన్ని మాతృభాషగా బ్రహ్మానంద స్వామి అభివర్ణించే సాహసం చేసినప్పుడు ప్రజల నిరసనలు, దూషణలు వ్యక్తమయ్యాయి. వ్రజభూమిలో సంస్కృతం ఇప్పటికీ జీవభాష అని ఆయన విశ్వాసం.

బ్రహ్మానందస్వామి విద్యార్థుల భుజాల పైన భిక్ష సంచీలు వేలాడుతున్నాయి. అదేమంత ఆశ్చర్యకరమైన విషయమేమి కాదు. అది తెలిసిందే. వ్రజలోని వేద కళాశాల విద్యార్థులు కూడా భిక్ష ద్వారానే సంపాదించేవారు. మరికొంత డబ్బు సంపాదించేందుకు రామచరితమానస, కేశవదాసు రామచంద్రిక నుంచి కొన్ని దోహాలు, కొన్ని పద్యాలు పఠించేవారు. కొందరు వాసుదేవుని భ్రమరసందేశం, రామతత్త్వం, భాస్కర మాధుర్యం, కేళీ కాదంబిని గ్రంథాల్లోని శ్లోకాలు చదివేవారు. కొత్తగా వచ్చే యాత్రికులకి ఇది ఓ నూతన అనుభవం. వాళ్లు వాచకుల సంచీలని పూలతోను, నాణేలతోను నింపేసేవాళ్ళు.

తన బట్టలకు అక్కడక్కడా అతుకులు కనబడ్డాయి సౌదామినికి. ఇంకా ఎక్కువ రోజులు వాటిని ధరించడం కుదరదు. షాహీజీ బాలికల పాఠశాలలో ఏదో ఒక ఉద్యోగం ఖాళీగా వుంటుందని, ప్రయత్నించమని రాయ్‌చౌదరి, అనుపమలు ఆమెకు చెప్తూనే ఉన్నారు. "జ్ఞానగోదారి దగ్గరున్న లక్ష్మీబాయి మహిళా కళాశాలలో నీకు ఏదో ఒక అవకాశం లభించవచ్చు నువ్వు ఎందుకు ప్రయత్నించవు? మనదగ్గర నిధి ఏదైనా వుందని అనుకుంటున్నావా? మీ నాన్న ఈ ఆసుపత్రిలోని పనికిరాని వస్తువులు తప్ప ఎలాంటి ఆస్తిపాస్తులూ ఇవ్వలేదు" అంది అనుపమ.

అవును, తల్లి చెప్పింది నిజమేననిపించింది సౌదామినికి. ఎవరూ తనకి ధనరాశులు ఇవ్వలేదు. యూనివర్సిటీ డిగ్రీ

ట్రంకుపెట్టెలో చుట్టగా పడివుంది. ఇప్పుడు ఆ డిగ్రీ ఉపయోగం ఏముంది? అసలు తను ఎందుకు చదివినట్టు? జ్ఞానం కోసమా? భవిష్యత్తు భద్రత కోసమా? తనను తాను ప్రశ్నించుకుంది సౌదామిని.

'విడిచిన బాణంలా సమయం వేగంగా పరుగెడుతోంది. కాలాన్ని మరింత వేగవంతంగా ముందుకు సాగనివ్వడమంటే ముళ్ళపొదలతో నిండిన డొంకదారిలో ప్రవేశించడమే. దానిలోంచి నిష్క్రమణ అనేది వుండదు' అంటూ ఎన్నో రోజులుగా ఎవరో తన చెవిలో గుసగుసలాడుతున్నట్టు అనిపించసాగింది సౌదామినికి.

తాను తిరుమంజనం సేవ ముగిసేవరకు వేచివుండాలా? పాలతో శ్రీవేంకటేశ్వర స్వామిని అభిషేకిస్తారు. ఆ ప్రాంతంలోని పిల్లలు, పరిసరాల్లో వుండే శ్రామికులు పాలు ప్రవహించే గుండం చివర వరుసక్రమంలో నిలబడ్డారు. బిచ్చగాళ్ళు కూడా సరియైన చోటు కోసం తోసుకోసాగారు. అక్కణ్ణించి వెళ్ళిపోవాలని నిర్ణయించుకుంది సౌదామిని. ఆమె యమున వైపు సాగిపోయింది. ఇసుకలో 'పరమార్' పక్షులు గుంపులు కట్టడం కనిపించిందామెకి. సౌదామిని మదిలో అకస్మాత్తుగా చంద్రభాను రాకేష్ అతని వర్క్‌షాపులు మెదిలాయి. పరస్పరం కలహించుకునే రాధేశ్యామీలతో గడపడంకన్నా రాకేష్ వర్క్‌షాపులో గడపడం మేలనిపించింది. అక్కడికి చేరుకుంది సౌదామిని. అప్పటికే చేరుకున్న విదేశీ యాత్రికులతో పరిచయం ఏర్పడిందామెకి. నేలమీద బాసంపట్టు వేసుకుని కూర్చుని వున్నారు వాళ్ళు. అష్టధాతు చిత్రకళలో శిక్షణ పొందే వాళ్ళలో ఒక వ్యక్తి ఓ మూల గంభీరంగా పనిచేస్తున్నాడు. యాత్రికుల మొహాలలో కుతూహలం అధికంగా కనబడుతోంది. వాళ్ళు అనేకమైన ప్రశ్నలు సంధించసాగారు.

ఆధ్యాత్మికపరంగా వ్రజభూమి ఎలాంటి పాత్ర పోషిస్తోంది? భక్తి సాహిత్యం, రాముడు, వ్రజ ఇంకా ఔరంగజేబుకు సంబంధించిన ప్రశ్నలు, వ్రజభూమిలో తులసి, మీరాలకు సంబంధించిన ఆశ్చర్యకరమైన సాహిత్యం, వేణీమాధవ్ గోసాయి చరిత్ర ఇత్యాది వాటి గురించి వాళ్ళదగ్గర అనేక ప్రశ్నలు వున్నాయి. తన విముక్తి కోసం ప్రహ్లాదుడు తండ్రిని త్యాగం చేశాడు, విభీషణుడు తన అన్నగారిని, భరతుడు తన తల్లిని, బలిచక్రవర్తి గురువుని, వ్రజలోని స్త్రీలు తమ భర్తలని.. వాళ్ళ చర్యలు వాళ్లని గొప్ప సంస్కర్తలుగా నిరూపించాయి.

వాళ్లలో ఇంకా ఎన్నో ప్రశ్నలు ఉదయిస్తున్నాయి. వాళ్లని సంతృప్తికరంగా సమాధానపరచడం దరిదాపుగా కష్టసాధ్యం. వాళ్లకి వ్రజలోని భూత, వర్తమానాల చరిత్ర, సంస్కృతుల గురించి విస్తృతంగా తెలియజేయాల్సిందే.

"ధార్మిక చింతన గల వేశ్యలు రెండు వందల సంవత్సరాల క్రితం వ్రజభూమిలో కట్టిన మందిరాలు, మఠాల గురించి ఎలాంటి వివరాలున్నాయి?" వాళ్లు గతంలో ఉపేక్షకు గురైన వాటిని సురక్షితంగా ఉంచాలనుకుంటున్నారు. దాంతో వాళ్లు అంతులేని ప్రశ్నలు వేశారు. తర్వాత వాళ్లు రాకేష్ నుంచి శలవు తీసుకుని పీపా వంతెన వైపు వెళ్లారు. వాళ్లలో చాలామం

## కొత్తగాలి...



**ఆచారం**
**అక్కడక్కడ!**
**అత్యాచారం**
**ఎక్కడబడితే అక్కడ!!**

*– గుడిమెట్ల గోపాలకృష్ణ,*
*అరసవల్లి*

ది కాళ్లకి చెప్పులు లేవు. పొడవాటి జుట్టు పసుపు వర్ణంలో వుంది. బట్టలతో వున్న సంచులు భుజాలపైన కుక్కగొడుగుల్లా వేలాడుతున్నాయి. వాళ్లు పస్తులున్నట్లుగా కనిపిస్తున్నారు.

వాళ్లు వెళ్లగానే సౌదామిని రాకేష్ దగ్గరకి వెళ్లి నిలబడింది. "ప్రియా! స్వాగతం! దూరంగా వున్న కదంబ వృక్షం కింద నువ్వు కూర్చుని వుండడం చూశాను. నువ్వు కూర్చున్నచోట ఇంతకు ముందే ఒక నెమలి పురి విప్పి నాట్యం చేసింది" అన్నాడు రాకేష్. కొంత విరామం తర్వాత "నువ్వు మెడలో మల్లెమాల ధరించి దేవాలయాలకి వెళ్తున్నప్పుడు అతి పవిత్రంగా కనిపిస్తావు" అన్నాడు రాకేష్.

సౌదామిని సిగ్గుతో "కృతజ్ఞురాలిని. ఓ కళాకారుడి ద్వారా ఇలాంటి ప్రశంస లభించడం అరుదైన విషయమే" అంది.

రాకేష్ తన పొడవాటి వెంట్రుకల కుచ్చును సరిచేసుకున్నాడు. ఆ తర్వాత తన సహాయకురాలైన రాధేశ్యామీని రెండు కప్పుల టీ తెమ్మన్నాడు.

ఓ వృద్ధరాధేశ్యామీ పై అంతస్తు నుంచి కిందకి చూసింది. సౌదామిని ఇంతకు క్రితం రాకేష్‌ని కలిసినప్పుడు కూడా ఆ మహిళ ఆ కళాకారుడి బాగోగులు చూడ్డం గమనించింది.

ఉదయం నుంచి ఏమీ తీసుకోకపోవడంతో సౌదామిని టీని అంగీకరించింది.

రాకేష్ ఓ కొత్త చిత్రాన్ని చిత్రీకరించడానికి కావల్సిన సామగ్రిని ఏర్పాటు చేసుకోవడంలో నిమగ్నమయ్యాడు. వాటిని ఏర్పాటు చేస్తుండగా సౌదామినితో "నువ్వు వ్రజభూమిలో ఎన్నిరోజులు వుందామనుకుంటున్నావు? " అని అడిగాడు.

సౌదామిని వద్ద ఎలాంటి సమాధానమూ లేదు. ఏమని చెప్తుంది. ఆమె ముందు ఎలాంటి లక్ష్యమూ లేదు. ఆమె డోలాయమానంలో పడింది. ఏ సమాధానం చెప్పాలన్నా కష్టమే.

ఆ కళాకారుడు సౌదామిని ముఖకవళికల్ని ఆలోచనాత్మకంగా పరిశీలించే ప్రయత్నం చేశాడు. ఆ తర్వాత కొంతసేపు మౌనం వహించాడు. నిజాల్ని దాయడంలో భాగంగా ఇద్దరూ ఒకరినొకరు అర్థం చేసుకునే ప్రయత్నం చేస్తున్నట్టుగా ఉంది ఆ మౌనం.

"నువ్వు చదువు సంధ్యలున్న దానివి. నువ్వు కావాలనుకుంటే షాహ్‌జీ స్కూలులో ఉపాధ్యాయ ఉద్యోగం కోసం ప్రయత్నించవచ్చు, ఒకవేళ నువ్వు ఈ వ్రజభూమిలో శాశ్వతంగా ఉండదలచుకుంటేనే.. "

ఈసారి కూడా సౌదామిని సమాధానం చెప్పలేదు. ఇంతలో రాధేశ్యామీ టీ తీసుకు వచ్చింది. అష్టధాతు శిక్షణార్థి కూడా రాధమూర్తిని చెక్కే పనిని ఆపి సౌదామిని దగ్గరకి వచ్చాడు.

"మొత్తానికి ఈ రోజుల్లో కూడా రెండు పూటలా తిండి దొరుకుతోంది నీకు" అంది సౌదామిని అకస్మాత్తుగా.

"నీకు తెలుసు ప్రతియుగంలోనూ కళాకారుడు దుఃఖితుడే. పదోశతాబ్దిలో కళాకారులు దుర్భర దారిద్ర్యాన్ని అనుభవించారు. చాలామంది బిచ్చగాళ్లుగా మారారు. ఇప్పటికీ సగటు కళాకారుడి దశ అలాగే వుంది. ఈ రోజుల్లో నీకు మెహమూద్ లాంటి పోషకులు దొరకరు. అతను పోషకుడన్న విషయం నీకు తెలుసా? రాజ్‌పుట్ చిత్రకళాశాల పెయింటింగ్‌లో భిన్నమైంది. ఈ రోజుల్లో ఆ కళపట్ల ఎవరికీ ఆసక్తి లేదు. అప్పుడప్పుడు యాత్రికులు అక్కడికి వస్తుంటారు. కానీ వాళ్లు సంఖ్యాపరంగా చాలా తక్కువ. ఉదాహరణకి ఆ రోజు ఓ మహిళ వచ్చింది. మహారాష్ట్రలోని 'రావ్' పరివార సంబంధిత మహిళగా పరిచయం చేసుకుందామె. ఈ ప్రాంతాన్ని చూసేందుకు ఆమె ఓ వాహనం అద్దెకు తీసుకుంది.

ఆమె పూర్వీకులు నాకు తెలుసు. వ్రజభూమిలో 'కదంబఖండీ' పేరుగల తోట వుండేది వాళ్లకి. ఇప్పుడు వాటి ఆన వాళ్లు కూడా లేవు. ఆ మహిళ మొఘలు శైలితో వున్న చిత్రాలని కోరుకుంది. కేవలం రెండే రెండు మొఘలుశైలి చిత్రాలు" అంటూ దీర్ఘంగా చెప్పి ఆ కళా కారుడు పకపకా నవ్వసాగాడు.

శిక్షణ పొందుతున్న అతని సహాయ కుడు బిత్తరపోతూ "చూడబోతే నువ్వు ఈ రోజు అత్యంత భావోద్వేగస్థితిలో వున్నట్టు న్నావు" అన్నాడు వ్యంగ్యంగా.

"ఓహ్, అవును.. నిజమే. నా మనస్థితి భావ గర్భితమైపోయింది. ఆ మహిళ

## కొత్తగాలి...

**ఎవరైనా సరే!**
**ప్రేమ ఇస్తేనే**
**ప్రేమిస్తారు సుమా!**

– నమ్మి కనకసాయి.నాగ్,
పెనుగొండ, ప.గో.జిల్లా

మాటలు గుర్తుకొస్తే ఎంతో సంతోషంగా ఉంటోంది. నా గురించి, నా కళ గురించి అన్నీ తెలుసునని ఆమె అంది. నేను మొఘలు శైలి చిత్రకళలో జీవించి వున్న చివరి చిత్రకారుడినని ఆమె అంది.. కానీ ఆమెకి ఆచార్య ఈశ్వరీప్రసాద్ గురించి ఏమీ తెలియదు. చాలా విచారకరం. ఆ మధ్యన ఓ కళాకారుడు ఇక్కడికి వచ్చాడు. వ్రజభూమి నడిబొడ్డున ఆయన ఈ విధంగా ప్రకటించాడు - 'ఒకవేళ మీరు మొఘలు శైలి చిత్రకారుల అంతిమ ప్రతి నిధిని చూడదలచుకుంటే కాశీలోని చీక టిగా వుండే ఓ ఇరుకు సందులోకి వెళ్లి చూడండి. అక్కడ మీరు కేవలం చర్మంతో కప్పబడిన, ఎముకలతో కూడిన ఓ దుర్బ ల వ్యక్తిని చూడవచ్చు. వృద్ధుడైన అతను దారికిరువైపులా కన్పించే వేటినీ లక్ష్యపెట్ట కుండా నడుస్తుంటాడు. శిరోజాలు జడలు కట్టి మట్టికొట్టుకొని ఉంటాయి. గడ్డం పెరిగి వుంటుంది. అతను తన కళ్లని, నోటిని అతికష్టం మీద శుభ్రపరుచుకుం టాడు. ముక్కు కారుతూ వుంటుంది. శరీ రంపైన మాసిన ధోవతి ముక్క ఒకటి వుంటుంది. అప్పుడప్పుడు కాన్వాస్ షూస్ ధరిస్తాడు. కానీ తరచుగా చెప్పులు లేకుం డానే నడుస్తాడు. క్షణంలో అతడ్ని గుర్తు పట్టవచ్చు. అతని తలపైన గాంధీటోపీ వుంటుంది. భుజాలమీద పరిశుభ్రమైన శాలువ వుంటుంది. అతను చిత్రించిన ఉమర్ ఖయ్యాం చిత్రం యూరోప్‌లోని కళాకారుల్ని సైతం చకితుల్ని చేసింది. ఎంతో ప్రావీణ్యమున్న ఆ మహాకళాకా రుడు ఇప్పుడు చివరి రోజుల్లో దుర్భర దారిద్ర్యం తో కునారిల్లుతున్నాడు, ఓ బిచ్చ గాడిలా'

"ఇక్కడ విప్లవం రావాల్సిన ఆవశ్యకత ఎంతైనా ఉంది" అన్నారు విదేశీ యాత్రి కులు. "మేం మార్పు ఆశిస్తున్నాం. మీరంతా తిరుగుబాటు ఎందుకు చేయ రు? " అంటూ ద్వారకాధీశుని మందిరం వద్ద గుమిగూడిన జనాలని అడిగారు. క్షు ద్బాధతో వున్నవాళ్లని, రోగగ్రస్తమైయున్న వాళ్లని, బాంకేబిహారీ, భగవాన్ గోవింద్, భగవాన్ రంగనాథ్, షాహ్‌జీ.. ఇతర ప్రాంతాలలో గుమికూడి కనిపించే జనా లని, విశేషించి అష్టధాతు శిల్పి, ఇంకా చిత్ర కారుడు చంద్రభాను - వీళ్లందరినీ చూసి విదేశీయాత్రికులు విభ్రాంతికి గురయ్యారు. వాళ్ల పెదాలపైన ఒకే ఒక ప్రశ్న చోటుచేసుకుంది, 'మీరంతా ఇలా ఎందుకు వదిలేస్తారు - ఈ దుఃఖం, ఈ వంచన హేయమైనవి. మీరంతా తిరగబడరు ఎందుకని? ' పద్దెనిమిదో శతాబ్ది మధ్యలో

కూడా ఇలాంటి పరిస్థితే ఉత్పన్నమయింది. ఎప్పుడో రాజుల కనికరంతో సంరక్షించబడిన కళాకారులు రాజసభలోని స్నేహపూర్వక వాతావరణాన్ని వదిలి తమ జీవిక కోసం యాచించే పరిస్థితులు కల్పించబడ్డాయి.. అది కూడా దూరప్రాంతాలైన కాంగ్రా, చంబా, నూర్‌పుర్, గ్వాలియర్ ఇంకా ఇక్కడి ప్రజలోని గుప్త ఏకాంత మారుమూల ప్రాంతాలలో.

"విదేశీయులు తిరుగుబాటు అనివార్యమంటూ హెచ్చరిస్తున్నారు. మీరు ఒక విషయం గ్రహించారా? ఈ తరం యువతీ యువకుల్ని మీరు గమనించారా? వాళ్లు మధుర, ఉత్తరకాశీ, కటక్, భువనేశ్వర్, ఇంకా, ఆగ్రాలో పుట్టిపెరిగిన వాళ్లు, వాళ్లంతా మందకొడిగా కనబడతారు. మొహాలు చైతన్యరహితంగా, భావవిహీనంగా వుంటాయి. ఇంకా చెప్పాలంటే వాళ్లు కోపం అన్నది ఎరుగరు. దేనికీ వాళ్లు ఉద్రేకపడరు. అలాంటప్పుడు విప్లవం వస్తుందని ఎలా అనుకోగలం. వాస్తవానికి నేను ఈ విదేశీ యాత్రికుల్ని ప్రశంసిస్తాను. ఎందుకంటే నాలుగు రోజులుగా వీళ్లు మందిరంలో బహిరంగ ఆవరణలో గడిపారు. ప్రసాదాల కోసం బిచ్చగాళ్లు ఫకీర్లతోబాటు వరుసలో కూర్చున్నారు. కాళ్లకి చెప్పులు లేకుండా నడిచారు. వాళ్ల దుస్తులు చింపిరిగుడ్డలుగా మారాయి. వాళ్లు ఎప్పటికీ ఆకలితోనే వుంటారు. మీరు వాళ్ల కళ్లవైపు చూశారా? అంతటి ఉత్కంఠ, ఉత్సాహం మన విద్యార్థుల్లో మీరు ఏ కొద్దిమందిలో మాత్రమే చూడగలరు. ఒకవేళ మీకు విశ్వాసం కలగకపోతే మధురలోని ద్వారకాధీశుడి మందిరం ముందు కొద్దిసేపు వుండి అక్కడ సందుల్లో తిరిగే యువతీ యువకుల్ని పరీక్షించండి. సోమరితనంతో గోచరిస్తారు. రంగు కూడా ఏమంత బాగుండదు. వాళ్ల చర్మం కూడా ఖర్జూర చెట్టు ఎండుటాకులా నిస్తేజమై వుంటుంది. వీళ్లా విప్లవానికి నాంది పలికేది? వీళ్లలో ధైర్యమనేది అసలు లేనే లేదు. గత సంవత్సరం బతుకుతెరువు వెతుక్కునేందుకు తంజావూర్ నుంచి భువనేశ్వర్‌కి వచ్చిన వందలాది మంది యువతీ యువకుల్ని కలిశాను. వాళ్ల కళ్లలోకి చూ శాను. శూన్యం తప్ప మరేదీ లేదు. వాళ్లం తా నావైపు నీరస దృష్టి ప్రసరింపజేశారు.

వాళ్లలో ఒక ఆలోచన గానీ, విధానం గానీ ఏవీ కనబడలేదు. వాళ్లందరిలోనూ సృజనాత్మకత లోపించిందని ఒక అపవాదు వుంది. అక్కడ నేను ఇద్దరు వ్యక్తుల్ని కలిశాను. వాళ్ళ కళ్లలో అపవాదాత్మక దృష్టి సజీవంగా వుంది. కానీ వాళ్ళిద్దరూ నిరుద్యోగులు. నిరాశతో ఏదో ఉద్యోగం వెతికే పనిలో నిర్లక్ష్యంగా తిరిగే వాళ్లు. ఆకలితో వాళ్ల పేగులు దహించుకుపోయేవి. ఇలాంటి యువకులలో ఉత్సుకత ఏం లాభం? ఇది కేవలం వ్యర్థమైన ఆభరణాల అలంకారమే, కోతి మెడలో బంగారు హారంలా"

చంద్రభాను ఈ అభిప్రాయాలను భావావేశంతో వ్యక్త పరచడంతో ఒకింత అలసటకు గురయ్యాడు. చివరాఖరికి అతను పెద్దగా నవ్వసాగాడు. అష్టధాతు శిక్షణ పొందుతున్న వ్యక్తి నగిషీ పడుతున్న రాధ విగ్రహం చంద్రభాను వికటాట్టహాసానికి అదిరినట్లనిపించింది.

పీపా వంతెన స్తంభం ఉదయ సూర్యకిరణాలు పడి యమున ఇసుకతో మెరుస్తున్న ఫిరంగిలా వుంది. శిక్షణ పొందుతున్న అష్టధాతు శిల్పి తన యజమాని చంద్రభాను వంక చూస్తూ "చాలాకాలం తర్వాత మీరు ఉపశమనంతో కనిపిస్తున్నారు. కానీ ఆ మహిళ మిమ్మల్ని ఏదో అడగాలనుకుంటున్నట్టుంది. ఆమెకి కొద్దిపాటి అవకాశం కూడా ఇచ్చినట్టులేదు. మీ ఆలోచనల్లో మీరు మునిగిపోయారు"

అన్నాడు ఏదో సూచిస్తున్నట్టుగా.

చంద్రభాను సౌదామినితో "అది సరే, పొద్దున్న నిన్ను కదంబ వృక్షం కింద చూసినపుడు నన్ను ఏదో అడగాలనుకుంటున్నట్టు నాకనిపించింది" అన్నాడు.

శిక్షణ పొందుతున్న వ్యక్తి ఈ మధ్యలో తన సామాను, పరికరాలు సర్దుకుని వాటిని ఒక సంచిలో పెట్టి వెళ్ళిపోయాడు. వృద్ధరాదేశ్యామీ కూడా వచ్చి టీ కప్పులు తీసుకువెళ్లింది.

"మీ తండ్రి ప్రజలో అందరి హృదయాల్ని ఆకట్టుకున్నారని అంటుంటారు. నువ్వు తలచుకుంటే ఏదో ఒకరోజు ఆయన స్థానాన్ని పొందవచ్చు. నువ్వు దీన్ని గురించి ఎప్పుడైనా ఆలోచించావా? ఈ సంక్రమణ సమయంలో ప్రజలో మీ తండ్రి లాంటి వ్యక్తుల ఆవశ్యకత ఎంతైనా వుంది. చిన్నాచితకా ఆలోచనల్ని కట్టిపెట్టి మీ తండ్రి ఆసుపత్రి బాధ్యతల్ని స్వీకరించేందుకు సిద్ధపడు. ఉదారస్వభావం కలిగి వుండు" అన్నాడు చంద్రభాను.

చంద్రభాను ఇలాంటి సలహా ఇస్తాడని ఎన్నడూ ఊహించలేదు సౌదామిని. ఆమె మొహం వివర్ణమైంది. ఆమెలో నిరాశ చోటుచేసుకుంది. "ఒకవేళ అంతటి గొప్పతనం నేను ఆర్జించివుంటే అది ఓ గొప్ప అదృష్టంగా భావించుకునేదాన్ని. ఎందుకంటే అలాంటి పరిస్థితుల్లో ఈ కష్టాలు, అవమానాలు, మానసిక వ్యాకులత నా హృదయపు లోతుల్ని స్పృశించేవి కావు. నన్ను నమ్ము. ఇప్పటికీ నేను కేవలం రక్తమాంసాలతో వున్న స్త్రీనే. అయినాకూడా సాంసారిక ఆవేశకావేషాలు, కోరికలతో దూసరితమైపోయాను. నా వ్యవహారాల్లో పరివర్తన అనేది సుదూర తీరంలో కూడా కనబడ్డం లేదు. గొప్ప గొప్ప పనులు చేసే ఆత్మవిశ్వాసం నాలో ఉందో? లేదో? చిన్నతనం నుంచే ఓ విధమైన వ్యాకులత నన్ను వెంటాడుతోంది. అది నా అస్తిత్వంలోని అభిన్నమైన శ్వాసలా, నా కోరికలలో, భయాలలో, సుఖఃదుఖాలలో భాగమైపోయింది. కేవలం ఒక సంవత్సరంలో కొన్ని రోజులు మాత్రమే నేను వీటి నుంచి విశ్రాంతి పొందాను. ఆ సంవత్సరం నా హృదయాంతరాల్లో ఇప్పటికీ దేదీప్యమానంగా ప్రకాశిస్తూనే ఉంది. కేవలం ఆ సంవత్సరం మధ్యలో నా ఆత్మ స్వయానా నా గురువు, యాజమాని. ఈరోజు నేను మందిరాల చుట్టూ తిరుగుతున్నానంటే కేవలం అమూల్యమైన అలాంటి కొద్ది రోజులు తిరిగి పొందడానికే. కానీ రోజులు గడిచిపోతున్నాయి. నా శరీరం శుష్కించిపోతోంది, రంగు వెలసిన పాత వస్త్రంలా" అంది సౌదామిని.

కొన్నిక్షణాల తర్వాత సంభాషణ కొనసాగిస్తూ సౌదామిని "ఒకానొక సమయంలో నేను ఒక ప్రాంతంనుంచి మరో ప్రాంతానికి వెళ్లేందుకు ఇష్టపడేదాన్ని. నేను ఎన్నోయుగాల్ని దాటినట్లు, ఓ అపరిచితమైన ప్రదేశానికి చేరుకున్నట్టు నాకనిపిస్తుంది. ఇప్పుడు అంతా మారిపోయింది. ఇక్కడ ఇప్పుడు భావుకతతో కూడిన శ్రుతి గల తీగ నా హృదయంలో లేదు. తల ఎత్తి పైన ఉన్న ఆకాశాన్ని కూడా చూసే ధైర్యం ఒకప్పుడు నేను చేయలేకపోయేదానిని. ఇంతగా భయపడే పరిస్థితి మరెవరికైనా, ఎప్పుడైనా కలిగిందా? మహాశయా! మీరు కళాకారులు. భగవంతుణ్ణి అర్థం చేసుకోగల యోగ్యత గలవారు. మీరు నా స్థితిని తప్పక ప్రశంసిస్తారు. ఉత్సాహపు అలలు, కోరికలు ఇప్పటికీ నా మెదడుని అల్లకల్లోల పరుస్తున్నాయి. అవి ఏమాత్రం తగ్గుముఖం పట్టలేదు. కొన్నిరోజుల క్రితం రోడ్డు మలుపులో వున్న చెట్టుకింద ఆరోగ్యంగానూ, యౌవనంలోనూ వున్న ఓ యువజంట విశ్రమించటం చూశాను. నా కోసం అతను యౌవనపు సుగంధంతో పాటు

కోరికలతో నిండిన జీవన పరిమళాన్ని వ్యాపింపజేశాడు. యమున నీటిలోంచి కూడా అరుదైన సువాసన వెలువడుతున్నట్లుగా అనిపించింది. కసాయి అంగడిలోని తాజా మాంసం వాసన కాదు - లేదు, అలా లేదు. తన ఊపిరితో తన్ను తాను కాపాడుకునే స్థితి కలిగిన ఆ మధుర ఇంద్రియగ్రస్త సుఖంతో నిండిన పరిమళం నది దగ్గర ప్రసరిస్తోంది. ఆనందంగా వున్న ఆ జంట ఆ చెట్టు నీడలో కరిగిపోతూవుంది. ఇది నన్ను పూర్తిగా ఉద్రేకపరిచిన సంఘటన. నా మీద నేను పూర్తిగా నియంత్రణ కోల్పోయాను. ఇసుకలో పిచ్చిగా పొర్లాడాను. దుస్తులు అస్తవ్యస్తమైపోయాయి. ఇసుక రేణువులు నా శరీరాన్ని గుచ్చుతున్న అనుభూతి కలిగింది. నా స్థితిని మీరు ప్రశంసిస్తారనీ విశ్వాసం నాకుంది. ఈ ఉద్విగ్నభరిత సమయంలో కూడా నా మదిలో అనంతమైన ఊహలు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి- అవి బంగారు చట్రంలో బంధించడానికి యోగ్యమైనవి"

ఈ విధంగా తన ఆలోచనలని వ్యక్తపరచిన సౌదామిని అలసిపోయింది. ఆమె కళాకారుడి కళ్లలోకి చూసింది. గాలికి చలిస్తున్న ఆమె చిగురు పెదాలు, నయనాలు వర్షించబోతున్న సంకేతాన్నిస్తున్నాయి.

"ఆ ఈసాయీ యువకుడు నీకు ఎంతో కొంత సాంత్వన చేకూర్చి వుండొచ్చు" అన్నాడు రాకేష్.

ఈ మాటలు సౌదామినిని మరింత దుఃఖపడేలా చేశాయి. తనను తాను నియంత్రించుకుంటూ "అవును, నిజమే మీ అనుభవం ప్రకారం మీరు ఊహించింది నిజమే. నాకెందుకోగానీ ఒక విధమైన ఓదార్పు లభించినట్లయింది. అలా ఆశతో కూడిన ఓదార్పు ఇవ్వగలవారు అతను తప్ప ఈ ప్రపంచంలో వేరెవ్వరూ లేరు. నేను మందిరాల చుట్టూ తిరిగితే లభించే ఉపశమనం అతని పక్కన ఒకసారి నిలబడితే లభించినట్లనిపిస్తుంది. లేదు, బహుశా తప్పు చేస్తున్నానేమో. విషయం అంత స్పష్టంగా లేదు. ఏ ఉపశమనమైతే అతను నాకు కలగజేశాడో, బహుశా అది గూఢమైంది. అతను నా మార్గాన్ని ప్రకాశవంతం, ప్రభావితం చేసే క్రమంలో అంధకారమయం చేశాడేమోనని ఒక్కోసారి నాకనిపిస్తూంటుంది. మీరు కళాకారులు. దయచేసి చెప్పండి. నాలాంటి మరే ఇతర జీవి అయినా ఇంతగా అనుభవించిందా? ఎప్పుడైనా నాలాంటి స్త్రీ ఎవరైనా ఈ పవిత్ర వ్రజభూమిలో అడుగుపెట్టిందా?" అంది సౌదామిని.

కళాకారుడు చంద్రభాను తలవంచుకున్నాడు. క్షణాలు గడుస్తున్నాయి. ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు. తర్వాత ఆ కళాకారుడు ఆ యువతితో "కాల గమనం

## వేటూరి చతురోక్తులు



వేటూరి సుందరరామ్మూర్తిగారు సుప్రసిద్ధ సినీ గేయరచయిత. తెలుగు పాటకు జాతీయ ఖ్యాతిని ఇనుమడింపజేసిన ఈయన కలం నుంచి కొన్ని వేల పాటలు జాలువారాయి.

ఆయన వివిధ సందర్భాలలో విసిరిన చతురోక్తులు కొన్ని..

### ఏం తొందరొచ్చిందని?

అతి స్వల్పకాలంలోనే సినీరంగంలో ఉన్నత స్థానానికి చేరటమే కాక అత్యంత వేగంగా ఏ పాటనైనా రాస్తారని ప్రసిద్ధిపొందిన వేటూరిని ఉద్దేశించి ఆత్రేయగారు ఒక సందర్భంలో 'ఏం తొందరొచ్చిందని ఎడాపెడా రాసేస్తున్నావ్?' అని ప్రశ్నించారు.

'మీ అంత బాగా ఎటూ రాయలేను, తొందరగానైనా రాయకపోతే ఎలా?' అన్నారు వేటూరి చమత్కారంగా.

లో నీకు నువ్వే శత్రువువి, నీకు నువ్వే మిత్రుడివి కూడా. ఈ జీవనయాత్రలో నీకు నువ్వే సహచరివి కూడా. నా ఉద్దేశాన్ని అర్థం చేసుకున్నావనుకుంటాను" అన్నాడు.

కళాకారుడు మరోసారి తలవంచుకుని మౌనంగా ఉండిపోయాడు. ఈ మధ్యలో సూర్యుడు ప్రచండంగా మారసాగాడు. పీపా వంతెన స్తంభం ఆ ఎండలో అడవి దున్న శరీరంలా మెరుస్తోంది. ఆ కళాకారుడి సమయం అధికంగా తీసుకుంటున్నట్లు అనిపించింది సౌదామినికి. వెళ్ళిపోయేందుకు లేచి నిలబడింది. ఆఖరిగా ఆమె అతనితో "ఒకవేళ నాలాంటి మహిళ వ్రజభూమిలో ఎప్పుడైనా కనిపిస్తే నాకు

**కొత్తగాలి...**

**హుద్‌హుద్ దెబ్బకు**
**విశాఖ విలవిల**
**తలో సాయం అందిస్తే**
**జీవితాలు కళకళ**

– విక్కునూరి రాజేశ్వర్,
పాన్కల్

తెలపడానికి వెనుకాడకండి. నేనా మెను కొన్ని ప్రశ్నలడుగుతాను. నా మీద విశ్వాసముంచండి. నేను కొన్ని గంభీరమైన విషయాలు ఆ మహిళని అడగాలి" అంటూ ఆమె అక్కణ్ణించి వెళ్ళిపోయింది.. ఇసుకలో తన పాదముద్రల్ని వదులుతూ.

రోజులు గడుస్తున్నకొద్దీ నది ఒడ్డు శబ్దాలతో నిండిపోయింది. నీటి అలల వైభాగంలో నురుగుతోపాటు మల్లెల మాలలు తేలుతున్నాయి.

రాకేష్ గుడిసె ముందు ఓ కదంబ వృక్షం వుంది. దాని చుట్టూ ఒక ఎత్తయిన అరుగు ఉంది. ప్రతిరోజూ ఆ స్థలాన్ని ఊడ్చి శుభ్రం చేసేందుకు ఓ యువతిని చాలాకాలం క్రితమే నియమించారు. ఆమె ఈ పనిని ఎలాంటి ప్రతిఫలమూ ఆశించకుండా చేసేది. మలినంగా, మురికిగా వుండే ఏ సన్యాసిని కూడా బండలు పరచిన ఆ శ్రేష్ఠమైన స్థలాన్ని గానీ, దేవతా మూర్తి వున్న స్థలాన్నిగానీ ఆక్రమించకుండా చూడడం లక్ష్యంగా పెట్టుకుందామె. ఆమె ఎప్పుడూ జాగరూకతతో ఆ స్థలాన్ని కనిపెట్టుకుని వుండేది. ఎందుకంటే మిగిలిన స్థలాన్ని సన్యాసినుల గుంపు కలుషితం చేయకుండా ఉండేందుకు. నివాసానికి సౌకర్యంగా వుండడంతో వాళ్ళు స్థిరంగా వున్న జలాశయాల గోడలని కూడా వదలలేదు.

ఈ రోజు ఆ చెట్ల కింద ఊడ్చి శుభ్రం చేసే స్థలంలో ఆమె నాట్యం చేయడం చూసి రాకేష్ ఆశ్చర్యపోయాడు. ఇంతలో ఓ సంఘటన గుర్తుకు వచ్చింది రాకేష్‌కి. అది జరిగి ఎక్కువ కాలం కాలేదు. ఆ సంఘటనకి రాకేష్ సాక్షీభూతుడయ్యాడు. అతని ముందు నాట్యం చేస్తున్న ఆ యువతి రంగనాథుని మందిరంలోకి ప్రవేశించి మూర్తిని మాలధారణ గావించాలనుకుంది. కానీ ద్వారం వద్ద లాఠీతో సిద్ధంగా వున్న సెంట్రీ తన బలమైన చేతులతో ఆమెని వెళ్ళగొట్టాడు. ఓ అంటరానిది పవిత్ర మందిరంలోకి ప్రవేశించి దాని పవిత్రతని భంగపరచే సాహసం ఎలా చేస్తుంది? గొడవ చెలరేగింది. జనం గుమిగూడారు. ఆ అమాయక యువతిని నెట్టడం, పెనుగులాడ్డంతోపాటు జనాలు ఆమెని వెంబడించారు. ఆమె పైన అభియోగం మోపారు. వెంటబడ్డవాళ్లలోని ఒకడు పొట్టమీద గట్టిగా తన్నడంతో ఆమె ప్రవేశ ద్వారం వద్ద నుంచి రథశాల వరకు దొర్లిపోయింది. కొన్ని యుగాల క్రితం నిమ్న జాతికి చెందిన ప్రజలు తామ్రపర్ణి నది ఒడ్డునుంచి వ్రజలోకి వలసవచ్చారు.

కొన్ని యుగాల క్రితం నాటి మాట

ఇది. అర్జునుడి రథసారథి కృష్ణుని ఆవిర్భావం బృందావనంలోని కృష్ణమురళీధరుని రూపం సంతరించుకున్నప్పటి సంగతి. కృష్ణుడు తన ప్రియురాలు రాధ, గోపికల సమూహంలో దివ్యలీలలతో తేలియాడుతుండగా వ్రజలోని పవిత్రతకి ప్రతిస్పందిస్తూ అక్కడి స్థలంలోని ధూళిని మహిమాన్వితమొనరించినప్పటి మాట ఇది. ఆ విధంగా కొన్ని యుగాల క్రితం ఈ ప్రాంతానికి వలస వచ్చి నివసించిన జాతికి చెందింది ఆ యువతి. వాళ్ళంతా వేరువేరుగా శాశ్వత నివాసాలు ఏర్పాటు చేసుకున్నారు. మలినమైన ముళ్ళపొదల గుబురుతో కూడిన అడవి వైశాల్యం పెరిగే కొద్దీ వాళ్లు ఎన్నోరెట్లు అధికం కాసాగారు. సమయం గడుస్తున్నకొద్దీ వాళ్ళు ఎన్నో వర్గాలుగా చీలిపోయారు.

ఆ యువతి నృత్యాభినయం తీవ్రమైంది. నృత్యావేశంలో ఆమె సిగ విడిపోయింది. దుస్తులు అస్తవ్యస్తమయ్యాయి. పైట కిందికి జారింది. అయినా ఆమె ఆగకుండా నాట్యం చేస్తూనే వుంది, వివిధ భంగిమల్లో, పిరుదులపై కూర్చుని, తల కిందికి వంచి, వృత్తంలో తిరుగుతూ మధ్య మధ్యన నడుమును వంచుతూ మొత్తం నూట ఎనిమిది ముద్రల్ని అభినయించిందామె. బహుశా ఆమె పూర్వీకులు వ్రజలో కాత్యాయనీ పూజారులు అయ్యివుండవచ్చు. తర్వాత అత్యధిక భావావేశం కారణంగా ఆమె రాకేష్ ఇంట్లోని రాధేశ్యామీని మంచినీళ్ళు ఇమ్మని వేడుకుంది. ఆ యువతి పట్ల ఏమాత్రం కనికరం చూపకుండా ఆ రాధేశ్యామీ కటువుగా తిరస్కరించి ఆగ్రహిస్తూ "నువ్వు ఓ వేశ్యలా ప్రవర్తిస్తున్నావు. ముందు పైట సరిచేసుకో. అక్బరు చక్రవర్తి కాలంలో నీలాంటి కాముక స్త్రీలని బెల్గాం సిపాయిల మధ్యన విసిరేసేవాళ్లు" అంది. ఆ మహిళకి జరుగుతున్న పరాభవాన్ని కళాకారుడు రాకేష్ సహించలేకపోయాడు.

"చాలు, చాలు, చాలా అన్నావు. ఇక నోటిని అదుపులో ఉంచుకో. ఆ యువతి తాగడానికి నీళ్లు ఇవ్వు. ఆమెని ప్రశాంతంగా వెళ్లనివ్వు" అన్నాడు రాకేష్.

బాధతో ఉన్న ఆ నిస్సహాయ యువతి తన దుస్తుల్ని సరిచేసుకుంది. చీర చెరగులో దాగే ప్రయత్నం చేసింది. ఇప్పటికి ఆమె తన మీద తను నియంత్రణ పొందింది. కొన్ని క్షణాల క్రితం తనకి ఏమయ్యిందోనని ఆశ్చర్యపడసాగిందామె. తను ఎక్కడ ఉంది. ఏం చేసింది. తనపైన మీరా ప్రభావంతో పాటు మూర్ఛ జబ్బు ప్రభావమూ ఉందా, ప్రకృతి పురుషుడు కేవలం కృష్ణుడే. అదే వ్రజభూమిలోని ప్రత్యేకత.

"ఇదిగో, మంచినీళ్లు తాగు" అన్నాడు చంద్రభాను రాకేష్, ఆశ్చర్యం నిండిన ఆ యువతితో.

"నన్ను నమ్మండి భక్తిప్రపత్తుల పారవశ్యం వల్ల కల్లోలమై నన్ను నేను మర్చిపోయాను. నేను చేతనావస్థలో లేకపోవడంవల్ల మీ సమక్షంలో అర్ధనగ్నంగా నర్తించాను. నన్ను క్షమించాలని కోరుతున్నాను" అంది గద్గద స్వరంతో.

"నువ్వు వివాహితురాలివా? "

"వితంతువుని"

"పునర్వివాహం గురించిన ఆలోచన లేదా? రుగ్వేదంలో చెప్పినట్లు- నీలాంటి స్థితిలో ఉన్న స్త్రీని విశ్వబసు అనే పేరుగల దేవుడు తన అధీనంలో ఉంచుకుంటాడు. ఆ దేవుణ్ణి ప్రశంసిస్తూ ఒక రుక్కు (ప్రార్థనా శ్లోకం) ఈ విధంగా ఉంది- ఏ స్త్రీలయితే కన్యత్వం వరకు చేరుకోలేదో, ఏ స్త్రీలయితే తమ తల్లిదండ్రుల నీడలో ఉంటారో వాళ్ల కోరిక తీర్చు ప్రభూ- వాళ్లని నీ సొంతం చేసుకో- వాళ్లలో గొప్పదనాన్ని, సౌభాగ్యాన్ని నువ్వు పొందగలవు అని సరే అప్రమత్తంగా వుండు, నీళ్లు తాగు"



అన్నాడు రాకేష్.

"దయాకరా! మీరు ఎత్తిపోయలేరా? నేను ముట్టుకోకూడదు. నేను అంటరాని దాన్నని మీకు చెప్పాను"

"ఇటువంటి మూఢ సంప్రదాయాలు నేను విశ్వసించను. కళాకారులు కులమతాలకతీతంగా ఉంటారన్న విషయం ఈ ప్రజలోని వారందరికీ తెలుసు"

"నన్ను క్షమించు. మీపాత్రని తాకలేను" అంటూ కూర్చున్న ఆ యువతి లేచి నిలబడి తిన్నగా చెరువువైపు కదిలింది.

రాకేష్ ఆమెని ఆపుతూ "దోసిలిపట్టి నీళ్లు తాగు" అన్నాడు.

ప్రజలు ఈనాటికీ అస్పృశ్యతతో పీడింపబడుతున్నారు. అందువల్లే రామానంద్, జయ్‌షీ, కబీరులాంటి మహాపురుషులకి శాంతి అన్నది గోచరించలేదు. కళాకారుడి హృదయం ఆ యువతి పట్ల సానుభూతితోనూ, దుఃఖంతోనూ నిండిపోయింది.

గొంతు తడుపుకుని కొంగుతో మూతి తుడుచుకుంటూ "మీవల్ల ప్రభావితమయ్యాను. నిజంగా మీరు విశాలహృద



యులు. ఈ వ్రజలో మీలాంటి వాళ్లు చాలా తక్కువ" అందా యువతి.

"నువ్వు రంగనాథస్వామి మందిరంలో నాట్యం చేసిన ఇదివరకటి యువతుల పంథానే ఎంచుకున్నట్లు నాకనిపిస్తోంది. నువ్వు నింజగా ఖడ్గాన్ని, ఈశ్వరుడ్ని ఆలింగనం చేసుకోవాలనుకుంటున్నట్లు నాకనిపిస్తోంది" అన్నాడు రాకేష్.

ఈ భావన ఆ యువతిని సంతోషపరచినట్లుంది. ఆమె పెదాలపైన చిరునవ్వు వెలసింది. ఆమె అంది, "నేను ముద్రలు అభినయించడంలో సిద్ధహస్తురాలిని. ముఖ్యంగా అవి సమస్త దేవతల్ని ప్రసన్నం చేస్తాయి. నా అంతట నేను నాట్యాలు చేసి చేసి ఉన్నదానిని. ఎందుకంటే మందిరంలోకి ప్రవేశించేందుకు, దేవతామూర్తికి మాలాధారణ చేసేందుకు నాకు అధికారం లేదు. వ్రజలోని ప్రభువు అనుగ్రహం పొందాలని గోపకన్నెల్లా కాత్యాయనీదేవీ పూజలో భక్తితో సాష్టాంగపడ్డాను. నా భర్త క్షేమం కోసం అంకితమైపోయిన దాన్ని నేను. నా భర్త మరణించినప్పటి నుంచి వ్రజలోని ప్రభువులో నా భర్తని చూసుకుంటున్నాను. నామీద దయచూపినందుకు ఆ దేవికి నా కృతజ్ఞతలు. వారు ఈ వ్రజ భూమిలో స్థిరంగా ఉంటారు. వారు నన్ను తనదానిగా చేసుకున్నారు. ఆయన పెదాల చిహ్నాలు నా పెదాలపైన మీకు కనబడటంలేదా? "

"తన దానిగా చేసుకున్నాడా, ఆ ప్రభువు? నిన్ను తన దానిగా చేసుకున్నాడా? అంటే నీ ఉద్దేశం? "

కొంతసేపటి క్రితమే మీరు విశ్వబసు అనే పేరుగల దేవుడి గురించి వివరించారు. ఒకరోజు ఓ భక్తుడు గుడిసెలో చెబుతుండగా విన్నాను. అక్కడ హరిజనులు ఉంటారు. 'అతిల్ల' కొండ శిఖరం పైన స్థావరం ఏర్పరచుకుని ఆ పేద వ్యక్తి జీవిక కోసం పురాణగాథలు పఠించేవాడు. ప్రేమ అనేది ఆలోచనలకి, భావనలకి సంబంధించిందన్న అభిప్రాయాన్ని వ్యక్తపరిచాడు అతను. అది ఆనందాన్ని మించినది అని కూడా అన్నాడతను. వేదాలు, ఉపనిషత్తుల పాఠాలు తన ఆలోచనల్ని పరిపూర్ణం కావించాయన్నాడు ఆయన. నా

భర్త నన్ను తనదానిగా చేసుకున్నట్లుగానే గోకులంలోని ప్రభువు నన్ను తనదిగా చేసుకున్నాడు. అలసి వున్న నా అస్తిత్వంలో ఒక అర్థాన్ని నింపిన ప్రభువు ఆయన. ఒకవేళ ఆవిధంగా జరగకపోయి ఉంటే గనక నా జీవన్మరణాల మధ్య భేదం ఏముంటుంది గనక? "

ఆ యువతి తన ఆలోచనలని వ్యక్తపరుస్తుండగా ఆమె కళ్లు చెమర్చాయి. సరిగ్గా అప్పుడే ఆ యువతి పెదాల చివర చిరునవ్వు విరిసింది. ఆ తర్వాత కళాకారుడి స్పందన కోసం నిరీక్షించకుండా ఆ యువతి అకస్మాత్తుగా తన వస్తువులన్నింటినీ తీసుకుని మందిరాన్ని ఆనుకుని ఉన్న చీకటి సందులోకి పరుగెత్తింది.

ఎండ తీవ్రత అధికమవుతోంది. ఒడ్డుపైన ఇసుకలో పెద్దపెద్ద తాబేళ్లు పాకుతున్నాయి. ఒడ్డుకి ఆవలివైపు విదేశీ యాత్రికులు తిరుగుతున్నారు. ఇంతలో ఎవరో రాకేష్ చెవిలో "ఇప్పుడు సమయం ఆసన్నమయింది. ఈ మానవ జీవితం అమూల్యమైంది. ఇంకా సమయం ఉంది. ముందుకు నడు! వేగంగా నడు! అమరత్వం పొందు బిడ్డా!" అంటూ గుసగుసగా చెప్పారు.

రాకేష్ ఆలోచనలో పడ్డాడు. కొద్దిసేపటి క్రితం ఇసుకలో అనేక పదచిహ్నాలు చూశాడతను. కానీ వాటిని గాలి విసురు క్షణంలో చెరిపేసింది. ఆ అంటరాని యువతివి, విదేశీ పర్యాటకులవి, రాధ్యేశ్యామీలవి, భక్తుల పదచిహ్నాలు ఇసుక కింద కప్పబడిపోయాయి. ఇసుక పొరల కింద మందంగా మెరుస్తూ గాలిలో ఎగిరే తెల్లటి దుప్పటిలా కనిపిస్తున్నాయవి. రాకేష్ ఓ గాయపడ్డ ప్రాణిలా స్థిరంగా నిలబడిపోయాడు. అతని దృష్టి ఆ పదచిహ్నాల వైపు మళ్లింది. పెద్దలవి, పిన్నలవి బ్రాహ్మణులవి, అస్పృశ్యులవి. వాటినన్నింటినీ ఎండి వ్యాపించి ఉన్న ఇసుక కప్పేసింది. శూన్యమైన ఆలోచనలు రాకేష్‌ని ఆశ్చర్యంలో ముంచెత్తాయి.

★ ★ ★

శ్రీమతి షరాఫీ సేర్ నిరాశాజనక అన్వేషణతో శశి పిచ్చిదానిలా ప్రవర్తించసాగింది. రాధేశ్యామీలు ఆమెను కటువైన మాటలతో తిట్టిపోస్తున్నారు. వాళ్లు ఆమెను 'అడ్డూ అదుపూ లేని మానవ రూపంలో ఉన్న రాబందుల్ని ఆకర్షించే పిశాచివి నువ్వు' అని కూడా అన్నారు. ఇక తాము ఏ మాత్రం రక్షించలేమని వాళ్లు ఆమెని హెచ్చరించారు. ఆమె ధరించిన దుస్తులు కూడా చాలీచాలనివి. అవి చింపిరిగుడ్డలకన్నా ఎక్కువేం కాదు. ఆ రోజు ఏకాదశి, పక్షంలోని పదకొండోరోజు. ఇంతేకాకుండా ఆదివారం కూడా. బజారులోని ప్రత్యేక మందిరాల దగ్గరికి టాంగా వెళ్లడం ఇబ్బందికరంగా మారింది. భక్తులు అమితమైన భక్తితో వ్రజలోని రాధారాణిని ప్రశంసిస్తూ గీతాలు ఆలపించసాగారు. వాతావరణం మొత్తం హర్షోల్లాసాలతో నిండిపోయింది. మోదీ నుంచి హరీబరీ చేరుకునేందుకు శశికి అర్ధగంట పట్టింది. నలువైపులా పరిశుభ్రంగా ఉంది. ఎప్పుడూ చెత్తాచెదారంతో పూడుకుపోయి ఉండే మోరీలు, సైడుకాలువలు ఈ రోజు శుభ్రం చేశారు. ఎప్పటిలా దుర్వాసన లేకపోగా, అందుకు ప్రతిగా మల్లెల, గులాబీల సౌరభాలు గాలిలో తేలుతూ నాసికాపుటాలను తాకుతున్నాయి.

పండాలు గుంపులు గుంపులుగా తిరుగుతున్నారు. వాళ్లంతా భుజాలపైన పరిశుభ్రమైన కండువాలు వేసుకున్నారు. మెడలో మల్లెమాలలు వేలాడుతున్నాయి. శశి 'అతిల్లా' సమాధి వద్దకు చేరుకుంది. అక్కడ గుమికూడిన జనాలు చిరిగిన ధోవతులు, చేతులు లేని పొట్టి అంగీలు ధరించారు. వాళ్ల కండువాలు కూడా పాతబడి మాసివున్నాయి. ఈ పండాలు యాత్రికులతో అతిశయంగా మాట్లాడడం కాని పరి

శుద్ధంగా కనబడిగాని ఆకర్షించరు. సాధారణంగా వాళ్లు రెండుపూటాలా రొట్టె సంపాదించడమెలా అన్న ఆలోచనతోనే ఉంటారు. పేద ధర్మపరాయణులైన ఈ పండాల మధ్య గోపాల్‌జీ ఉపాధ్యాయ్, సేఠ్ బిషన్ సింధు లాంటి శిక్షార్థులు కూడా ఉన్నారు. వీళ్లు శ్రుతి స్మృతిశాస్త్రాధ్యయన రూపంలో తమ పరిశోధన కొనసాగించారు. వీళ్లు అదే వృత్తిలో ఉన్న తమ స్నేహితులు అనేకమందికి భిన్నంగా కనబడతారు. ఎందుకంటే యాత్రికుల డబ్బుని అనుచితంగా స్వీకరించడం పాపమంటారు వీళ్లు. అలాంటి వ్యక్తులు ఇప్పుడు చాలా అరుదు. అంతేకాదు, 'అతిల్లా' చుట్టుపక్కల అలాంటివాళ్లు కనబడరు. కానీ అలాంటి వ్యక్తుల్ని ఝూలన్‌వార్, గవ్వారవన్ దగ్గర ఉండే చిన్న బజారు చివరల్లో లేక మౌనీ బాబా మఠం దారిలో చూడవచ్చు. ఆశ్చర్యకరమైన విషయం ఏమిటంటే ఈరోజు ఈ 'అతిల్లా' దగ్గర వాళ్లని చూసింది. వాళ్లు కాళ్లకి చెప్పులు లేకుండా నడుస్తున్నారు. ఈస్ట్ ఇండియా కంపెనీ దీవాను లాలాజీ ఉన్నప్పటి రోజుల్లో వాళ్లు శాండిల్స్‌గానీ చెప్పులుగానీ ధరించేవారు. ఆ రోజుల్లో వాళ్లు విలువైన పుష్యరాగం పొదిగిన బంగారు రింగుల్ని తమ తమ యజ్ఞోపవీతాల్లో ధరించి తిరిగేవారు. కానీ ఇప్పుడు వాళ్లు ఆకలితో అలమటిస్తున్నారు. తమ పట్ల సమాజం చూపుతున్న క్రూరమైన అన్యాయాన్ని చూసి ఆ యువతీ యువకులలో ఆవేశం పెల్లుబుకుతుంది. అది ఏదో ఒకరోజు భీషణ అగ్నికీలగా మారదన్న హామీ ఎవరివ్వగలరు. ఆ రోజు మరెంతో దూరంలో లేదు. శశికి శ్రీమతి సేఠ్ వ్రజలో ఎక్కడా కనిపించలేదు. ఆమె ఔదార్యాన్ని గురించి తెలుసుకోవాలన్న అభిలాషతో ఉన్నవారు వదంతుల్ని వ్యాప్తి చేయసాగారు. సంతానంలేని ఆ మహిళ పూజలు మొదలు పెట్టిందని, శశితో చెప్ప డం మొదలెట్టారు. సంతానవతి అయ్యేందుకు




నవలా రచయిత్రి లిన్నె టిల్‌మాన్ ఏకాగ్రత కుదరనపుడు చల్లనినీటితో ముఖం కడుక్కుని వేడవేడి టీతో కంప్యూటర్ ముందు కూర్చుంటుంది. రాసింది చదవాల్సి ఉంటే 'నేను కేవలం ఇంతకుముందు రాసింది చదువుతా', చదవాల్సిందేమీ లేనపుడు 'కనీసం ఒక్క వాక్యమైనా రాయాలి' అని మనసులో అనుకుంటూ పని మొదలెడుతుంది.

ఆమె తపూర్తలా మఠంలోని సన్యాసితో కలసి ఒక మాసం పాటు గడిపిందన్నారు.

ఈ మాటలు నిజంగా విలక్షణమైనవే. ఆ సన్యాసి సంతానం లేని అనేకమంది స్త్రీలకి మాతృత్వాన్ని ప్రసాదించినట్టు అందరికీ విదితమే.

తల తిరుగుతున్నట్టు తోచింది శశికి. అయినా ఆమె ముళ్లు, పొదలు, అంజూర చెట్లతో నిండివున్న రమన్‌రేతీ వైపు నడవసాగింది. అక్కడి ధర్మశాలలో ఈ రోజు జనబాహుళ్యం అధికంగా ఉంది. వాళ్లలో విభిన్న శాఖలకి సంబంధించిన సాధువులు ఉన్నారు. వాళ్లందరూ త్యాగానికి, అహింసకి ప్రతీకలయిన కాషాయ వస్త్రాలు ధరించారు. ప్రభువు శ్రీరామచంద్రుడిని ఆరాధించే వివిధ సంప్రదాయాలకు చెందిన లాలాదాసీలు, నిర్వికారుడైన ఈశ్వరుడిని పూజించే సత్నామీలు, రూపంలేని బ్రహ్మను ఉపాసించే శివనారాయణీలు, కృష్ణభగవానుని పూజించే గరీబ్ దాసీలున్నారు. అన్ని తెగలకి సంబంధించిన సాధువులు జీవితాలలో వాళ్లు వ్రజలో గడిపిన సమయాలు అన్నిటికంటే సంతోషకరమైన విషయమని గ్రహించడంలో వాళ్లందరిలో ఏకత్వం నెలకొంది. హెచ్చరికలు, వేదనల నేపథ్యంలో శశి మనస్సు, ఆత్మ ఈ ప్రాంతంతో, సూక్ష్మమైన పట్టుదారంతో

ముడిపడిపోయింది. అది సున్నితంగానూ పట్టుదలతో కూడిన ఆకర్షణతోను కూడు కుని ఉంది. తాను చాలా దూరం ప్రయా ణించినట్టు అకస్మాత్తుగా గుర్తించింది శశి. తాను ఇంకా ముందుకి వెళ్లడం బహుశా భావ్యం కాకపోవచ్చు తాను బృందావననా థుడి క్షేత్రానికి తిరిగి వెళ్లిపోవాలని భావిం చింది శశి. ఉదయపు సూర్యకిరణాలు అంతటా వ్యాపించాయి. బంగారు వర్ణంతో కూడిన అందమైన సూర్యకిరణాలు తన చిన్నపిల్లలతో కదంబవృక్షం కొమ్మల మీ దున్న ఆ నెమలి ఈకల్ని స్పృశిస్తున్నాయి. ఆ యువ బ్రహ్మచారి స్వామిపట్ల ఉదయి స్తున్న ప్రేమ శశిని ఓ భిన్నమైన వ్యక్తిగా మార్చివేసింది. ఆమెలో ధైర్యం కలిగింది. జీవితాన్ని తెలుసుకోవాలన్న జిజ్ఞాస ఆమెలో మరింత తీవ్రమైంది. ఎప్పటిలాగే ఆమె మందిర ప్రవేశద్వారం దగ్గర జనాల గుంపుని చూసింది. ద్వారం దగ్గర కళ్లజో డుతో ఉన్న ఓ రాధేశ్యామీ శశివైపు వచ్చి "సంస్కృత కళాశాల ఉపాధ్యాయుడైన మహదేవ పండితునిపైన ఈ రోజు విచా రణ జరగనుంది" అంది.

"మహదేవ పండితునిపైన విచారణా? తాను చెప్పినదంతా సరైనదేనని ఆయన అంటున్నప్పుడు ఏ దుష్కృతానికి ఆయ నను విచారిస్తారు?" అంది శశి.

"దుష్కృతమన్నది ఏమీలేదు. కొన్ని రోజులుగా ఆయన మానసిక సమతౌల్యం కొరవడి మథనపడుతున్నాడు. శాస్త్రి కొడుకు, అదే, శాస్త్రిగారిని నువ్వు ఎరగవా? ఆయన కూడా అదే కళాశాలలో ఉపాధ్యా యుడు. గురుకులంలో ఆయన కొడుకు పట్టా పొందాడు. కానీ ప్రస్తుతం అది నిరు పయోగం. శాస్త్రీజీ స్వయాన దక్షత కలవా డవడంతో మహదేవ్ పండిట్ మనస్థి మితం లేకపోవటాన్ని తనకు అనుకూ లంగా మలచుకోవాలని చూస్తున్నాడు. నీకు తెలుసా, శాస్త్రీజీ కాకిలా కపటం- నేర్పు, కొంగలా ధైర్యం కలవాడు. నిజం చెప్పాలంటే మహదేవ్ పిచ్చివాడయ్యాడనే ప్రచారం చేస్తున్నదీ అతనే. ఆ వ్యక్తి గుర్రపు లద్దెలో గింజల్ని ఏరుకుని గుటు క్కున, లాలాజీ మింగినట్టుగా మింగడం ఈరోజు నేను చూశాను. లాలాజీ జీవి తంలో అధికాంశం జమీందారులా జీవించి తర్వాత సంసారాన్ని త్యజించి ఫకీరుగా మారాడు. మహదేవ్ గురించి ఇప్పటికీ వదంతులు వస్తూనే ఉన్నాయి. అతను లీలాబాబా మందిరం దగ్గర బృందగా నాలు ఆలపించేవాళ్ల దగ్గర నిలబడతాడు. అతను ఒకరోజు మృదంగం వాయించే వృద్ధుడితో "ఈరోజు కడుపునిండా భోజ నం లభించిందా? ఈ ఉపకరణం నిన్ను జీవితాంతం మోసం చేస్తూనే ఉంది. వెళ్లు, వెళ్లి దీంతో మురళీధరుని తలపై బాదు" అన్నాడు. మహదేవ్ వృద్ధుడికి ధైర్యం నూరిపోస్తాడు. అతను కేవలం ఒక్కపూట తిండికోసం 'జాంజ్' (ఒక కంచు వాద్యం) వాయిస్తాడు- "నాకు కచ్చితంగా తెలుసు. మీరంతా తొందర్లోనే ఏదో ఒక చీకటి సందులో రక్తం కక్కుకుని ఛస్తారు. మీ బలహీనంగా ఉన్న కాలి పిక్కలమీద కంతులు ఎలా పెరుగుతున్నాయో మీకు తెలుస్తోందా? అధిక సమయం నిలబడ డంవల్ల రక్తం గడ్డ కడుతోంది. మీరంతా ఎందుకు ముందు వెనకలాడతారు? వెళ్లండి, వెళ్లి తేల్చుకోండి. మీ అధికారాలని ఉపయోగించండి. మీరు శాశ్వత పరిశు ద్ధులు- ఈ విషయం ఎందుకు మర్చిపో తారు? సింహద్వారం తెరవండి. మురళీధ రుడికి సమర్పించిన నైవేద్యాలతో మీ కడుపు నింపుకోండి. మీరంతా మూర్ఖులు. మీ మురళీధరుడు ఇన్ని సంవత్సరాలుగా మీ రక్తాన్ని పీల్చి పిప్పి చేసి మీకేసి చూస్తూ పళ్లికిలిస్తున్నాడు. మీరు అర్థం చేసుకోరెందుకని?" అని తరచూ ఉద్బో ధిస్తుంటాడు.

మహదేవ్ గురించి ఇదంతా చెప్పగానే ఆ రాధేశ్యామీ (ఆమె చదువుకున్న మహిళ) నయనాలు అశ్రుపూరితమయ్యాయి. రాధేశ్యామీతోపాటు శశి గజేంద్రమోక్షకుండ్ వైపు నడించింది. అది కచేరీ సావిడి ముందుంది. అసమియా ధర్మశాల ప్రవేశ ద్వారంలాంటి ఆకారం ఉన్న కచేరీ సావిడి ద్వారం నయనానందకరంగా ఉంది. మందిరానికి చెందిన పూజ్య స్వామీజీ ఇక్కడ కూర్చుని రామాయణపురాణం, రామానుజులు, రామానందుల గురించి ధార్మిక ప్రవచనాలు చేస్తుంటారు. అక్కడున్న ఓ గోడమీద చంద్రభాను రాకేష్ చిత్రించిన పెద్ద తైలవర్ణ చిత్రం ఆకర్షణీయంగా ఉంది. అది రామాయణంలోని మార్మిక దృశ్యాన్ని వ్యక్తపరుస్తోంది. అయోధ్యావాసులు వెంటరాగా భరతుడు అన్నగారైన రాముడిని అయోధ్యకి తిరిగి రావల్సిందిగా వేడుకుంటున్న చిత్రం అది. ఆ చిత్రం వివిధ వ్యాపారస్తుల సమూహం, సమర్థులైన కుంభకారులు, నెమలి ఈకలతో వాద్యపరికరాలు చేసే వ్యాపారులు, సున్నితమైన వస్త్రాలు నేసేవాళ్లు, దళారులు, పరిమళ అగరు, ధూప వ్యాపారులు, యజమానుల పాదప్రక్షాళన గావించే నౌకర్లు, రాజసభని అలంకరించే తయారీదారులు ఇంకా ఇతరులతో కూడుకుని ఉన్నది ఆ చిత్రం. వీళ్లందరి మధ్యన భరతుడు నిల్చున్నాడు కళావిహీనంగా. తలమీద కిరీటం లేదు. అవయవాలన్నీ భూషణరహితంగా ఉన్నాయి. చెప్పులు లేకుండా నడవడంతో చిన్న చిన్న గులక రాళ్లు గుచ్చుకుని పాదాలలో లేచిన బొబ్బలు కమల దళాలపైన మంచుబిందువుల్ని తలపిస్తున్నాయి. అంకితభావం కలిగిన ప్రేమ, భక్తిని దర్శింపజేసే ఇలాంటి చిత్రాన్ని కేవలం చంద్రభాను రాకేష్ మాత్రమే రమణీయంగా చిత్రించగలడు. మరెవ్వరూ చిత్రీకరించలేరన్నది వాస్తవం.

ఈ రాధేశ్యామీని అనుసరించి వెళ్లి రాజదర్బారులోని కచేరిసావిడిలోకి ప్రవేశించింది శశి. విచారణ ఇంకా మొదలు కాలేదు. వేదికపైన పెద్ద పలక మీద 'గోస్టీ' ప్రారంభమయ్యే సమయం, పెద్ద పెద్ద అక్షరాలతో రాసి ఉంది. మందిరంలోకి ప్రవేశం నిలిపివేశారు. ముందుగానే లోపలికి చేరుకున్నవాళ్లు చాలామంది ఉన్నారు. రంగనాథ మందిరానికి చెందిన 'స్వామి' న్యాయాధికారిగా ఉన్నాడు.

"ఆ పక్కన మెట్లమీద కూర్చున్న ఆ మహిళని చూశావా? ఆమె మహదేవ్ భార్య. ఆ దంపతులకి ఐదుగురు సంతానం. తండ్రి ఉద్యోగం కోల్పోతే వాళ్ల పరిస్థితి ఏంటి?" అంది రాధేశ్యామీ ఆ కుటుంబంపట్ల జాలి కనబరుస్తూ శశితో.

## 'సమ్'అర్థవంతం?

'కోడలు దిద్దిన కాపురం' శతదినోత్సవ సభను నిర్వహిస్తున్న ఆరుద్ర ఒక్కొక్కరినీ వేదిక మీదికి ఆహ్వానిస్తూ వేటూరిని 'ఈ మధ్యే కొత్తగా వచ్చి పాటలు రాస్తున్న,



వేగంగా రాస్తున్న, 'సమ్'అర్థవంతంగా రాస్తున్న యువ రచయిత..' అని వ్యంగ్యంగా పిలిచారు.

తర్వాత వేదిక మీద వేటూరి మాట్లాడుతూ 'గురువుగారు 'సమర్థవంతంగా' అన్నారు కానీ, తెలుగులో ఆ పదం లేదు, 'సమర్థంగా' అని మాత్రమే ఉంది' అని తిప్పి కొట్టారు.

శశి ఏమీ మాట్లాడకపోవడంతో ఆ రాధే శ్యామీ శశితో ముఖాముఖి అవుతూ "నువ్వేదో ఇబ్బంది పడుతున్నట్టుగా అనిపిస్తోంది" అంది.

"ఆ ఐదుగురు పిల్లల తండ్రి ఉద్యోగం కోల్పోతాడన్న విషయం నాకు బాధ కలిగిస్తోంది" అంది శశి.

"కేవలం తీర్పు చెప్పడమే తరువాయి. వాదనలు ముందుగానే పూర్తయిపోయాయి" అంది రాధేశ్యామీ.

గుండెలు వేగంగా కొట్టుకుంటున్న భావన కలిగింది శశికి. తాను ప్రేమించిన వ్యక్తి ఇప్పుడు, ఈ క్షణంలో ఒక దురదృష్టవంతుని భవితవ్యాన్ని నిర్ణయించాల్సి ఉంది.

న్యాయాధికారిగా ఉన్న ఆ స్వామిని శశి నిల్చున్న చోట నుంచి బాగా చూడవచ్చు. అతని దృఢమైన వ్యక్తిత్వం, ఆకారం, గంభీరత ఆకర్షణ గొలిపేవిగా ఉన్నాయి. అతను ఏం చెప్పబోతున్నాడు? నిర్ణయం ఎలా ఉండబోతోంది? ఆలోచనల్లో పడిపోయింది శశి.

మందిర ద్వారాలు తెరుచుకోకముందు, ఊరేగింపు బయలుదేరకముందు, రంగనాథస్వామికి గౌరవసూచకంగా గరుత్మంతుని విగ్రహాన్ని నలువైపులా ఊరేగించకముందే తీర్పు వెలువడనుంది. సమయం గడుస్తోంది. అందరూ ఆ స్వామివైపు ఉత్సుకతతో చూస్తున్నారు.

న్యాయాధికారి నిర్భీతిగా ఒకసారి కనుబొమల్ని పైకెత్తి దూరంగా దృష్టి సారించాడు. అతని నుదుటిపైన చందన తిలకం భవ్యంగా గోచరిస్తోంది. జన సమూహంలోని యువకులు, వృద్ధులు సైతం చింతాక్రాంతులై ఆయనవైపే చూడసాగారు.

న్యాయధికారి గర్జించే స్వరంతో చెప్పడం మొదలుపెట్టాడు. "గత ఇరవై సంవత్సరాలుగా మహదేవ్ పండిట్ అనితరసాధ్యమైన నీతినిబద్ధతతో, అంకితభావంతో క్షేత్రానికి చేసిన సేవ ఇతరులకి అనుసరణీయం. కానీ ఇకముందు ఈవిధంగా సేవ చేయడం ఆయనకి అసంభవం. ఆయన చేసిన సేవలకి గుర్తింపుగా ఆయనకి వైద్యచికిత్సలు అందించే బాధ్యతను ఆలయ అధికారులు తీసుకుంటారు. అంతే కాదు, ఆయన ఐదుగురి పిల్లల సంరక్షణ బాధ్యత కూడా ఆలయ అధికారులదే. గరుత్మంతుడి విగ్రహం చుట్టుపక్కలగల స్థలాన్ని శుభ్రపరిచే గౌరవనీయమైన పనిని మహదేవ్ భార్యకి అప్పజెప్పారు. అందుకు ప్రతిఫలంగా ఆమెకి రెండుపూటలా భోజన సామగ్రి ఇస్తారు.

కొత్త ఉపాధ్యాయుడి నియామకాన్ని ప్రస్తుతానికి వాయిదా వేశారు. ఎందుకంటే చదువుండీ పనీపాటాలేని యువకులు, మధురలోని క్షేత్రాలలో శిక్షణ పొందిన వాళ్లు చాలామంది బృందావనంలోని క్షేత్రాలలో చేరేందుకు ఉత్సాహపడుతున్నారు. సరయిన నిర్ణయం తీసుకునేందుకు సమయం పడుతుంది. అందుకని ప్రస్తుతం అది వాయిదా వేశారు"

స్వామి నిర్ణయం వెలువరించినంతసేపూ అంతటా నిశ్శబ్దం ఆవరించింది. స్వామి చెప్పడం పూర్తికాగానే ముందు నుంచి ఆయనను సమర్థిస్తూ సాగిన గుసగుసలు నెమ్మది నెమ్మదిగా పతాకస్థాయికి చేరుకున్నాయి. అందరూ న్యాయాధికారి విద్వత్తును ప్రశంసించారు. గజేంద్రకుండ్ కప్పుకింద నిలుచున్న వనమహరాజ్ విద్యార్థులు ఆయన్ని ప్రశంసిస్తూ నినాదాలు చేయసాగారు. ఇతరులు కూడా వాళ్లతో గొంతు కలిపారు. అందరూ యువ స్వామి తీర్పుపట్ల హర్షం వ్యక్తంచేశారు.

ఇంతలో మందిర ద్వారాలు తెరుచుకున్నాయి. రంగనాథ ప్రభువు వస్త్రాలంకరణ ఏర్పాట్లు పూర్తయినట్లుగా షెహనాయి వాద్యం వెలువడింది. జనసమూహం నుంచి మందిరంలోకి ప్రవేశించేందుకు స్వామి దారి చూసుకోసాగాడు.

తీర్పు వెలువడేంతవరకు శశి కచేరి సావిడిలోని ఓ స్తంభం పక్కగా నిలబడింది. కార్యనిర్వాహకులు ప్రముఖంగా తమ ప్రియమైన స్వామి భావచింతనలో లీనమయ్యారు. తనకి పూర్తి సమాచారం అందించే రాధేశ్యామీ అక్కణ్ణించి వెళ్లిపోయిందన్న విషయం కూడా శశికి తెలియ లేదు. ఆ యువస్వామి శశి హృదయం లోని ప్రియుడు. అతని వివేకవంతమైన తీర్పుపట్ల ఆమె మౌనంగానే సంతోషించింది. ఆ తీర్పుని బలపరచాలనే తీవ్రమైన కోరిక ఆమెలో చెలరేగింది. ఆమె కళ్లు చెమర్చాయి. 'ఇదే సానుభూతి అందరిపట్ల చూపే శక్తిని మీరు కలిగివుండాలి. అందువల్ల కోట్లాది బాధిత హృదయాలలో మీరు స్థానం సంపాదించుకోగలరు' తనలో తాను అనుకుంది శశి.

స్వామి, బృందావన్‌నాథ్ భక్తులు సాయీస్ మందిరం నుంచి బయటకు వచ్చారు. ఇప్పుడు వాళ్లు ఉద్యానవనాన్ని తిలకించేందుకు బయలుదేరతారు. ఉద్యానవనం చూసేందుకు వచ్చే యాత్రికులు అధికంగా ఉంటారు. అలాంటప్పుడు అక్కడ నిలబడ్డం సురక్షితం కాదు. మౌనంగా ఆ ప్రాంతాన్ని వదలివెళ్లిపోవడం మేలు అనుకుంది శశి. గేటుదగ్గర నిలబడ్డ సెంట్రీ అటువైపు రావడం చూసింది శశి.

చివరికి గరుడకుండ్ మెట్లవైపుగా ముందుకు సాగింది శశి. తరువాత అక్కడ చాలాసేపు ఒంటరిగా నిలబడిపోయింది. ఎందుకో ఏమో మరి తన నడవడి విలక్షణంగా అనిపించిందామెకు. ఆమె అక్కడ చేసేదేమీ లేదు. నెమలి పురి విప్పడం చూసేందుకా? అలా అనుకునేందుకు కూడా లేదు. ఎందుకంటే ప్రజలోని దృశ్యాలు, ధ్వనులపట్ల శశికి పెద్దగా ఆసక్తి లేదు. అవన్నీ ఆమెకి తెలియనివి కావు. కేవలం ఆ యువస్వామిని క్షణం వీక్షించేం

## చైనా కబుర్లు..

*చతుర సమాచారం*

ప్రపంచంలో అత్యధిక జనాభా గల దేశం చైనాకి సంబంధించిన కొన్ని సంగతులు..

★ చైనాలో మరణశిక్షలు అధికం. మరణ శిక్షలు రోడ్డు పక్కన ప్రత్యేక వాహనాల్లో విషం ఇంజెక్షన్‌తో జరుగుతాయి! అక్కడ ఉరి అరుదు.

★ చైనాలో క్రిస్టియన్ల సంఖ్య ఇటలీలోని క్రిస్టియన్ల సంఖ్య కన్నా ఎక్కువ. త్వరలోనే ఇది అత్యధిక క్రిస్టియన్లుగల దేశంగా మారబోతోందని అంచనా!



★ చైనాలో ఏటా 450 కోట్ల చాప్‌స్టిక్స్‌ని ఉపయోగిస్తున్నారు. ఇందుకోసం 2 కోట్ల 50 లక్షల చెట్లు అవసరం అవుతాయి.

★ ఇక్కడ 64 శాతం మంది పేదవారే. 20 కోట్లమంది దినసరి ఆదాయం డాలర్ కన్నా తక్కువే!

★ చైనాలోని 70 కోట్లమంది కలుషిత నీటినే తాగుతున్నారు. పారిశ్రామికీకరణ వల్ల భూగర్భజలాల్లో 90 శాతం, నదులు చెరువులు 75 శాతం కాలుష్యానికి గురయ్యాయి.

★ క్రీస్తుపూర్వం 200లో చైనాలో ఐస్‌క్రీం కనిపెట్టారు. శీతలీకరణ చేసిన పాలన్నాన్ని తినే వారప్పట్లో. పాస్తా కూడా ఇక్కడే కనిపెట్టారని చైనా పురావస్తు శాఖ చెప్తోంది. 4వేల ఏళ్ల క్రితం నాటి పాస్తా ఉన్న గిన్నె శిల్పం తవ్వకాలలో బయటపడింది.

★ యూరప్‌లో లభ్యమయ్యే 50 శాతం సకిలీ వస్తువులు చైనాలోనే తయారవుతున్నాయి. వాటిలో సిడి/డివిడిలు, సిగరెట్లు ప్రథమస్థానంలో ఉన్నాయి.

★ చైనాలో ప్లేగ్ వ్యాధి ఇంకా మాయం కాలేదు. 2009లో వాయవ్యచైనాలోని ఓ పట్టణంలో ప్లేగ్ వ్యాధి ప్రబలడంతో ఆ పట్టణాన్ని దిగ్బంధించారు..

దుకు ఆమె అక్కడ నిరీక్షిస్తోంది. అక్కడ ఉన్నందువల్ల ఆత్మస్తుతి భావన ఆమెలో వ్యాప్తిచెందింది. ఆమె గర్వపడుతూ ఆనందించసాగింది. అయినప్పటికీ అసహాయ భావన ఆమెలో తొలగిపోలేదు.

"రోజులు బాగుండలేదు. నిన్ను నువ్వు సురక్షితంగా ఉంచుకునేందుకు ఏదో ఒకటి చెయ్యాలి" అంటూ రాత్రి మరోసారి శశి భవిష్యత్తును గురించి ఆ రాధేశ్యామీ వచ్చి హెచ్చరించింది.

ఆ రాత్రి మగత నిద్రలో శశికి విచిత్రమైన కలలు వచ్చాయి. అక్రూర్‌ఘాట్ దగ్గరున్న పురాతనమైన పంచముఖి ఆంజనేయస్వామి విగ్రహం సమీపంలో ఆమె ఓ భయంకరమైన ఆకారాన్ని చూసింది. కృష్ణ బలదేవ కాలంలో, వాళ్ల ప్రియమైన రథానికి చెందిన అనేక భాగాలు ముక్కలై చెల్లాచెదురై ఉండడం చూసింది. అపశకునం అయిన ఈ భూత్తం ఆకారాం శ్యాంజీ దిగంబర్ నీడదారిలో మాధవాచార్యులకి ప్రియమైన బలదేవ్ మఠం చుట్టుపక్కల తిరుగాడుతోంది. ఆ తర్వాత చివరగా శిథిలమైన బుద్ధుడి దేవాలయం దగ్గర దాని స్థానంలో నిలిచిపోయింది.

ఆ భూతం మొహాన్ని చూసి ఉలిక్కిపడింది శశి. ఆమె ఎవరో కాదు, శ్రీమతి షరాఫీ సేఠ్. అది శశిని తిరస్కరిస్తూ "ఇరవై రోజులపాటు స్వామితో పడుకున్న తర్వాత పిల్లలతోపాటు నేను పెద్దదాన్ని అయ్యాను. అయినా నేను ఇలా ఎందుకని దారితప్పి తిరుగుతున్నట్టు? నాకు శాంతి లభించకపోవడానికి కారణం ఏమయ్యుంటుంది? " అంటూ గట్టిగా అరిచింది.

తర్వాత ఆ ఆకారం భయపడుతున్న శశివైపు వేలెత్తి చూపుతూ "ఇంకా సమయం మించిపోలేదు, నువ్వు ఇక్కడి నుంచి తొలగిపో! నీ హృదయాంతరాల్లో ఓ మందిరం నిర్మించు. ఓహ్! ఇది చ్చాలా

# చతుర ప్రవేశిక

## జనవరి చతుర చదివారా?

ఈ ప్రశ్నలకు ఒక్క మాటలో జవాబు రాసి బహుమతి పొందండి. ఎక్కువమంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతలను ఎంపికచేస్తాం. ఇందులో ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు.

| | |
|---|---|
| 1. సౌదామిని తండ్రి? | 6. అష్టధాతు శిల్పి? |
| జ. | జ. |
| 2. ఠాకూర్ సాహెబ్ కూతురు? | 7. శశి ఎవరిని కలవాలనుకుంది? |
| జ. | జ. |
| 3. ఆలంఘడీ దగ్గర ఉన్నది? | 8. చైనాలో పేదరిక శాతం? |
| జ. | జ. |
| 4. రాయ్‌చౌదరి వృత్తి? | 9. 18వ ఏటనే ఫుల్‌టైం ప్రొఫెసర్‌గా చేరింది? |
| జ. | జ. |
| 5. సౌదామిని భర్త? | 10. హంగామా నవలా రచయిత? |
| జ. | జ. |

పంపినవారి పేరు: ------------------------------------ వయసు (   )

చిరునామా: ------------------------------------------------

-------------------------- పిన్‌కోడ్ :          ఫోన్ నెం :

చిరునామా : సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 82

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

గడువు తేదీ 17

ఈ కూపన్‌లోనే సమాధానాలు రాసి పంపాలి.

భయంకరమైంది. కానీ దీన్ని గ్రహించేవా రెవరు? " అంటూ ఆ ఆత్మ మళ్లీ ముళ్లపొదల వెనకాల మాయమైపోయింది.

శశి ఒక్క అరుపు అరుస్తూ దిగ్గున లేచింది. ఎవరో తలుపు తడుతున్న భావన కలిగిందామెకి. దాంతో ఆమె అప్రమత్తమైంది. కానీ ఎవరూ లేరు. అది కేవలం భ్రాంతి మాత్రమే.

ఉత్తరకాశీకి చెందిన విద్యార్థి చెప్పిన విషయం గుర్తుకు వచ్చింది శశికి. అర్జున వృక్షం కింద అరవైనాలుగు సామంతుల సంపత్తి అయిన పందిరి నీడలో కూర్చుని అతను రుగ్వేదంలోని విషయమంటూ ఉదహరించాడు- ఒకస్త్రీ సంతానవతి కావాలంటే తన భర్త కాక మరో పురుషుడితో సహవాసం చేయడం పాపకృత్యం కాదు. అది కేవలం అనార్యమైంది. అసత్యమాడడం ఒకటే పాపభూయిష్ఠమైంది. ఈ సందర్భంలో అతను ఎందరో మహనీయుల జీవితాల్ని వివరించాడు. వ్యాసమహర్షి, పరాశరుడు, శంకరాచార్యులతోపాటు ప్రఖ్యాత వేదాంత శాస్త్రాలని పరిశోధించిన వారి జీవిత చరిత్రలని వివరించాడు. వాళ్ల జన్మలకి సంబంధించిన వృత్తాంతాలు నిజంగా అద్భుతమైనవి కూడా.

మను, పరాశరుడు, యాజ్ఞవల్క్యుడు లాంటి ధార్మికస్మృతికర్తలు స్త్రీ వేదనలని దూ రం చేసేందుకు గాఢమైన సానుభూతిపూర్వక వ్యవహారాలతో కూడిన అన్ని ఆలోచనలని ఉపయోగించారు.

కానీ వాస్తవం గతంలో ఎలా వుండేదో ఇప్పుడూ అలానే వుంది. దీనిని రుగ్వేదం గానీ, మనువు గానీ, లేక పరాశరుడు గానీ మార్చలేరు. అందువల్లే శశి శ్రీమతి షరాఫీసేర్‌ని బుద్ధుడి శిథిలాల మధ్య అన్వేషించింది.

అర్ధరాత్రి సమయం. అంతటా నిశ్శబ్దం ఆవరించి వుంది. ఎలాంటి శబ్దాలు వినబడ్డంలేదు. ఇంకా చెప్పాలంటే ఈరోజు రాధేశ్యామీ గురకలు కూడా వినిపించడం లేదు. కానీ శశికి నిద్ర రావటం లేదు. అనేక అనుభవాలు ఆమె మదిలో స్థానం ఏర్పరచుకున్నాయి. ఆమె మృణాళినిని గుర్తుకు తెచ్చుకుంది. రొట్టెముక్క కోసం ఇంటింటికీ తిరగవలసిన పరిస్థితి ఆమెది. ఒక మట్టిపాత్రని పట్టుకుని రంగనాథుని మందిరంలో తిరుమంజన సేవ తర్వాత ఇచ్చే కొన్ని పాలకోసం ఇతర బిచ్చగాళ్లలానే జీవితం గడుపుతోంది.

వ్రజలో తన కళ్లముందు జరిగిన మార్పులు జ్ఞప్తికొచ్చాయి శశికి. ఆమెలో ఆలోచనలు ముప్పిరిగొన్నాయి. వాటినన్నిటిని తొక్కిపెట్టి ఆమె ముందుకు కదిలింది. రంగనాథ మందిరానికి చెందిన స్వామి చేసిన గంభీరమైన ప్రకటన ఆమె ఒకసారి వింది. కచేరి సావిడి మెట్లమీద కూర్చుని అతను అన్నాడు - "వ్రజలోని మధుర రాసలీలల్ని హృదయాలలో నిలిపిందెవరు? అతను మానవ శరీరధారి అయిన బ్రహ్మగా బ్రహ్మపురాణం తెలియజేస్తోంది. కానీ వసుదేవుడు స్వయంగా చెప్పాడు, కృష్ణుడు పరాత్పరుడని. ప్రథమకాలిక స్త్రీ శక్తి సృష్టికర్తయని, ప్రపంచాన్ని అదే నడిపిస్తుందని. కురుక్షేత్ర యుద్ధ మధ్యమంలోంచి ఆవిర్భవించిన గీతాసారం తెలుపుతుంది అది సర్వశక్తిమంతమైందని, అనంతమైన విశ్వవ్యాపకమైందని.

ఇవి పూర్తి బుద్ధిమత శబ్దాలు. కానీ వీటిని కూడా స్పష్టంగా వ్యక్తపరచలేరా? మానవ జీవనం మొత్తం ధృఢ సంకల్పం మీద ఆధారపడివుంది. కానీ దానిని నిర్మించడం అంత తేలికైన విషయం కాదు"

ఎవరో తలుపుతడుతున్న శబ్దం వినబడడంతో ఆలోచనల్లో కూరుకుపోయిన శశి ఈ లోకంలోకి వచ్చిపడింది. ఆమె ఈ లోకంలో ఉంటే కదా! ఇప్పుడు తలుపు తట్టిన శబ్దం ఆమె భ్రమకాదు. ఆ శబ్దం ఆమెకి స్పష్టంగా వినబడింది. వాస్తవం

కూడా. అది తనకి భయానకంగా లేదా? తనకు కొంచెం దూరంగా గాఢ నిద్రలో వున్న రాధేశ్యామీ వైపు చూసింది శశి.

తలుపుమీద మళ్లీ చప్పుడైంది. శశి తొంగి చూసింది. తలుపు దగ్గర ఇద్దరు రాధేశ్యామీలు నిలబడి వున్నారు. తలని, ముఖాన్ని బట్టతో కప్పుకున్నారు. శశి తలుపు తీయగానే లోపలికి దూసుకొచ్చారు.

"శశీ! మమ్మల్ని క్షమించు. నీకు ఓ దుర్వార్తని మోసుకొచ్చాం. ఆలంఘడీ మరణించాడు" అన్నారు వాళ్లు.

"ఆలంఘడీ చచ్చిపోయాడా? ఎలా? ఎప్పుడు? " అంటూ శశి దుఃఖం నిండిన స్వరంతో నిస్సహాయంగా అరిచింది.

"అతను కలరా సోకి మరణించాడు. మేం వెళ్తున్నాం. మాతో వచ్చేయ్" అన్నారు వాళ్లు. ఆలంఘడీ స్నేహితులు అప్పటికే ఘాట్ దగ్గర అతని నివాసస్థానానికి చేరుకున్నారు. ఆమె అక్కడికి చేరుకోగానే అందరి దృష్టి ఆమెపై పడింది. అందరూ ఆమెకోసమే నిరీక్షిస్తున్నట్టుగా ఉన్నారు. అతని దగ్గర కూర్చుని ఓ మహిళ ఏడుస్తోంది. బహుశా ఆమె రాధాకుండ్‌లో నివసించే అతని అక్క అయ్యివుంటుంది అనుకుంది శశి.

ఓ రాధేశ్యామీ మృతుడి దుస్తులు మార్చడంలో నిమగ్నమయింది. చాలాకాలంగా ఆలంఘడీ చిరుగులతో వున్న ధోవతి కట్టుకునేవాడు. ఈరోజు అతనికి ఒక కొత్త ధోవతి లభించింది. అతని మెడలో ఓ మాల కూడా వేశారు. అత్తరు, గోపీ చందనం పూశారు.

రాధాకుండ్‌నించి వచ్చిన ఆలంఘడీ అక్క అకస్మాత్తుగా తల ఎత్తి శశిని తీక్షణంగా చూసింది. మరుక్షణమే భగ్గుమంది. అక్కడున్నవాళ్లందరికీ వినబడేటట్టుగా "నా బిడ్డల్లారా! మీరు ఎంతో కాలంగా ఇక్కడ వుంటున్నారు. నా తమ్ముడు తన బాగోగులు చూసేందుకు ఓ స్త్రీని వుంచుకున్నాడని మీకందరికీ తెలుసు. అతని యావదాస్తి మీద హక్కు తనకు వుందని చెప్పేందుకు ఇప్పుడు ఆమె వచ్చిందనిపిస్తోంది" అందామె.

ఆమె ఆలంఘడీ శవం మీద గుడ్డ కప్పుతూ చెప్పడం కొనసాగించింది. "నేను వ్రజలో ఇరవై సంవత్సరాలకు పైగా వుంటున్నాను. అన్యాయాన్ని సహిస్తూ ఓ మూగదానిలా నేను ఉండలేను. ఇతను చివరిశ్వాస తీసుకుంటూ దూరంగా నివసిస్తున్న ఓ యువతికి పాత నాణాలతో నింపి వున్న సంచిని వారసత్వంగా ఇస్తున్నట్లు చెప్పడం స్వయంగా విన్నాను" అంది.

ఆలంఘడీ అక్క ఏడుపు నెమ్మదించింది. ఆ తర్వాత "అతను చెప్పిన విషయం గాని, నాకు జరిగిన అన్యాయంగాని అనౌచిత్యమని నాకు తెలుసు. నపుంసకుడయిన వాడెవరైనా వారసులని ఎలా నిర్ధారించగలరు? " అంది శశి.

ఈ మాటలు వినగానే అక్కడున్న రాధేశ్యామీలు రెండు వర్గాలుగా చీలిపోయారు. కొంతసేపు వాదోపవాదాలు చేసుకున్నారు. దూషించుకున్నారు. ఆ తర్వాత పోట్లాడుకోసాగారు. ఆ సమయంలో మృతుడ్ని అలంకరించేందుకు తెచ్చిన ధూపం, గోపీచందనం మల్లెమాలు లాంటివన్నీ చెల్లాచెదురయ్యాయి. ఆ గడబిడల మధ్య ఓ రాధేశ్యామి గబగబా బ యటికి వెళ్లి కేశీఘాట్ దగ్గరుండే పండాని కలగజేసుకోవాలని కోరింది. శవయాత్రకోసం పూల దండలు తయారుచేయడంలో నిమగ్నమయిన మరో రాధేశ్యామీ తన పనిని ఆపి శవం వున్న చోటికి వచ్చింది.

దృఢంగా, గంభీరంగా వున్న పూజారి రాక రాధేశ్యామీలని ఉలికిపాటుకు గురిచేసింది. వాళ్లంతా మౌనంగా, శాంతంగా మారిపోయారు. వాళ్లు తలలపై నుంచి జారుతున్న బట్టను సరిచేసుకోసాగారు.

కేశీఘాట్ పూజారి నలువైపులా చూ

శాడు. తీక్షణమైన అతని దృష్టి బిచ్చగత్తెల మొహాలలా వున్న రాధేశ్యామీలపైన, పెచ్చులూడి పాడుబడ్డ గుడిశె గోడలపైన, చిత్తడిగా వున్న నేలపైన, మల్లెల మాలల పైన కొంతసేపు ఆగి- చివరికి ఆలంఘడీ శవం మీద స్థిరపడింది. కొంత మౌనం తర్వాత పూజారి తల ఎత్తి "నా బిడ్డల్లారా! ఇదే సమయం. అద్దంలో మీ ప్రతిబింబాన్ని చూసుకోండి. బాగా వేళ్లూనుకున్న చెట్టు మొదలు ఊడేలా కొమ్మల్ని లాగడం మొదలుపెట్టారు. మీరు అద్దంలో చూసుకునే సమయమిది. జీవితం తామరాకు మీద నీటిబొట్టులాంటిదనే విషయం మీరు గ్రహించలేకపోతున్నారు. మిమ్మల్ని చూస్తుంటే నవ్వు వస్తోంది. సరిగ్గా చూడండి. మీలో మీరు తొంగి చూసుకోండి. మీలోని ప్రత్యేకమైన క్షీణతని చూస్తారు. భయంగొలిపే భీషణ హాహాకారాలని వింటారు. నా బిడ్డల్లారా, ఆలంఘడీ దేహంపైన ఆ బట్టలు, ఆ భూషణాలు, పూలదండలు ఇంకా చందన లేపనం, తులసి మాలలు, విభూతిలాంటివి ఇప్పుడు కేవలం భారమనే విషయం మీరు గ్రహించడంలేదా? మీరు శాపగ్రస్తులు. కేవలం కొన్ని నాణేల కోసం మీలో మీరు తగవులాడుకుంటున్నారు! నేను చెబుతున్నాను, మీరు వీటన్నిటి నుంచి బాధావిముక్తులవ్వండి. ఎందుకంటే గ్రామంలో పంచాయితీ గనక జరిగితే మీలో ఎవ్వరూ ఒక్కదమ్మిడీ కూడా పొందలేరన్న విషయం వాస్తవం" అన్నాడు.

పూజారి మాటలకి వృద్ధురాలైన ఆలంఘడీ అక్క దుఃఖంతో కూడిన స్వరంతో అక్కడ గుమిగూడిన స్త్రీలని సంబోధిస్తూ "దయచేసి నా మాటల్ని ఆలకించండి. నేను పడుతున్న బాధల్ని మీకు తెలియజేసుకుంటున్నాను. చాలాకాలం నేను గుర్రాలకి వేసే బంగాళాదుంపల్ని కొనుక్కుని తింటూ బతుకుతున్నాను. ఈవిధంగా కష్టపడి నా అంతిమ సంస్కారాలకోసం డబ్బు దాచుకున్నాను. ఇదేమీ తప్పుకాదు. కానీ మరుసటి రోజే మొత్తమంతా దోచేశారు. కావాలంటే వెళ్ళండి, వెళ్ళి నా వస్తువుల్ని సోదా చేయండి. పైసా కూడా లేదు. ఒకరోజు గుడిసె పైకప్పు నా మీద కూలింది. శ్రీమతి సేఠ్ తన కుక్కల్ని నాపైన వుసి గొల్పింది. అప్పుడు తెలిసిందామెకి నా అంతిమ సంస్కారాలకి కూడా నా దగ్గర ఏమీ లేదని. అయ్యో! పేదవాడైన నా తమ్ముడు ఒకరోజు నాతో అన్నాడు, 'వయసులో నువ్వు నాకన్నా పెద్దదానివి. నాకన్నా ముందే నువ్వు మరణిస్తావు. నేను నిన్ను పూలపాడె పైన తీసుకువెళ్ళే ఏర్పాటుచేస్తాను' అని అంటూ ఆ వృద్ధ స్త్రీ తన తల బాదుకుంటూ ఏడ

## మహాస్మా!

వేటూరి ఓసారి మోహన్‌గాంధీ అనే మిత్రుని కలవడానికి వెళ్లారు. ఆయన రావడం ఆలస్యమైంది. ఇంకో చోటకి తొందరగా వెళ్లవలసి ఉన్న వేటూరిగారు వెంటనే



ఒక వ్యక్తితో కబురు పంపారు. మోహన్‌గాంధీకి ఆస్మా వ్యాధి ఉన్న విషయం స్ఫురణకు రావడంతో 'మీ మహాస్మా గాంధీని తొందరగా రమ్మని చెప్పు' అన్నారు. ఆయన చమత్కారానికి అక్కడున్నవారందరూ గొల్లున నవ్వారు.

వసాగింది.

కొంత దూరంలో నిలబడి అంతా విన్న శశి ఆ వృద్ధురాలు చెప్పినదంతా వాస్తవం కావడంతో సంతృప్తి చెందింది. సమయాన్ని ఇక ఏమాత్రం వృధా కానీయకుండా శశి ఆ వృద్ధురాలి వైపు కదిలింది ఆమె కళ్ళు పొడిబారి వున్నాయి. జుట్టు చెదిరిపోయింది. దుఃఖానికి ప్రతీకగా ఉందామె. శశి ఆ వృద్ధురాలితో "నన్ను నమ్ము. ఆలంఘడీ డబ్బు లాక్కునేందుకు నేనిక్కడకి రాలేదు. నేను వచ్చింది అతని కడసారి చూపుకోసం" అంటూ బయటికి వెళ్ళిపోయింది. అలా వెళ్లి బయట ఇసుకలో కూర్చుండిపోయింది. ఎంత విచిత్రం నిజంగా ఇది విచిత్రమే. ఒక్కరోజులోనే అంతా జరిగిపోయింది. ఈరోజు, ఈ క్షణంలోనే ఆలంఘడీ యోగ్యుడని, శక్తి సామర్థ్యాలు గలవాడని తనలో జ్ఞానోదయం కలిగినట్టుగా అనిపించింది శశికి.

సమయం నెమ్మదిగా గడుస్తోంది. తన పరిస్థితి గురించి ఎప్పటి నుంచో ఇసుకలో కూర్చుని లోతుగా ఆలోచిస్తున్న విషయం అతికష్టం మీద గ్రహించింది శశి. కొంతసేపటి క్రితమే పసుపురంగు కంఠం వున్న గరుడపక్షి తన చుట్టూ తిరగడం గుర్తుకొచ్చింది శశికి. ఇప్పుడు ఆ స్థానంలో తన నీడ.. కొందరు రాధేశ్యామీలు తమ కష్టాలు వెళ్ళబోసుకునేందుకు ఆమె వద్దకు వచ్చారు. ఆలంఘడీ పోయాడు కనుక గట్టిగా మొత్తుకుంటూ ఏడవమని శశికి సలహా ఇచ్చారు. వాళ్లలో ఒకతె శశి మెడలోని గొలుసు లాక్కునే ప్రయత్నం చేసింది. ఎందుకంటే ఇప్పుడామెకి ఆ గొలుసుతో పనిలేదని. కానీ శశి ఆమెని నిరోధించింది.

కొద్ది దూరం నుంచి ఎవరో తనవైపు వస్తున్నట్లు గమనించింది శశి. ఎవరయ్యుంటారా? అవును, ఆయన రాయ్‌చౌదరి. తనవైపే వస్తున్నాడు. సర్క్యూట్ రోడ్డుపైన రోగుల్ని చూసేందుకు బయల్దేరినట్టున్నాడాయన. శశి దగ్గరకు వచ్చి "ఇంకా ఇక్కడే వున్నావా? ఇటుగా వెళ్తున్నప్పుడు చూశాను నిన్ను. కొన్ని గంటలుగా నువ్వు ఇక్కడే కూర్చుని ఉన్నావు. నేను చెప్తున్నాను. ధైర్యం వహించు. నాకు తెలుసు నువ్వు సాహసం గల యువతివి. అల్పవస్తువుల కోసం స్వల్ప ప్రయోజనాల కోసం మొత్తం ఖజానాని పోగొట్టే వాళ్లలో నువ్వు ఒకదానివి కావు" అన్నాడు.

శశి ఆయన వైపు అచేతనంగా చూసింది. దుఃఖం, బాధ ఒక్కసారిగా పెల్లుబుకడంతో శశి ఆయన పాదాలపైన వాలిపోయి "నాకు తెలుసు. మీరొక్కరే నాకు సరియైన దిశానిర్దేశకులు" అంది. "నేను చాలా బాధల్లో ఉన్నాను. నాకు సురక్షితమైన, స్థిరమైన మార్గం కావాలి" అంటూ మోకాళ్లపైన తల ఆన్చి ఆమె ఏడ్వసాగింది. ఆమె ఏడుపు మధ్యలో "లేదు, నేను అల్పవస్తువుల కోసం పాకులాడేదాన్ని కాను" అన్న మాటలు రాయ్‌చౌదరికి వినిపించాయి.

ఈ లోపల యమున ఒడ్డున ఆలంఘడీ అంత్యక్రియల ఏర్పాట్లు జరిగాయి. శవంపైన పవిత్ర జలం చల్లి మంత్రోచ్చారణ మొదలెట్టాడు కేశీఘాట్ పూజారి.

శశి పెద్దగా చేసేదేమీ లేదు. చితి పూర్తిగా కాలిపోయిన తర్వాత తాటాకుల

కొత్తగాలి... 

**నీలాకాశం అందమైందే**
**కథలూ, కావ్యాల్లో..!**
**మబ్బుల్లేని ఆకసం చూస్తే కన్నీరే**
**కర్షకుల జీవితాల్లో!**

– ఎం. భవాని, హైదరాబాద్

రంగులో ఉన్న అస్థికల్ని ఆలంఘడీ అక్క తీసింది. ఆ తర్వాత శవయాత్రలో పాల్గొన్న రాధేశ్యామీలు నదిలో మునకలు వేసి వెళ్లిపోయారు. శశి ఇసుకలో ఒంటరిగా కూర్చుంది. కేశీఘాట్ పూజారి శశి దగ్గరకి వచ్చి "ఇక ఇంటికి వెళ్లు. నీ బాగోగులు చూసుకో" అని చెప్తూ "నేను చెప్పేది గుర్తుంచుకో. నా ఉద్దేశం ఓ రొట్టెముక్క కోసం నీలాంటి వాళ్లు రోత పుట్టించే ఆ వృద్ధ స్త్రీలతో కలిసి ఇంటింటికీ తిరగడం, ఆ రాధేశ్యామీలతో నువ్వు గడపడం సిగ్గు చేటు, అవమానకరం. శ్రద్ధతో ప్రయత్నం చెయ్యి, నీకు మంచి భవిష్యత్తు ఉంది. నిన్ను మంత్రసానిని చెయ్యాలని డాక్టర్ రాయ్‌చౌదరి కోరిక. ఇది చాలా మంచి ఆలోచన అని నా ఉద్దేశం" అన్నాడు.

ఆ పూజారి మాటతో శశి విభేదిస్తూ 'నేను మంత్రసానిగానా? ఇది జరిగే పని కాదు' తనలో తాను అనుకుంది. కానీ పూజారి ముందు తన అభిప్రాయం వెల్లడి చేయలేక మౌనంగా ఉండిపోయింది.

"రాధాకీ జయహో" అంటూ ఎవరో అరవడంతో యమున ఒడ్డున ఆ మాటలు ప్రతిధ్వనించాయి. పూజారి కాలిన చితి దగ్గరికి వెళ్లాడు. తర్వాత వెనక్కి వచ్చి శశితో అన్నాడు "ఈ రోజు నువ్వు జీవితంలోని వాస్తవాన్ని ఎదుర్కోబోతున్నావు. నువ్వు సరియైన నిర్ణయం తీసుకోవల్సిన క్షణం ఇది. ప్రాణఘాతుకమైన పాపాలు, దండనీయమైన పాపాలు, క్షమార్హమైన పాపాలు అనే మూడు రకాల పాపాలకి విరుద్ధంగా హెచ్చరించడం అన్నమాట అందుకని ఇప్పుడు..."

ఆలంఘడీ చితాభస్మం యమునలో తేలుతోంది. ముందుగా అదంతా ఒకచోట కుప్పగా చేరి ఆ తర్వాత వేరుపడి ముందుకి ప్రవహించసాగింది.

"విచిత్రం. నిజంగా ఎంత విచిత్రం. దృఢమైన ఆలంఘడీ శరీరం క్షణంలో అంతరించి పోయింది" అనుకుంటూ 'ఒక్క గాలి విసురుతో ఆ వ్యక్తి శవయాత్ర చిహ్నాలు విస్తారమైన ఇసుక గర్భంలో కలిసిపోతాయి' అని భావించింది శశి.

శవ దహనం తర్వాత సంప్రదాయం ప్రకారం నదిలో మునకలు వేసింది శశి. బట్టలు తడవటంతో నీళ్లు శరీరానికి చల్లగా తగులుతున్నాయి. అయినప్పటికీ ఆమె ధీరసమీరవైపు వెళ్లిపోయింది.

గుంపులో ఆమెకి పరిచయమున్న ఓ వృద్ధ మహిళ శశితో "బహుశా ఇక మీదట నిన్ను రాధేశ్యామీలు వుండనివ్వక పోవచ్చు! ఆలంఘడీ మరణించిన విషయం అంతటా తెలిసిపోయింది. వీరయోధులు శారీరక బలప్రదర్శన కోసం ఒక చోట చేరారు. వాళ్లు పగలే భంగు దోసు వేసుకున్నారు. గోపీనాథ్ బజారుని అరటి బోదెలతో, విశాలమైన పందిరితోను అలంకరించారు. ఈరోజు సాయంత్రం అక్కడ సంగీత కచేరి జరగబోతోంది. నీకు దుర్దినాలు దాపురించాయి. మధురలోని ధూర్తులు ఆ చుట్టుపక్కలే తిరుగుతున్నారు" అంటూ హెచ్చరించింది.

అవును, ఆ వృద్ధ మహిళ అన్నది నిజమే. అతి కష్టం మీద శశి తన గుడిసె దగ్గరకి చేరుకోగానే అక్కడున్న గుంపులోని ఓ రాధేశ్యామి అరవసాగింది "నువ్వు మళ్లీ ఇక్కడికెందుకు? నువ్వు నిర్లజ్జవేశ్యవి. మా రక్తం తాగాలనుకుంటున్నావా! మేం నీలాంటి యువతుల బాధ్యత తీసుకోవడం అసంభవం. మా అంతిమ సంస్కారాల కోసం డబ్బులు నడుం దగ్గర పదిలపర్చుకున్నాం. వెళ్లు, వెళ్లి ఎనిమిది స్తంభాల దగ్గర ఆశ్రయం సంపాదించుకో. అందరూ దాన్ని 'మానవ సేవాశ్రమం' అని అంటుంటారు. లేకుంటే నువ్వు రాయ్‌చౌదరి ఆసుపత్రి వరండాలో పడుకోవచ్చు. కానీ ఎలాంటి పరిస్థితుల్లోనూ ఇక్కడ మాత్రం కుదరదు. ఆ దుష్టులు స్పృహలో లేరు.

మద్యం అతిగా సేవించడం వల్ల మత్తులో మునిగిపోయారు. వాళ్లు నీ వెనకాల పడ తారు. నీ గురించి అన్ని వివరాలు అడిగి తెలుసుకున్నారు. ఇక్కణ్ణించి వెళ్లిపో. త్వరగా వెళ్లు. ఎలాంటి ఆపదని మేం భరించలేం. మా నడుం దగ్గర డబ్బు లుం టాయని వాళ్లకి తెలుసు. వాళ్లు ఓరకంట చూస్తూ మా నడుముల మీద కన్నేశారు.. నరరూప రాక్షసులు" అంటూ శశిని బయట ఉంచి తలుపులు వేసేశారు.

శశి కొంచెంసేపు అక్కడే కింకర్తవ్యంగా నిలబడిపోయింది. షెడ్డు లోపల మహి ళలు ముక్కలు చేస్తున్న రొట్టెల వాసన వస్తోంది. 'వాళ్లు మాట్లాడిన మాటలన్నీ మోసపూరితమైనవే కాకుండా, తప్పు దోవ పట్టించేవి కూడా. వృద్ధ వికృత మహిళలు తాము దాచుకున్న డబ్బుని పరిరక్షించుకు నేందుకు ఎప్పుడూ అప్రమత్తంగా ఉంటు న్నారు. ఈ చిన్నపాటి జాగ్రత్త మానవీయ విలువల్ని, సాటిమనిషి పట్ల ప్రేమని కాల రాయటమే. ఎంతటి అర్థరహితం!' అను కుంటూ శశి నెమ్మదిగా అక్కడి నుంచి కదిలింది. తడి బట్టలతో భుజాలపైన పరుచుకున్న చిందరవందర జుట్టుతో ఆమె నిస్సహాయురాలిగా కనిపిస్తోంది. అలసిపోయిన శశి గోపినాథ్ బజారు నుంచి నీరసంగా కాళ్లీడ్చుకుంటూ నెమ్మది నెమ్మదిగా నడవసాగింది.

ఇతరులు ఎవరైనా తనలాంటి పరిస్థి తిని ఎదుర్కొన్నారా? మరెవరైనా తాను ఆధారపడ్డ వ్యక్తి శవం దహనం కాగానే తనలాగా శాశ్వతంగా నిరాశ్రయుల య్యారా? తనలాగా మరెవరైనా రోడ్డుపైకి గెంటివేయబడ్డారా? శశిలో ఆలోచనలు గూడు కట్టుకున్నాయి.

అలసటగా ఉన్నందువల్ల ముందుకి వెళ్ల కూడదనుకుంది శశి. ఏదో మెట్టులా కన బడితే దానిమీద అడుగేసిందామె. కానీ అది మెట్టు కాదు. అది పశువుల కోసం ఏర్పాటు చేసిన నీటి గొట్టం. కొంతసేపు దాని అంచుపైన కూర్చోవాలనిపించింది శశికి. కానీ వద్దు. తాను కూర్చోకూడదు. సమయం వేగంగా గడిచిపోతోంది అను కుంది. తడిబట్టలతో ఉన్న శశి వణుకు తోంది. నీటి మీద నుంచి గాలి తరంగాలు ఆమెపైన దాడి చేస్తున్నాయి. తడి బట్టలు ఆమె శరీరానికి అతుక్కుపోయాయి. ఆమెకి తల తిరుగుతున్నట్లు అనిపించింది. ఏక్షణంలోనైనా తను నడిరోడ్డుపైన పడిపో వడం ఖాయం అనిపించింది శశికి. సత్తు వనంతా కూడదీసుకుని భజనాశ్రమంలోని తెల్లటి చలువరాతి మెట్లపైకి చేరుకుంది. అవి చీకట్లో కూడా మెరుస్తున్నాయి. దగ్గ ర్లోనే ఒక షాపు కనిపించింది. అది మూసి ఉంది. అక్కడ ఎవరూ లేరు. వాతావ రణం బాగుండకపోవడంతో అంగళ్లు కట్టేసి అందరూ ఇళ్లకి వెళ్లిపోయినట్టు న్నారు అనుకుంది శశి. ఇక ముందుకి వెళ్లి పోదామనుకుందామె. కానీ వెంటనే ఏ నిర్ణయం తీసుకోలేకపోయింది.

శశిలో ఆలోచనలు ముసురుకున్నాయి. తను హరాబరీలో శరణు పొందే ప్రయత్నం చేస్తే ఎలా ఉంటుంది? లేదు అక్కడ గదులు ఖాళీగా ఉండవు. అంతేకా కుండా ఆలంఘడీ మరణించినట్లు అక్కడి రాధేశ్యామీలకి తెలుసు. అక్కడ కనీసం ఒక్క రాత్రి గడిపేందుకైనా వాళ్లు అంగీక రించకపోవచ్చు. ఈరోజు బజారు అంతా మూసి ఉంది. అందరూ సంగీత కార్యక్ర మానికి వెళ్లి ఉంటారు. పాత ఖర్జూరపు ఆకులు, పూలమాలలు అమ్ముకుంటూ రా త్రి గడిపేయవచ్చు అనుకుంది శశి. కానీ సంగీత కార్యక్రమం ముగియగానే చేతిలో టార్చిలైట్లతో రోడ్డుపైకి వస్తారు వాళ్లు. తను వాళ్లకి ఎదురుపడ్డం ప్రమాదకరంగా పరిణమించవచ్చు.

జ్ఞానగోదారికి దారితీసే రోడ్డు మొదట్లో వీధిదీపం అకస్మాత్తుగా వెలగడంతో అటు

వైపు చూసింది శశి. దానికింద ఒక వ్యక్తి కూర్చుని ఉన్నాడు. లైటు వెలగకపోవడంతో ఆ వ్యక్తి లేచి నిలబడి తన వస్తువులను సర్దుకుని ఆమె వైపు రాసాగాడు. అవును, నిజమే అతను తనవైపే వస్తున్నాడు. అతని అడుగులు తడబడుతున్నాయి. చంకలో బట్టల చుట్ట, చేతిలో మద్యం సీసా ఉన్నాయి. అది చూడగానే 'ఒంటరిగా ఉన్నప్పుడు తాగే వ్యక్తికి దూరంగా ఉండు' అని ఎవరో అన్న మాటలు గుర్తుకొచ్చాయి శశికి. వెంటనే అక్కడి నుంచి ముందుకి వెళ్లేందుకు ఉపక్రమించింది. కానీ ఆమె కదిలేలోపే ఆ వ్యక్తి సీసా, పక్కబట్టలతో అక్కడికి చేరుకుని షాపు మెట్లపైన కూర్చుండిపోయాడు. "ఎవరు అక్కడ నిలబడింది? మీకు తెలియదా ఈ నేల నాదని? ఓహ్! ఇప్పుడు కనిపిస్తున్నావు. నువ్వు అదే రాధేశ్యామివి. కూర్చో నువ్వు నిలబడకూడదు. ముసల్దానా! నేను నీ పాత ముసలి కొడుకుని. నువ్వు ఇక్కడు ఉండాలనుకుంటే ఉండు. నేను అదిగో గుర్రాలు నీళ్లు తాగేచోట సంతోషంగా పడి ఉంటా. వెళ్లు, వెళ్లి పడుకో. విశ్రాంతి తీసుకో. నేను నీ కాపలాదారుడ్ని. గూఢచారిని. చింతించకు. వెళ్లి పడుకో" అన్నడా వ్యక్తి.

తర్వాత ఆ వ్యక్తి తన మూటని విప్పాడు. ఒకటే దుర్వాసన, రాతిపైన పిల్లవాడి వాంతి లాంటిది వ్యాపించింది.

శశి ఆ వ్యక్తిని పరిశీలనగా చూసింది - ఎవరతను? తెలుసుకునే ప్రయత్నం చేసింది. కానీ అది అసంభవం. గడ్డంతో ఉన్న ఆ వింత మొహాన్ని ఎక్కడ చూసిందో గుర్తుకు రావడం లేదు శశికి.

అతను గ్లాసులో మద్యం నింపుకుని గుటకేశాడు. ఆ తర్వాత ఆ సీసాని పైకి ఎత్తి "అవ్వా! రాత్రిళ్లు మాత్రమే నాకు ప్రజలో తిరిగే అవకాశం లభిస్తుంది. ఎందుకని అని నువ్వు అడుగుతావేమో, విను. మనిద్దరి మధ్య నేను గూఢచారిని. ఇతర గూఢచారులపైన గూఢచర్యం చేయడం చూస్తావా! నేను గూఢచారులకు గూఢచారిని. ఈ సమయంలో నేను ఫూల్ తోలీ బాబా వెనక ఉన్నాను. ఫసల్ వాలీ బాబా ఊరేగింపు చూసి ఉంటావు. హోలీ పండుగ సందర్భంగా బృందావనం, మధురలో ఊరేగింపు నిర్వహించినపుడు బుక్కా రంగులు రవాణా చేసేందుకు ఆయన ఇరవై లారీలు, ఎనిమిది గాడిదల్ని వినియోగించాడు" అన్నాడు.

ఆ వ్యక్తి తన మాటల్ని కొనసాగిస్తూ "నలుదిశలా రంగులమయమయ్యాయి. స్త్రీపురుషుల పాదాల కింద, గోడల పైన, మందిరాల్లోని విగ్రహాలపైన, 'హోరెంగా'కి చెందిన వస్తాదుల భార్యలు దుస్తులపైన

## అదే పల్లవి!

ఒకసారి వేటూరి ఉదయం ఇంటివరండాలో కూర్చుని పాట రాయడానికి కలం, కాగితం పట్టుకుని ఆలోచిస్తూ అటూ ఇటూ చూస్తూ కూర్చున్నారు. అది కాఫీతాగే



సమయం కావడంతో భార్య సీతామహాలక్ష్మి 'ఏవండీ! కాఫీ ఇదుగో!' అన్నారు.

దానికాయన 'వెనుక నించుంటే నాకేం తెలుస్తుంది? ముందుకు తేవాలిగానీ' అన్నారు.

అదే ఆ పాటకు తర్వాత పల్లవిగా మారింది.

'దిక్కులు చూడకు రామయ్య.. పక్కనే ఉన్నది సీతమ్మ.. సిరిమల్లె నవ్వుల సీతమ్మ.. ముందుకు రావే ముద్దుల గుమ్మ'

అంతటా రంగులమయమే. ఎక్కడ చూసినా, ఎటు చూసినా రంగు రంగుల ధూళి. ఇంకా చెప్పాలంటే యమున విస్తారమైన ఇసుకలోకి కూడా వ్యాపించాయి ఆ రంగులు. ఇంకా పదివేల మందికి ఉచితంగా మిఠాయిలు పంచిపెట్టి విందు వినోదాలు. ఇంకా వ్యాపారుల మీటింగులు, కార్ల శబ్దాలు, వాళ్ల ఐశ్వర్యపు తళుకు బెళుకులు. మరి నేను-నేను కేవలం గూఢచారిని. గూఢచారులకు గూఢచారిని. వ్యాపారుల ఆదాయపు పన్నునుంచి రక్షణ. ఆదాయపు పన్ను శాఖ ఓ రక్షిత ప్రదేశం. ఇంకా నేను మందిర ముఖద్వారం నుండి లోనికి ప్రవేశించలేకపోయేవాడ్ని. ఎంత సిగ్గుచేటు. 'ఈసారి రథోత్సవ సమయంలో పేద, ధనిక వర్గాలు ఎవరైనా సరే, అందరికీ ఒక్కొక్క కంబళి లభిస్తుంది' అంటూ గేటు దగ్గర తుపాకీతో నిలబడ్డ సెంట్రీ ప్రకటించాడు. ఆ సెంట్రీ గతంలో సైన్యంతో పనిచేసేవాడు" అన్నాడు.

తర్వాత ఆ వ్యక్తి పగలబడి నవ్వుతూ "విశ్రాంతిగా పడుకో మామ్మా! నేను జలాశయం పక్కనే పడుకుంటాను. నువ్వు చింతించకు" అన్నాడు. తర్వాత ఆ తాగుబోతు గూఢచారి "మామ్మా! బహుశా నువ్వు ప్రేమ్‌చంద్ కథ 'ది సాల్ట్ ఇన్‌స్పెక్టర్' చదివే వుంటావు. చాలా తమాషాగా వుంటుంది. ఆ ఇన్‌స్పెక్టర్ పెద్ద జమీందారు. గొప్ప వర్తకుడయిన ఓ వ్యక్తికి సంకెళ్ళు వేస్తాడు. ఓ వ్యక్తి ఆ ఇన్‌స్పెక్టర్ని దూషిస్తాడు. నువ్వు ఈ కథ తప్పకుండా చదవాలి. నువ్వు చదవలేదా? చాలా శోచనీయం" అన్నాడు.

ఆ వ్యక్తి సీసాలోని ఆఖరి చుక్క తాగగానే మరింత ఉత్సాహవంతుడయ్యాడు. అతను తన మీద నియంత్రణ పూర్తిగా కోల్పోయాడు. ఓ రోగిలా అకస్మాత్తుగా గుంతలో పడిపోయాడు. ఆ తర్వాత పెద్ద వాంతి చేసుకున్నాడు.

ఇదే అదనుగా భావించిన శశి అక్కణ్ణించి పరుగెత్తసాగింది. పరుగెత్తుతూ ఆమె హరాబరీవైపు వెళ్లే మార్గంలో ఉన్న టీకొట్టు దగ్గరికి చేరుకుంది. గూఢమైన విషయాలకి అదొక స్థావరంగా చెప్పుకుంటారు. ఆ విషయం శశికి కూడా తెలుసు. కానీ ఈ సమయంలో అక్కడ ఎవ్వరూ ఉండకపోవచ్చుననుకుంది శశి. కానీ అది భ్రమ మాత్రమే. కొందరు చీకటి ముసుగులో వసారాలో కూర్చుని ఉండడం కనిపించింది శశికి.

చివరికి శశి మరికొంత దూరంలో ఉన్న బిహారీమోహన్‌కుంజ్ చేరుకుంది. అదృష్టవశాత్తు తలుపులు తెరిచి వున్నాయి. శశి పరుగెత్తి వెనకవైపు వేపచెట్టు దగ్గర సిమెంటుతో కట్టిన బావి దగ్గరికి చేరుకుని మృణాళిని గది తలుపు తట్టసాగింది.

"తలుపు పాతది. పైగా విరిగిపోయింది. తట్టడం ఆపండి" అంటూ ఎవరిదో కర్కశ స్వరం వినబడింది శశికి.

బాగా అలసిపోవడంతో నిలబడలేక తలుపు దగ్గరే చతికిలబడింది శశి. ఆమె దుస్తులు ఇంకా తడిగానే ఉన్నాయి. రాత్రిపూట చలిగాలి తాకిడికి ఆమె దుర్బల శరీరం వణుకుతోంది.

సరిగ్గా అదే సమయంలో ధృఢంగా లేని చెక్కతలుపు కిర్రుమంటూ తెరుచుకుంది. మృణాళిని బయటకొచ్చి చీకట్లో తొంగిచూసింది. 'తలుపు దగ్గర ఉన్నది మరెవరో కాదు శశి' అని తెలిసి ఉలిక్కిపడిందామె.

"శశీ! నువ్వా! ఇలాంటి సమయంలో ఆశ్రయం కోసమా? నేను ముందే చెప్పానుగా నువ్వు ఇక్కడ ఉండడం వీలుపడదని. పైనున్న పావురం గూడులాంటి రెండు గదుల్లోనూ ముందునుంచే ఇద్దరు రాధేశ్యామీలు ఉంటున్నారు. వాళ్లిద్దరికీ నెలకి రెండు రూపాయలకు అద్దెకిచ్చాం. కానీ వాళ్లు ఒక్క దమ్మిడీ కూడా ఇవ్వలేదు. అయినా నువ్వు అలా వణుకుతు

న్నావేంటి, జ్వరంగా ఉందా? "

"నేను ఆలంఘడీ దహనసంస్కారాలు అయిన తర్వాత బట్టలు కూడా మార్చుకో లేదు. ఎక్కడా చోటు దొరకలేదు. దయ తలచు! ఈ రాత్రికి ఇక్కడ పడుకోనివ్వు"

"నువ్వు జ్వరంతో కదలలేని స్థితిలో ఉన్నట్టున్నావు. లోపలికిరా! ఈ రాత్రికి ఇక్కడే విశ్రాంతి తీసుకో. హం ఆలంఘడి మరణించిన విషయం అందరికీ తెలుసు. రాధేశ్యామీలు నిన్ను వాళ్లతో ఉండనివ్వ రని నాకు ముందే తెలుసు. రోజు రోజుకీ మనుషుల్లో క్రూరత్వం, స్వార్థం, నిర్దయ పెరిగిపోతున్నాయి. సరే బట్టలు మా ర్చుకో. నా పక్కబట్టల చివర పొడిబట్ట ఉంది. కానీ జాగ్రత్త! గట్టిగా శబ్దాలు చేయకు. మా అమ్మ లేస్తుంది. ఆమె పరి స్థితి రోజు రోజుకీ దిగజారుతోంది. నేను రొట్టెముక్క కోసం ఇంటింటికీ తిరిగే ముందు ఆమె కాళ్లూ చేతులూ కట్టేయాల్సి వస్తోంది. ఇలా చేయాల్సి రావడం నాకు ఎంత బాధాకరమో! కానీ మరో దారిలేదు.

ఇవన్నీ ఆలోచించి ఆమెను చూసుకునేం దుకు ఓ రాధేశ్యామీని కూడా నియమిం చాను. కానీ ఇప్పుడు ఆమె పెద్దమొత్తంలో డబ్బు అడుగుతోంది. గుడి ముందుగానీ, సందులోగానీ చిప్ప పుచ్చుకుని కూర్చుంటే ఇంతకన్నా ఎక్కువే సంపాదించగలను అంటుందామె. చూడు శశీ! పై అంత స్తులో గూడులాంటి గది ఇచ్చేదాన్ని. కానీ ఇద్దరు పాపిష్టి జీవులు- వాళ్లు రాధేశ్యామీ లన్న విషయం వాస్తవమే, ఎంతోకాలంగా వుంటున్నారు. ఇప్పుడు మందిరం ట్రస్టుతో ఆకలి తీరుతుందని ఆశిస్తున్నాం. కానీ చూస్తున్నావుగా, ఇలా ఎముకలు పొడుచు కువచ్చిన దానిలా మారిపోయాను"

ఓ మూల వెలుగుతున్న నూనె దీపం మసక వెలుతురులో శశి మృణాళిని వైపు కదిలి ఆమె పక్కనే నేల మీద కూర్చుంది.

"ఉపకారమే చేశాడో, అపకారమే చేశాడో దూరంగా ఉన్న ఆలంఘడీ ఇప్పటివరకు నీకు రక్షణనిస్తూ వచ్చాడు. ఇప్పుడు అతను లేడు. ఈ వ్రజలోని మృగాళ్లు యువ వితంతవుల వాసన పసిగట్టి నీలాం టివారిపట్ల యథేచ్ఛగా వ్యవహరించవచ్చని అనుకుంటారు. నీకు సంరక్షకులు ఎవరూ ఉండరని వాళ్లకి తెలుసు. ఆ యాచక స్వాముల నుంచి కూడా నిన్ను నువ్వు రక్షించుకుంటూ ఉండాలి. నువ్వు వాళ్లతో పాటు యుగళ ఉపాసనలో పాల్గొనాల్సిం ది. కానీ అవివాహిత మాత్రమే అంటూ వాళ్లలోని కొందరు ప్రతిపాదిస్తారని నేను గట్టిగా చెప్పగలను. నువ్వు అదేతప్పు ఎలాంటి పరిస్థితుల్లోనూ రెండోసారి చేయకు. అంతకంటే ఏ సందులోనో ఆక లితో చావడం మంచిది. ఎందుకంటే సచ్ఛీలంతో మరణించడంలో కీర్తి ఉంది" అంది మృణాళిని.

శశి ఒక్కమాట కూడా మాట్లాడలేదు. ఇద్దరూ అక్కడే కాళ్లు బారజాపుకుని ఉండి పోయారు. గోపీనాథ్ బజారునుంచి వస్తున్న మధురమైన సంగీత తరంగాలు వాళ్ల చెవులకి సోకుతున్నాయి. ఆ మధుర మైన సంగీతంతో వ్రజ ప్రతిధ్వనిస్తోంది. అన్నిటినీ మించి ఎలుగెత్తి పాడుతున్న ఆ పాట శశికి నచ్చింది. గత కొద్దిరోజులుగా ఈ ప్రాంతమంతా ఆ మధురమైన పాటతో మారుమోగుతోంది. 'ఎంతో చిన్నది జీవితం, జీవించు ఈ భూమండల మంతా నీవే అన్నట్టుగా' అనే భావంగల ఆ పాట బాగున్నట్లనిపించింది మృణాళి నికి. ఎన్నో రోజులుగా పాట కచేరీవాళ్లు అదే పాటని పదేపదే వినిపిస్తున్నారు.

"మా అమ్మ కూడా బజారులో ఈ పాటే పాడేది. కానీ ఆ పాట పాడుతుండగా పండాల కొడుకులు ముందుకు వచ్చి ఆమెని ఇంట్లోకి ఈడ్చుకువెళ్లారు. ఇక్కడ చాలామందికి మా అమ్మ తెలుసు" అంది మృణాళిని.

ఆమె మాటలపట్ల శశి పెద్దగా ఆసక్తి కనబర్చలేదు. శశి ఏవో ఆలోచనల్లో నిమగ్నమయింది. తర్వాత శశి వెక్కిళ్లు పెడుతున్నట్లుగా గమనించింది మృణాళిని.

"దుఃఖించకు శశీ! నువ్వు ఓ సాహసవంతురాలివని అందరికీ తెలుసు. నీ నిజాయతీ నాకు తెలిసిందే. డాక్టర్ రాయ్‌చౌదరి నీకు సహాయపడతాడని ఎవరో అనగా విన్నాను కూడా. ఆ విషయం నీకు తెలుసనుకుంటాను. ఆయన తన కూతురి పట్ల చేసిన ఆలోచనలన్నీ మట్టిలో కలసిపోయాయి. ఆయన భార్య కూడా మంచం పట్టింది. ఆ ఈసాయి ఇక్కడకు చేరుకున్నాడు. ప్రజలో చాలామంది అతణ్ణి చూశారు. ఏడుపు ఆపు శశీ. పిడికిలి బిగించు. ధైర్యం తెచ్చుకో. ప్రపంచాన్ని ఎదుర్కో. నాకు తెలుసు నువ్వు చిన్నపాటి వస్తువుల కోసం ఖజానా లూటీ చేసేవాళ్లలో లేవని. నిన్ను వ్యాకులపరుస్తున్న విషయం ఏంటి? ప్రేమ, బృందావన నాథుడి మందిరంలోని యువస్వామిపైన ప్రేమ. ఒకవేళ నీ ప్రేమ క్షణికమైంది, దుర్బలమైంది కాకపోతే ఈ పరిశీలనకి కాలమే గీటురాయి. బంగారంలాంటి భవిష్యత్తు సిద్ధింపజేసుకో. ఆ యువస్వామి పరాకు, అశ్రద్ధ అతని రూపాన్ని కాంతివిహీనంగాని, బలహీనపర్చడంగాని చేయవు. నన్ను నమ్ము!. నేను ఏది చెప్పినా జీవితపు అనుభవాల లోతుల్లోంచి వెలికితీసినవే. లే! ధైర్యం తెచ్చుకో! కాలం ఎవరికోసం ఆగదు. నువ్వు నువ్వులాగే ఉండిపోతావు. నాకు తెలుసు. నువ్వు గడ్డిపోచకి బదులుగా ఖజానాని వినియోగించేదానివి కాదు"

ఓ మూల వెలుగుతున్న దీపం ఆరిపోయింది. అది ఆరిపోయి ఎంతసేపయిందో వాళ్లకి తెలియలేదు. చిక్కటి చీకటి వాళ్లని ఆవరించింది. జీవితంలో అతిఘోరంగా పరాజయం పాలయిన ఆ అమాయక జీవులు కటిక నేలమీద రక్షణ కోసం అన్నట్టుగా ఒకరినొకరు కౌగలించుకున్నారు. శిశువుల్లా ఇద్దరూ స్థిరమైన భవిష్యత్తు పరిణామాలపట్ల భీతిగొలిపే భావనలో ఉండిపోయారు.




**అం**ధుడైన ఠాకూర్ సాహెబు ఈమధ్య అధిక సమయం భూతకాలాన్ని తల్చుకుంటూ గడుపుతున్నాడు. వర్తమానాన్ని మరచిపోయేందుకు ఆయన గతంలోకి వెళ్లిపోతాడు. ఆయన ఆలోచనల్లోంచి తేరుకోగానే తన జీవాత్మ ప్రేతాత్మలా శరీరాన్ని వెంటాడకుండా సెలవు తీసుకుందన్న భావన కలిగేది. అలాంటి క్షణాల్లో తన దేహాన్ని శవంలా భావించుకుంటాడాయన. సోమరిగాను, భారీగాను ఉన్నప్పటికీ ప్రభావశాలి ఆయన. తన వయస్సులో ఉన్నవాళ్లని ఇలాంటి ఆలోచనలే వెంటాడుతాయా? అని వాళ్లని అడిగి తెలుసుకోవాలనుకుంటాడు. ఉపశమనంగా ఎలాంటి సమాధానం లభించదు. ఒకవేళ అద్భుతం జరిగి చూపు వస్తే తను ప్రజలోని అందరి దగ్గరకు వెళ్లి వాళ్ల ఆత్మలు వాళ్ల శరీరాలనుంచి ఇంకా ఎందుకు వదలివెళ్లలేదని అడుగుదామనుకుంటాడు.

ఒకరోజు సాయంత్రం పొద్దుపోయేంత వరకు ఆయన మెట్లమీదే కూర్చున్నాడు. ఆయన పక్కనే పిచ్చాపాటి మాట్లాడుతూ కూర్చున్నవాళ్లు ఒకరి తర్వాత ఒకరు వెళ్లిపోయారు. కొందరు వ్యక్తులు ఆనందోత్సా

హాలతో సంకీర్తనలు పాడుకుంటూ ఆయన ముందు నుంచి వెళ్లారు. ఆ వ్యక్తుల నుండి వచ్చిన పరిమళం ఆయన నాసికా పుటాలని తాకింది. ఆ పరిమళం ఆయనని గతంలోకి తీసుకువెళ్లింది.

ఆ అత్తరు పేరేంటి? మధురంగా ఉంది. తనకు పరిచితమైందిలా అనిపిస్తోంది. దానిపేరు గుర్తుకురావడంలేదు. అయితే అది పాత సంబంధాలని తిరగతోడింది. ఆ క్షణంలో ఠాకూర్ సాహెబు మంచి కండపుష్టి కలిగివున్న రెండు కాలి పిక్కల్ని చూస్తున్నాడు. వాటిని తన మదిలోంచి విదిలించే ప్రయత్నం చేశాడు. నిజం చెప్పాలంటే పవిత్రమైన గుడి మెట్ల మీద కూర్చుని ఉంపుడుగత్తెని కుదృష్టితో చూడటం పాపం. అదీ రాసలీల ఉత్సవంలో పవిత్ర నృత్యం చేస్తుండగా. ఈ పశ్చాత్తాప భావన అతడ్ని పేలవంగా నవ్వుకునేలా చేసింది.

ఒకప్పటి సంగతి. అప్పుడు ఠాకూర్ సాహెబు తన సుఖమే తప్ప తనవారి బాగోగులు మంచిచెడ్డలు ఏమాత్రం పట్టించుకోలేదు. యువకుడైన కొడుకు తనని కోప్పడ్డాడు. తనని ఓ స్వార్థపరుడిగాను, నిష్ప్రయోజకుడిగాను తూలనాడాడు. కానీ వాటిని తను పెద్దగా పట్టించుకోలేదు. సంసారం గడపడం దుస్తరమైంది. పిల్లలు చింపిరి దుస్తులతో గడపడం, భార్య తన దగ్గరున్న బంగారు వస్తువుల్ని ఒకటొకటిగా అమ్మివేయడం మొదలైంది. నిజంగా ఆ రోజులు భయంకరమైనవి. తను దాచిన విలువైన వస్తువులు, డబ్బు కొందరు స్త్రీల కోసం వృథా అయిపోయాయి. ఇదేకాకుండా.. లేదు, ఇక మరేదీ గుర్తుకు తెచ్చుకోలేడు తను. ఇప్పుడు ఆ దౌర్భాగ్యమైన ఆలోచనలు ఆయన పెదవి అంచున ఉండిపోయాయి. తాగివున్న వీర యోధులు మందిరంలోకి ఎందుకు వెళ్లాలి? రాసలీల నృత్యకారులు సుగంధభరితమైన అత్తరు పరిమళాన్ని ఎందుకు వ్యాపింపజేయాలి? దానివల్ల పాత స్మృతులు ఆందోళనకు గురిచేశాయి.

దేశ విభజన రోజుల్లోని భయంకర స్మృతులతో విచలితుడయ్యాడు ఠాకూర్ సాహెబు. గత స్మృతులలో అవి కూడా చేరిపోయాయి. ఈ స్మృతులు తారు రోడ్డు మీద టాంగా చక్రాల ఇరుసు చేసే శబ్దాల వలె అతనికి అనిపించసాగాయి.

దేశ విభజన రోజుల్లో ఠాకూర్ సాహెబు ఓ సిమెంటు కంపెనీలో పనిచేసేవాడు. వెనక్కి చూసుకుంటే విచిత్రమనిపిస్తుంది. ధూళిదూసరితమైన సిమెం టు రేణువులు శుభ్రమైన తెల్లటి బట్టలా తన వెంటబడుతున్నట్లనిపిస్తుంది. సిమెం టు దుమ్ముతో కూడిన ఆ వస్త్రం శవాలపై కప్పే బట్టలా అనిపిస్తుంది. తక్షణమే ఆయన తల మోకాళ్లపైన వాలిపోతుంది. ఈ విపత్కర కాలం బారిన పడింది అతనొక్కడే కాదు. ఉన్నతులు, బలవంతులు కూడా ఈ విపత్కర కాలానికి బలయినవారే. ఇది ఒకరి కథ మాత్రమే కాదు. గొప్ప గొప్ప అధిపతుల ప్రగతి, ఉన్నతి పతనమైన కథ.

యువరాజు దామోదర్ కూడా ఠాకూర్ సాహెబు మదిలో మెదిలాడు. ఝాన్సీ సింహాసనం అధిష్ఠించి రాజ్యపాలన చేయడానికి దామోదర్ నిజమైన వారసుడు. లక్ష్మీబాయ్ దత్తపుత్రుడాయన. అమాయక జీవి. తన చిన్నతనంలో రామ నామం రాసి వున్న చిన్న చిన్న కాగితం ముక్కల గుళికలను చెరువులో చేపలకి తినిపించేవాడు. చేపలకి రుచికరంగా వుండేందుకు పిండివుండల్ని గుళికలకి తగిలించేవాతడను. కానీ అతను కేవలం ఒక్క సంవత్సరం 'జడల బర్రె పుచ్ఛం' చిహ్నం వున్న ఎరుపు జెండాని ఝాన్సీ కోటమీద ఎగురవేశాడు. కేవలం ఒక్క సంవత్సరం మాత్రమే. ఆ తర్వాత ఆంగ్లేయుల దండ

యాత్రలో దాన్ని చింపేశారు. ఆ తర్వాత దామోదర్ ఎక్కడికో వెళ్ళిపోయాడు? లేకుంటే దామోదర్ దేశానికి రాజయ్యే వాడు. దామోదర్ పుత్రుడయిన లక్ష్మణ రావు ఇండోర్‌లోని 'ఇమిలీమార్కెట్'లో చిరిగి పేలికలైన చిన్న కోటు తొడుక్కుని, కాళ్లకి చెప్పులు లేకుండా నడిచి వెళ్లేవాడు. లక్ష్మణరావు గురించిన ఆలోచన ఠాకూర్ సాహెబుని నవ్విస్తుంది. అదే సమయంలో కళ్ళకింద ముడతలు పడ్డ చర్మం చెమ్మగిల్లిన భావం కలుగుతుంది.

దుమ్ముతో కూడిన ఆ సిమెంట్ కుప్ప ఓ తెల్లటి వస్త్రంగా రూపాంతరం చెంది పగలూ రాత్రి వెంటాడుతున్నట్లుగా అనిపిస్తుంది ఠాకూర్ సాహెబుకి. దామోదర్ అనుభవం కూడా ఇలాంటిదేనా? తనలో తాను అనుకున్నాడు ఠాకూర్ సాహెబు.

మరోసారి ఆ వృద్ధుడి తల మోకాళ్ళపైన వాలింది. అతను తన ఊతకర్రని రెండు చేతులతో బలంగా నొక్కిపట్టుకున్నాడు. తను ఎంతసేపటి నుంచి అర్ధచేతనావస్థలో ఉన్నాడో అతనికి తెలియదు. అప్పుడే అకస్మాత్తుగా రేగిన కలకలంతో ఈలోకంలోకి వచ్చిపడ్డాడు. పిచ్చిగావున్న ప్రజల గుంపు ఒకటి తనవైపు వస్తున్నట్లుగా గ్రహించాడతను. ఇంతలో ఎవరో తన చెవిలో "నీ భార్య ఇంట్లోంచి వెళ్ళిపోయింది. నువ్వు ఆమెని వెతకవా? " అంటూ అరిచినట్లైంది. ఠాకూర్ సాహెబు తన లాఠిని మరింత గట్టిగా అదిమి పట్టుకున్నాడు. అతికష్టం మీద మోకాళ్ళపైన ఉంచిన తలని పైకి ఎత్తి "ఏం జరిగింది ? ఎక్కడ జరిగింది? నువ్వు అంటున్నదేంటి? " అంటూ అరిచాడు.

"చాలా సేపు ఇక్కడ సోమరిలా గడిపేబదులు నీ భార్యపైన దృష్టి పెట్టాల్సింది. కళ్ళు ఎలాగూ లేవు. కాళ్ళు చేతులూ బాగానే వున్నాయి కదా! నీ భార్యని బయటకు వెళ్లనీయకుండా ఆపాల్సింది. పాపం, నీ కూతురు తన తల్లికోసం ఎంత నిరాశగా ఎదురు చూస్తోందో" అంటూ కొందరు వృద్ధ రాధేశ్యామీలు ఠాకూర్ సాహెబుని నిందించారు.

"గుడ్డివాడి ముందు నిలబడి నిందిస్తే ప్రయోజనం లేదు. ఆ వృద్ధమహిళ మోనీ బాబా దేవాలయం వైపు వెళ్ళిందేమో! ఎవరో దుర్మార్గుడు మహంతు ఏనుగుకి భంగు వుండలు తినిపించాడు. అది మదంతో రెచ్చిపోయింది. నిన్నరాత్రి మురళీధరుడి గౌరవార్థం జరిగిన ఊరేగింపులో మహంతు దాన్ని అతికష్టమీద నియంత్రించగలిగాడు" అంటూ ఓ వ్యక్తి తన లాఠీతో భూమిపైన చరుస్తూ వృద్ధురాలి వెతుకులాటలో నిమగ్నమైన జనంతో కలిసిపోయాడు.

ఠాకూర్ సాహెబు గొంతు తడారిపోయినట్లయింది. మరోసారి తల మోకాళ్ళ మధ్యలో వాలిపోయింది.

## అయితే శ్రమ ఫలించినట్టే!

'దొరకునా ఇటువంటి సేవ..' పాట రాసినపుడు ఆత్రేయగారు 'ఏంటయ్యా! అంత సుదీర్ఘంగా అనుపల్లవి రాశావు. ఎంత బాగా పాడేవాడికయినా ఊపిరందక ప్రాణాలు పోవాల్సిందే' అన్నారు వేటూరితో.



దానికి వేటూరి 'అయితే నా శ్రమ ఫలించింది, సన్నివేశమే అది' అన్నారు.

ఆ సమాధానం విన్న ఆత్రేయ అభినందనపూర్వకంగా ముసిముసి నవ్వులు చిందించారు.

ఠాకూర్ సాహెబుకి విషయాలన్నీ పూర్తిగా అవగతమయ్యాయి. మందిరంలో అమ్మకాలు అంతో ఇంతో కొనసాగుతాయి. క్లెయిమ్‌దారుల అతి తెలివితేటల నుంచి తనను తాను రక్షించుకుంటూ వుంటుంది మృణాళిని. జగత్ప్రసిద్ధిగాంచిన దానవుల్లా భవిష్యత్తులో తమ ముగ్గురి క్రియాకర్మల కోసం, మందిరం ట్రస్టు ద్వారా ప్రతినెలా లభించే ఇరవై రూపాయలు, కొంత భిక్ష, భిక్షాగృహాల్లో పోగుచేసిన ఎండిన రొట్టె ముక్కలతో వాళ్లు జీవిస్తున్నారు. ఆకలికి తట్టుకోలేక ఆ మహిళ ఆహారం కోసం బయటికి వెళ్ళి వుండొచ్చు. ఆ వృద్ధుడు ఇంతటి దారుణమైన పరిస్థితిని ఆ మహిళకు ఎందుకు కలిగించినట్టు?

మరోసారి ఆ వృద్ధుడికి అదే గోల, అరుపులు వినిపించాయి. లాఠీలతో నేలని తాటించడం, నేలమీద బూట్ల శబ్దాలు ఇంకా గగ్గోలు, గందరగోళం, కోలాహలం. ఆ వృద్ధుడు వణికిపోతూ శక్తినంతటినీ కూడదీసుకుని తన ఊతకర్రని ఛాతికి అదిమిపెట్టాడు.

తర్వాత మృణాళిని అరుపులు వినిపించాయి- అక్కడ గుమికూడిన జనాల వైపు చూస్తూ "ఈ గుడ్డి ముసలాడే వీటన్నింటికీ మూలకారణం. మమ్మల్నందరినీ నాశనం చేశాడు. మమ్మల్ని అర్ధాకలితో ఏడిపించాడు. తన సంపాదనలో అధికభాగం భంగు తాగేందుకు వెచ్చించాడు. ఆఖరికి ఈ పరిస్థితికి చేరుకున్నాడు"

కొన్ని క్షణాల తర్వాత తన తండ్రికి విరుద్ధంగా మాట్లాడం ఆపి మృణాళిని తన జాకెట్టు చింపి మంచుకన్నా తెల్లగా వున్న వక్షోజాల్ని బహిరంగ పరుస్తూ "మీరు చెప్పండి, నేను తల్లిని అయ్యేదాన్ని కాదా? ఒక బిడ్డకి జన్మనిచ్చేదాన్ని కాదా? నేను జీవితంలో మరేమీ చూసేందుకు వీలులేకుండా ఈ రెండు ప్రేతాలని కాపలా కాసేదానిలా ఎందుకు చేసినట్టు? మీలో ఎవరైన నాలాంటి సుఖాన్ని అనుభవించారా? కుటీరాల్లో పేదరికంతోనూ, క్షుద్బాధతోను జీవితాలని గడుపుతున్న మీరు నాలాంటి పరిస్థితిని ఎదుర్కొన్నారా? " అంది అక్కడున్న రాధేశ్యామీలతో.

తన అంతిమ సంస్కారాల కోసం తోటి వారి నుంచి డబ్బులు తస్కరించిన ఓ రాధేశ్యామి మృణాళిని దగ్గరికి వచ్చి "ముందు నీ దుస్తుల్ని సరిచేసుకో. నువ్వు చేసిన త్యాగం ఎంతో గొప్పది. నీకు ప్రశంసలు కూడా లభించాయి. వాళ్లు మరెంతో కాలం బతకరు. వాళ్ల అంతిమసంస్కారాలు నిర్వర్తించు. ఆ తర్వాత నీకు స్వేచ్ఛ లభిస్తుంది" అంటూ సౌమ్యంగా పలికింది.

"మూర్ఖుల కోసం అధికంగా త్యాగం చేయడం వల్ల ఉపయోగమేముంది? వాళ్ల బాగోగులు చూసేందుకు నీ జీవితాన్నంతా ధారపోసినట్టుగా విన్నాను. ఇక నువ్వు చేతులు దులుపుకో. నీ సుఖం నువ్వు చూసుకో" అంది మరో రాధేశ్యామీ.

మురళీధరుడి గుడి గంటలు మోగుతున్నాయి. మరోసారి జనాల గుంపు నేల మీద లాఠీలు తాటిస్తూ ముందుకి వెళ్తున్న శబ్దాలు వచ్చాయి. రాక్షసుడిలాంటి పండా ఒకడు ఆ వృద్ధురాలి జుట్టు పుచ్చుకుని ఈడ్చుకుంటూ మృణాళిని ముందుకు తోశాడు. ఆ పండా ముందుకు తోసినామె మరెవరో కాదు సాక్షాత్తు మృణాళిని తల్లి.

"ఈ ముసల్ది గోశాల దగ్గర వున్న సంపులో నీటి కోసం చూస్తూ నిలబడింది. బహుశా చాలా సేపటి నుంచి దాహార్తితో వున్నట్టుంది" అంటూ ఆ పండా వికృతంగా నవ్వసాగాడు.

రాధేశ్యామీలు కూడా అతనితో పాటు నవ్వసాగారు. ఆ నవ్వు కర్కశంగా ఉంది. మృణాళిని వెంటనే తల్లి చేయి పట్టుకుని పైకి వెళ్ళేందుకు రంగు వెలసిన మెట్లవైపు నడిచింది.

చీకట్లో కూడా మెట్లదారి వల్ల ఇబ్బంది

కలగలేదు మృణాళినికి. ఎందుకంటే ఆమెకి ఆ చుట్టుపక్కలన్నీ చీకట్లో అల వాటు పడ్డవే. ఆ కుటుంబానికి వెలుతురు చీకటి మధ్య ఎలాంటి భేదం లేదు.

చివరికి మృణాళిని ఆ చీకటి మెట్లు ఎక్కుతూ తల్లిని పైకి తీసుకెళ్ళింది. మందిరం గేటు వద్ద ప్రశాంతంగా వుంది. రాధేశ్యామీల మధ్య చిన్నచిన్న గొడవలు సద్దుమణిగాయి. శ్మశాన నిశ్శబ్దం తాండవి స్తోంది అక్కడ. దురదృష్టవంతుడైన ఆ వృద్ధుడు ముందులాగే మౌనంగా కూర్చు న్నాడు. పూర్తిగా ఒంటరిగా ఉపేక్షించబడ్డ వాడిలా అప్పుడప్పుడు యమునపైనుంచి వీచే గాలి అతని బలహీన శరీరాన్ని తాకు తోంది. అతను కేవలం పలుచని దుస్తులు మాత్రమే ధరించాడు.

ఆ వృద్ధుడు అప్పుడప్పుడు వణుకుతు న్నాడు. అతన్ని పై అంతస్తులోకి తీసుకు వెళ్ళాలన్న ఆలోచన ఎవరికీ తట్టలేదు. ఇతరుల సహాయం లేకుండా అతను కద లలేడు.

పొద్దుగూకసాగింది. క్రమంగా చీకటి ఘనీభవించసాగింది. నిస్సహాయంగా చేతిలో ఊతకర్ర సాయంతో అతను మెట్ల పైన కాలు పెట్టాడు. ఏదో ఆలోచిస్తూ అక్కడే కూర్చుండిపోయాడు, రోడ్డుపైన అనాథ బాలుడిలా.

తను ఎక్కడ వున్నానోనని ఆ వృద్ధుడు డు తన చేతిని చాచాడు. మెట్టు దుమ్ము తో గరకుగా వున్నట్టు తోంచింది. కాళ్లు జాపుకునేందుకు కాదు, కనీసం అక్కడ కూర్చోలేడు కూడా. అతను వ్యాకులప డ్డాడు. తీక్షణమైన చలికి నరాలు తెగిపో తున్నట్లుగా వుందతనికి. రాత్రి బాగా పొద్దుపోయింది.

ఆ వృద్ధుడు అక్కడ కూర్చుని ఏవో ఆశ్చ ర్యకరమైన సంఘటనల్ని ఊహించు కుంటూ తన దురవస్థ నుంచి రక్షణ లభించకపోతుందా? అని ఆలోచిస్తూ కునికిపా ట్లు పడసాగాడు. ఇంతలో అతని పక్కన ఏదో అలికిడి కావడంతో ఉలిక్కిప డ్డాడు. "ఎవరక్కడ? ఎవరు నువ్వు?" అని వ్యాకు ల స్వరంతో అడిగాడు ఠాకూర్ సాహెబు.

"మిమ్మల్ని మీ కుటీరం దగ్గరికి చేరు స్తాను. ఇదే రోడ్డుపైన సాయంత్రం మూడుసార్లు తిరిగాను. మీరు ఇక్కడే కూర్చుని వుండడం చూశాను. నాకు తెలుసు ఈ రోజు సహాయపడేందుకు ఎవ రూ లేరని" అన్నాడు ఆ అపరిచితుడు.

"కానీ బిడ్డా! ఎవరు నువ్వు? దేవదూత లా చీకట్లో నా పక్కన వచ్చి పడ్డావు"

ఆ అపరిచిత యువకుడు ఎలాంటి సమాధానం ఇవ్వలేదు.

"దీపం వెలుగులా నీ బుద్ధి ప్రకాశి స్తోంది. కానీ నువ్వు చీకట్లో పనిచేస్తు న్నావు. విచిత్రంగా వుంది" అంటూ ఠాకూ ర్‌సాహెబు లేచి నిలబడ్డాడు. లేస్తున్న ప్పుడు ఆయన మోకాలి కీళ్లు శబ్దం చేశాయి. ఆయన ఆధారం కోసం తన చేతి ని ఆ యువకుడి భుజాల వైపు చాచాడు, భుజాల బదులు బుగ్గల్ని తాకే ఉద్దేశంతో. ఆ యువకుడు ఏడుస్తున్నట్టు గ్రహించిన ఠాకూర్ సాహెబు ఉలిక్కిపడ్డాడు.

"బిడ్డా! ఏడుస్తున్నావా? నీ కన్నీటితో నా వేళ్ళు తడిశాయి. అయినా నువ్వు ఎందుకు ఏడుస్తున్నట్టు? నీ బాధ ఏంటి? బిడ్డా నాకు చెప్పు"

"నేను అన్నీ చెప్పలేను"

"ఎందుకు?"

"మీరు రాత్రి పొద్దుపోయేంతవరకు ఒంటరిగా కూర్చుని వుండడం చాలా బాధ కలిగించింది" అన్నాడు యువకుడు.

ఆ సమాధానం ఠాకూర్‌సాహెబు విచలి తుణ్ణి చూసింది. వణుకుతున్న చేతులతో ఆయన ఆ యువకుడి భుజాలని తడుము తూ అన్నాడు. 'బిడ్డా! విను ఇప్పుడునన్ను నేను చిన్న పిల్లాడిలా భావించుకునే స్థితికి

చేరుకున్నాను, మందిరంలో పిల్లాడు పూజారిగా వున్న తన తాతతో ఆడుకుంటున్న వాడిలా. కాలప్రవాహంలో నా శరీరం శిథిలమైపోయిన ఇల్లు లాంటిది. ఈ బాధలు వాస్తవాలు బిడ్డా! ఇవి చాలా విలువైనవి. ప్రతిఒక్కరికీ అనుభవం అవుతాయి. అవిచాలా ఉపయోగకరమైనవి" అన్నాడు.

వృద్ధుడు చెప్పినదంతా మౌనంగా విన్నాడు ఆ యువకుడు. అతను చిన్నవాడు కావడంతో జీవితంలోని గూఢమైన అంశాలు వ్యాఖ్యానించదగ్గ దృష్టి అతనిలో లేదు. కానీ అతను సున్నిత మనస్కుడు. అతను వృద్ధుడిపట్ల కనికరం చూపుతూ "ఇక సమయం వృధా చేయవద్దు. ఆలస్యమవుతోంది. నావెంట రండి" అన్నాడు.

అడుగులు జాగ్రత్తగా వేస్తూ ఇద్దరూ మెట్లు ఎక్కసాగారు. వాళ్ళు దుర్బలమైన పైమెట్టు చేరుకోగానే "మిత్రమా! నిన్ను ఆశీర్వదిస్తున్నాను. ఇతరుల బాధల్ని పంచుకునే సహృదయత నీకు ఎల్లప్పుడు వుండాలి. నేను ఒక శిథిలమైన వృద్ధుణ్ణి. కానీ నేను చెప్పేదాంట్లో అవాస్తవం లేదు. ఒకవేళ నేను సూచించిన మార్గంలో గనక నువ్వు నడిస్తే విచారించే పని వుండదు. అప్పుడు నీకు తెలుస్తుంది. ప్రజలో ప్రభువులతో నువ్వు కలసివున్నావని. ఆ రెండువేలమంది రాధేశ్యామీల్లా నువ్వు కూడా ఆ పరమ పవిత్ర ప్రభువు సమక్షంలో ఆనందసాగరంలో తన్మయుడివవుతావు. సరే, ముందుకు నడువు బిడ్డా. జాగ్రత్త మెట్లు ఇరుకుగా, జారుతూ, మురికిగా వున్నాయి. అలా లేకుంటే నన్ను కిందకి తీసుకు వెళ్ళాలన్న ఆలోచన రాధేశ్యామీలకి వచ్చేది కాదు. వృద్ధుడైన ఈ ఇంటి యజమాని బహుశా తన తదనంతరం వుండే వాళ్ళకి ఈ మెట్లు చాలా అవసరమని భావించి యుండడు" అన్నాడు ఠాకూర్ సాహెబు.

ఆ వృద్ధుడు మెట్లు ఎక్కడం పూర్తయ్యింది. ఆఖరి మెట్టుమీద నిలబడ్డ ఠాకూర్‌సాహెబు తన చేతిని యువకుడి శిరస్సు మీద వుంచి "బాధల్లో వున్న వాళ్ళందరిపట్ల నీ సానుభూతి ఉండుగాక" అంటూ గుసగుసగా అన్నాడు.

ఇంతలో ఠాకూర్ సాహెబుకి అకస్మాత్తుగా ఒక అసాధారణ అనుభవం ఎదురైంది. ఓ పవిత్రమైన, అద్భుతమైన వెలుగు తన కళ్ళ ముందు సాక్షాత్కరించినట్లయింది. ఆ తర్వాత ఆ వృద్ధుడు ఆ యువకుడితో "నాదోకోరిక.. నువ్వు తీర్చాలి. నాకు బాగా తెలుసు. ఓ దేవదూతలా చీకట్లో వచ్చిన నువ్వు నాకు సహాయం చేయడంలో సమర్థుడివి. చెప్పు, సహాయం చేస్తావా? "

"తప్పకుండా, నా శక్తిమేర"

"రంగనాథ ప్రభువు రథోత్సవం జరగబోతోంది. నేను దాన్ని దర్శించేందుకు సహకరిస్తావా"

"సంతోషంగా! నేను పూర్తి సమయం మీతోనే ఉంటాను"

చీకట్లో కూడా ఆ యువకుడు వృద్ధుడి పెదాల మీద చిరునవ్వుని చూడగలిగాడు. మరి ఏ ఇతర వ్యక్తి చిరునవ్వు తన హృదయాన్ని ఇంతగా గెలుచుకోగలదన్న నమ్మకం ఆ యువకుడిలో లేదు. ఠాకూర్ సాహెబు వృద్ధుడు. ఆయన ఆ రథయాత్రలో కోలాహలం, అల్లరి తప్ప వేరే ఆనందం ఏం పొందుతాడు కానీ ఇదంతా ఆ వృద్ధుడి ముందు వుంచేటంత పెద్దమనసు ఆ యువకుడిలో లేదు.

"నిజంగా నీకు ధన్యవాదాలు. ఇక నేను వెళ్ళగలను. అయితే నా విన్నపాన్ని మాత్రం మనసులో పెట్టుకో" అంటూ తన ఊతకర్రతో తడుముకుంటూ ఠాకూర్ సాహెబు పావురం గూడులాంటి తన గదిలోకి ప్రవేశించాడు, జీవించి వున్న ప్రేతం శవపేటికలోంచి కొంతసేపు బైటకి వచ్చి అటూ ఇటూ తిరిగి మళ్ళీ తన శవపేటికలోకి దూరినట్టుగా.

★ ★ ★

ఒకరోజు వేకువజామున సౌదామిని మీగడ రంగుతో వున్న ఓ పాముని తనగది లోంచి బయటకి సరసరా పాకుతుండగా చూసింది. అది దగ్గర్లోనే వున్న జనాలమధ్యగా బావిదాకా వెళ్లి అక్కడి గదిలో వున్న కంతలో దూరి అదృశ్యమయింది. పాము కనబడగానే అక్కడవున్న రాధేశ్యామీలు "ఇది చెడ్డ శకునం. ఈ రోజు ఏం ఇబ్బందో? " అన్నారు.

అవును. వాళ్లు అన్నది నిజమే. అదే రోజు ఉదయం ఆసుపత్రి ముందు ఓ మృతశరీరం కనిపించింది. ముందు రాత్రి జడివాన కురిసింది. బహుశా అతను వైద్యం కోసం వచ్చివుంటాడు. అతను పూర్తిగా తడిసి ముద్దయ్యాడు.

ఒక సన్యాసి, కొందరు రాధేశ్యామీలు ఆ శవాన్ని పరిశీలించారు. ఇంతలో వాళ్లలో ఒకరు "ఈ పవిత్ర జీవికి బంగారు పన్ను ఉంది" అంటూ ఉత్తేజంగా అరిచారు.

"బంగారు పన్నా!" గుంపులోని రాధేశ్యామీలు ఒక్కసారిగా అన్నారు, అపనమ్మకంతో వాళ్లు దగ్గరకంటా వచ్చి శరీరాన్ని పరిశీలించారు. "నా చిన్నతనంలో హరిద్వార్‌లో అస్తికలలోంచి బంగారు పళ్లు, బంగారు నాణేలు పోగుచేశాను, ప్రత్యేకించి ఒక ఏడాది పాటు. మీరు నమ్మగలరా? ఇరవై బంగారు పళ్లు పోగుచేశాను. అది కూడా ఓ వెడల్పాటి రంధ్రం వున్న జాలీ లోంచి. కానీ ఈ మధ్యన ఏ కుర్రాళ్ళయితే తీగలతో అల్లిన సన్నని జాలీ నుంచి నది అడుగున ఉన్న అస్తికల్ని పోగు చేస్తున్నారో వాళ్లలో సగం మందికి కూడా ఆ అదృష్టం కలగడంలేదు"

శవానికి బంగారు పన్ను ఉందన్న విషయం ప్రజలోని వాళ్ళందరికీ కుతూహలం రేకెత్తించింది. ఆసుపత్రి ముందు జనాలు పెరిగారు. "ప్రజ భూమిలో పవిత్రత కొరవడిందని ఎలా అంటాం? ఊడ్చే వాళ్లు ఈ శవాన్ని తీసుకెళ్ళి నదిలో పడేసేవారు. కానీ ఇప్పుడు ఆ శవానికి గౌరవప్రదమైన దహనసంస్కారాలు జరుగుతాయి. శవపేటికల్ని మోసుకువెళ్లేవాళ్లు ఇతని శవాన్ని కూడా మోసుకెళ్తారు. ఎంతటి అదృష్టం" అంటూ ఇద్దరూ స్త్రీలు మాట్లాడుకోవడం వింది సౌదామిని.

"ప్రభుత్వం డబ్బులేని రాధేశ్యామీల అంతిమ సంస్కారాల ఏర్పాట్లు చేస్తారని విన్నాను" అంది మరో స్త్రీ వ్యంగ్యంగా.

పలుచని పెదాలు, మెడ చుట్టూ గడ్డ లున్న ఓ రాధేశ్యామీ సందర్భోచితంగా అంది, "ఇవన్నీ పనికిరాని మాటలు. గత సంవత్సరం, అంతకు ముందు సంవత్సరం కూడా ఓ రక్షకభటుడు ఈ మాటలే అంటుండగా విన్నాను. కానీ అలాంటిదేమీ జరగలేదు" ఇంతలో మరో మహిళ "డాక్టరు భార్య త్వరలోనే మరణిస్తుంది. నేను ఆ రోజే చూశాను. ఎముకల పోగులావుంది" అంది.

"వితంతువైన ఆమె కూతురు, ఆ ఈసాయి ప్రేమికుడు ఆమెను మరణంవైపు నెట్టేశారు. ఏమాత్రం సందేహంలేదు"

"పూర్వజన్మలో ఎవరి భోజనంలోనో విషం కలిపి పెట్టి వుంటుంది. అందువల్లనే ఆమె అలాంటి పిల్లని కన్నది. మీరు చూడలేదా? ఆ బజారుపిల్ల ఒంటరిగా ఎలా తిరుగుతూ వుంటోందో" అంది మరో

## భలే భలే!

అమెరికా కవయిత్రి జానిస్ ఎల్ బామ్ రాయడానికి ముందు బాత్‌రూమ్‌లో అద్దం ముందు నిల్చుని ఆ రోజుకు చేయాల్సిన పనిని తనకి తాను చెప్పుకుంటుంది. తర్వాత తన డెస్కు ముందు కూర్చుని ఒకదానికి మరొకదానికి సంబంధం లేకుండా ఏవేవో విషయాలు రాసుకుంటుంది. ఆ తర్వాతగానీ అసలు రచనలోకి దిగదు!

## సగం సగం తిప్పా!



'మసక ఎన్నెలల్లే నీవు ఇసుక తిన్నె చేరుతావు..

గసగసాల కౌగిలింత గుసగుసల్లె మారుతావు..' ఈ పాట రాయించుకున్న సినిమా దర్శకుడికి 'గసగసాల కౌగిలింత' అంటే ఏంటో అర్థం కాక ఆ విషయమే వేటూరి గారిని అడిగారు.

'ఏమీలేదు.. ప్రయోగం చేశా.. 'సగం సగం' తిప్పా.. 'గసం గసం' అయ్యింది.. అది కాస్తా 'గసగసాలు' అయ్యింది' అన్నారాయన తాపీగా.

మహిళ.

ఆ తర్వాత ఆ ముగ్గురు మహిళలు దగ్గరే వున్న ఆసుపత్రిలో మనుషులు వున్నారన్న విషయాన్ని లెక్కచేయకుండా తమ దుస్తుల్ని విప్పేసి ఎలాంటి ఆచ్ఛాదన లేకుండా బావిదగ్గర స్నానం చేయసాగారు.

ఇప్పుడు వాళ్లలో స్త్రీ పురుష భేదం లేదు. ఆ భావాన్ని వాళ్ళు చాలామంది అధిగమించారు.

తన గురించి చాలామంది చెడుగా మాట్లాడుకోవడం వింది సౌదామిని. ఆమె ఏదో ఒక ప్రతిక్రియ చేసేదే. కానీ అసందర్భ ప్రేలాపనల పట్ల ఆమె మూగదైపోయింది. ఇపుడు తన పరోక్షంలో జరిగే చెడు ఆమెని అంత తేలికగా వ్యాకుల పరచడంలేదు. 'రాధా పవిత్ర రాణీ రాధాకీ జయహో' అని గట్టిగా అరుస్తూ ఆ అపరిచితుడి శవయాత్ర వుదయమే అంతిమ శ్వాస విడిచిన హరిదాసస్వామి శవయాత్రలో కలసిపోయింది. ఇద్దరి యాత్రలు కలసిపోయి నది ఒడ్డుకి సాగాయి.

తమ అంతిమ సంస్కారాల కోసం తగినంతగా దాచుకోలేకపోయిన కొందరు రాధేశ్యామీలు సిగ్గులేకుండా ఆ దివంగత జీవులపట్ల అసూయపడ్డారు.

సౌదామిని తన గదిలోకి వెళ్లిపోయింది. ఆ చిన్నగదిలో ప్రత్యేక మూలల్లో చూసింది. పాము ఎక్కడదూరి ఉంటుందో అని. గోడకున్న ద్వారబంధంపై కన్నాలున్నాయి. కానీ పాము అక్కడ ప్రవేశించిన చిహ్నాలేవి లేవు. కొన్ని బల్లులు అక్కడ తరచు కనబడుతుంటాయి. ఆమె కిటికీ తలుపులు తెరచింది. పగిలిన గచ్చుపైన పురుగుల్ని వెతికి ముక్కుతో ఏరుకుని తినడానికి కొన్ని పక్షులు గదిలోకి వచ్చిపడ్డాయి.

మహంతు ఏనుగుకు కట్టిన గంటల సవ్వడి వినిపించింది. హరిదాసస్వామి శవయాత్ర ప్రభురంగనాథుని రంగమహల్ వద్దకు చేరుకుంది. బిచ్చం ఎత్తుకునే సన్యాసులు అన్నట్టుగా పొద్దుటే పాము కనబడటం మంచి శకునం కాదన్న కథనం సౌదామినిని ఆలోచనల్లో పడవేసింది.

ఆ రోజు మధ్యాహ్నం ఆసుపత్రికి అసాధారణమైన రీతిలో జనాలు వచ్చారు. ఇంకా అక్కణ్ణించి వెళ్ళిన వాళ్లలో సగం మంది శవయాత్ర నుంచి తిరిగి రావాల్సి వుంది. మృత్యువు చురుకైన పాత్ర పోషిస్తున్నట్టుగా అనిపించింది సౌదామినికి. కొన్ని పరిచిత మొహాలు చాలా తక్కువ సమయంలో కాలగర్భంలో కలసి పోయాయి. చూస్తుంటే ప్రజలో జీవితం మృత్యువు చేతిలో చేయివేసుకుని తిరుగుతున్నట్లు అనిపించింది ఆమెకి.

తన తల్లి జీవనజ్యోతి కొడిగడుతున్నట్టుగా తోచింది సౌదామినికి. ఇప్పుడున్న విధంగానే ఇక ముందు కూడా ఆమె వుండగలదా? ఎవరో అదృశ్య వ్యక్తి ఆమె చెవిలో గుసగుసలాడినట్లు అనిపిస్తోంది, 'కాలం వేగంగా గడిచిపోతోంది. అది ఎవరికో సమూ ఆగదు' అని.

ఆ రోజు చెడు ఆలోచనలు సౌదామిని చుట్టుముట్టాయి. తను కూడా రాధేశ్యామీలతో పాటు శవయాత్రలో పాల్గొని వుండాల్సిందని అనుకుంది సౌదామిని. ఏ వ్యాపకం లేకుండా సమయం ఎలా గడుస్తుందో ఆమెకి అర్థం కావటంలేదు. తన తల్లి బాగోగులు చూసేందుకు నియమించిన రాధేశ్యామీకి సహాయపడాలా? ఆమె దగ్గర చాలాసేపు వుండాలా? లేదు, లేదు. ఇది అసంభవం. అనుకుంది సౌదామిని.

ఏదో పోగొట్టుకున్న దానిలా ధీరసమీర ఘాట్‌వైపు బయలుదేరింది సౌదామిని. మెట్లపైన, చుట్టుపక్కల ఎవరైన వున్నారేమోనని తలతిప్పి చుట్టూ చూసింది. శవయాత్ర ఆ దారిలో రాదు అని నిర్ధారించుకుంది. ఆ తర్వాత అకస్మాత్తుగా కొంతదూరంలో ఓ చెట్టు కింద పాములు పట్టేవాణ్ణి చూసింది. ఉదయాన్నే పాము కనబడడం అపశకునం అన్న కథనం చెప్పిన సన్యాసి మరోసారి గుర్తుకొచ్చాడు. ఆ పాము ఆమెకి సుపరిచితమే. ఎందుకంటే అది చాలారోజుల నుంచి తన గదిలో ఓ చీకటి కలుగులో ఉంటోంది. మొదటిసారి ఆమెకి పొడవాటి తాడు నేలమీద లాగుతున్న శబ్దం వినిపించింది. అప్పుడు తెలిసింది అది పాము అని, నిశాచరి కోసం బయటకి వెళ్ళిందని. కానీ ఆమె ఆ క్షణంలో మంత్రించినట్టుగా అయిపోవడంతో కేకలు వేయలేకపోయింది.

పాములు పట్టేవాడు ఇంకా అక్కడే వున్నాడన్న దానికి సంకేతంగా తెల్లని తలపాగా పైకి కిందకి ఊగుతోంది. మరుక్షణమే సౌదామిని అతని దగ్గరకి వెళ్ళింది. ఆ వ్యక్తి పాము చర్మం వొలుస్తున్నాడు. దాని శరీరం ఓ చేపలా చెట్టు కొమ్మకి వేలాడుతోంది. దాన్ని చూడగానే సౌదామిని అవాక్కయింది. ఆ పాము ఆమె చూసిందే. ఆమెకి బాధ కలిగింది. "పాముని ఎక్కడి నించి తెచ్చావు" అని ఆ వ్యక్తిని అడిగింది సౌదామిని.

ఆ వ్యక్తి తల పైకెత్తి చూశాడు. కానీ సమాధానం చెప్పలేదు.

"ఇది దశరథ్ అఖాడా దగ్గరవుండే ముసలి పాము కాదుగా? అడిగింది మళ్ళీ సౌదామిని.

ఈసారి అవునన్నట్టుగా తలూపాడు ఆ వ్యక్తి. "వ్రజలో ఇలాంటి పెద్ద పాము చర్మం దుర్లభం. బంగారం లాంటి వీపు మీద వెండిలాంటి ఈ చుక్కలు చూశావా? " అన్నాడు ఎంతో నమ్మకంగా.

వెలుగు కుంగిపోతోంది. సూర్యుడి కాంతిలో నది ఒడ్డున విస్తారమైన ఇసుక మెరుస్తోంది. భిక్షా గృహానికి వెళ్ళే రోడ్డుపైన నెమ్మదిగా నడుస్తోంది సౌదామిని. ఇదే యమున ఇసుకలో సౌదామిని రెండుసార్లు ఒంటరితనం అనభవించింది. దగ్గర్లోని ఒంటె చర్మపు రంగులోవున్న టెంట్ హౌస్ నుంచి ఒక పాట అలలు అలలుగా తేలి రాసాగింది. అది సౌదామిని హృదయపు లోతుల్ని తాకింది.

"ఉద్ధవా! నువ్వు మృదువుగా మాట్లాడే సందేశహరుడివి. నువ్వు మమ్మల్ని రెప్పలు మూయడం, తెరవడం చేయమన్నావు. మేం అలాగే చేశాం. మా కళ్లని తెరిచాం, మూశాం. అప్పుడు స్థిరంగా శ్రీహరి మూర్తి కనబడేది. మా చెవులకి రంధ్రం పెట్టకోవాల్సిందిగా చెప్పావు. చిక్కుపడిన వెంట్రుకలు సరిచేసుకోమన్నావు. శరీరంపైన చందనలేపనం బదులు బూడిద పులుముకోమన్నావు. నీ ఉపదేశాల వల్ల మాకు ఎలాంటి ఉపయోగం

వుంది? మా ప్రియుల విరహాగ్నిలో మేం ప్రతిరోజు సమర్పితమే. ఏ యోగులు పర మాత్మను అన్వేషించే క్రమంలో ఒక ప్రాంతం నుంచి మరో ప్రాంతానికి తిరుగు తూ వుంటారో వాళ్లు మాకు దగ్గర్లోనే వున్నారు. ఒక్క క్షణం కూడా మేం వాళ్ళని వదిలివుండలేం, చెట్టు దాని నీడలా" ఇదీ ఆ పాట భావం.

ఆ గీతం దాని భావం సౌదామిని హృద యపు లోతుల్ని తాకింది. కళ్లు చెమ ర్చాయి. 'కాలం పరుగెడుతోంది. మిత్రమా కాలం ఆగదు' అంటూ ఎవరో గుసగుసలా డినట్లని పించింది.

గతించిన తన భర్త మొహాన్ని గుర్తు చేసుకోసాగింది సౌదామిని. ఆమె స్మృతి లో అది మసకబారిపోయింది. భర్త మొ హాన్ని ఆమె గుర్తుకు తెచ్చుకోలేకపో యింది. కానీ ఆమె హృదయపు కోవెలలో ఈమధ్య నిరంతరం మరోరూపం కదలా డుతోంది. అది ఉజ్వలంగానూ, ఆకర్షణీ యంగానూ వుంది. ఆమె ఆలోచనలన్నీ ఆ రూపం మీదే కేంద్రీకృతమయ్యాయి. తన లా ఆలోచించే వాళ్ళు మరెవరైనా ఉన్నా రా? తనకి సంబంధించిన నైతిక ఆదర్శ వాదం ఇప్పుడు ఎక్కడ మాయమైనట్టు? అని పవిత్రమైన యమున ఇసుకలో కూర్చుని ఆలోచించసాగింది సౌదామిని.

అయినప్పటికీ సౌదామిని వ్రజలోనే ఉండసాగింది, ఏదో ఒకరోజు అతను వస్తాడని కనిపిస్తాడనీ నమ్మకంతో.

మధ్యాహ్నం అదే ప్రాంతానికి తిరిగి వచ్చింది సౌదామిని. ఓ రాధేశ్యామీ ఆమె దగ్గరికి వచ్చి కూర్చుంది. ప్రభువు మురళీ ధరుడికి నైవేద్యంగా సమర్పించిన పళ్ళూ శనగలతో కూడిన ప్రసాదాన్ని తాటి దొప్పలో తీసుకువచ్చిందామె. ఇద్దరూ ఆ ప్రసాదాన్ని పంచుకుని తిన్నారు. ఆ తర్వాత రాధేశ్యామీ వెళ్లిపోయింది. సౌదా మిని తన ఆలోచనల్లో మరోసారి మునిగి పోయింది. ఒంటరితనం ఆమెని తీవ్రంగా బాధించసాగింది. అయి నా సౌదామిని అక్కడే కూర్చుండిపోయింది. ఎంతసేపు అలా గడిపిందో తెలియదు. ఇంతలో ఏదో గలభా వినబడ్డంతో ఈలోకంలోకి వచ్చిం ది సౌదామిని. 'భూ తోగలి' (భూతాల సందు) ప్రాంతం నుంచి చాలామంది తన వైపు రావడం గమనించింది. ఆమె కంగారు పడింది. ఏం చెయ్యాలో అర్థం కాలేదు. లేచి నిలబడింది. వాళ్ళ డబ్బా మూతల చప్పుళ్ళు వింది సౌదామిని. వాళ్ళు ఆ ప్రాంతంలోని వాళ్లే.

"పారిపో! ఎంత వేగంగా పరుగెత్తగ లవో పరుగెత్తు. వాళ్లు రాధేశ్యామీపైన దాడిచేశారు" అంటూ హెచ్చరికగా అరి చారు ఎవరో. చుట్టు పక్కల కుర్ర రాధే శ్యామీలెవ్వరూ లేకపోవడంతో వాళ్లు వృద్ధ రాధేశ్యామీలని ఈడ్చుకువెళ్ళారు.

"రాక్షసుల్లారా! మీరు ఆకలిగొన్న మృగా ళ్ల కన్నా హీనం" వాళ్లను దూషిస్తూ అర వసాగారు కొందరు. "మీకు శాపం తగు ల్తుంది. మురుగు కాలువ చెత్తల్లారా" అంటూ మరికొందరు దూషించారు.

సౌదామిని తన చీర చెరగుతో మొహం కప్పేసుకుని నడవసాగింది. భూతోగలీ దగ్గర ఓ రాధేశ్యామీ వెల్లకిలా పడివుం డటం చూసింది. సందులో మసకవెలుగు లో ఆ మహిళ నగ్నంగా పడివుంది. ఒక చేయి ఆమె స్తనాలపైన, మరో చేయి ఆమె మర్మస్థానంపైన వున్నాయి. బహుశా తన శీలాన్ని కాపాడుకునే ప్రయత్నంలో భాగం గా ఆమె అలా చేసివుండొచ్చు, అని తన లో తాను అనుకుంది సౌదామిని.

సౌదామిని భయపడిపోయింది. ఆ తోడేళ్ల గుంపు తనవైపు కూడా రావొచ్చు నన్న ఆలోచనతో చీకట్లో పిచ్చిదానిలా పరుగెత్తసాగిందామె. శిథిలమైన గోడ వెన కనుంచి ఎవరివో మాటలు వినబడ్డాయి సౌదామినికి.

"ఇవాళ ఉదయం మత్తు ప దార్థాలని, పొగాకు కాడల్ని నానబెట్టి, నూరి లావు పాటి వుండలాచుట్టి తయారు చేసుకు న్నాడు. అతను ముఖ్యంగా ఆ వి తంతు వుల పట్ల ఆక్రోశంతో వున్నాడు. యుగళ ఉపాసన పేరుతో వాళ్ళు వివాహేతర సంబంధం పెట్టుకున్నట్టున్నారు" అన్నారు ఒకరు.

"నీకు గుర్తుందా, పురాతన కాలంలో యువతీ యువకులు తమ అవసరార్థం ఎలాంటి వాటిని అవలంబించేవారో" అన్నారు మరొకరు.

ధర్మం పేరుతో శృంగారం, హింస ప్రజ్వ లించడాన్ని నిందించాడు మరోవ్యక్తి.

సౌదామిని హతాశురాలైంది. సమయం వేగంగా గడిచిపోతున్నట్లనిపించింది. ఏ సమయంలోనైనా ఆ దుర్మార్గులు తనని బలాత్కరిస్తారేమోనన్న భయంతో ఆమె ఆందోళనగా పెద్దపెద్ద అంగలతో నడవసా గింది. ఆ పరిస్థితి ఆమెకే నమ్మశక్యంగా లేదు.




రంగనాథ ప్రభువు మహారథోత్సవం దగ్గర పడింది. కృష్ణ భగవానుడు పవిత్ర లీలలు చేసిన కదంబవృక్షం నుంచి మంచు బిందువులు రాలుతున్నాయి. భగ వంతుడితోటలో మల్లెలు అత్యధికంగా పూసి ప్రకాశంగా వున్నాయి.

రథశాల తలుపులు ముందుగానే తెరి చారు. వడ్రంగివాళ్లు రథాన్ని సరిచేస్తు న్నారు. రథం సిద్ధమైంది. సహాయకులు-ప్రవేశకులు, బ్రాహ్మణులు, వంటవాళ్ళు, ఛత్రధారులు, సాధారణ పనులు చేసే వాళ్ళు అందరూ సన్నద్ధంగా వున్నారు. కొత్త తీర్థయాత్రికుల వేటలో పండాలు చీటికిమాటికీ అక్కడికి రావడం వెళ్ళడం మొదలయ్యింది. వాళ్ళు అన్ని ప్రాంతాల నుంచి వస్తున్నారు. లుధూరియా హను మాన్, అతిల్లాచౌకీ ఇంకా మధుర జంక్షన్ స్టేషన్ నుంచి కూడా వస్తున్నారు.

ఊరేగింపు మొదలైంది. చిన్నాపెద్దా దుకాణాలన్నీ తెరిచారు. మందిర ప్రాంగ ణంలో మళ్లీ మనషులు, టాంగాల రద్దీ పెరగడంతో రోడ్డుపైన నడవడం గగనమై పోతోంది. విశేషించి గోపినాథ్ బజారులో జనసమూహం అధికం గావుంది. అప్పడ ప్పుడు మందిర ప్రాంగణంలో పురివిప్పి గొప్పదనాన్ని ప్రదర్శించిన నెమళ్ళు ఇప్పుడు తెలివిగా రాధాభాగ్‌కి తిరిగి వెళ్ళి పోయాయి. ఇప్పుడు అవి అర్జున వృక్షం నీడలో ఉల్లాసంగా పురివిప్పి నాట్యం చేయసాగాయి.

గంధపు చెక్కతో తయారుచేసిన భారీ చక్రాలుగల ఎనభై మణుగుల బరువున్న పెద్ద రథం అది. దానిని చూడడం మంగ ళప్రదం. అది కుబేరుని చైత్రరథంలా వుంది. దాని బరువుకి రోడ్డు కుంగిపోతుం దేమో అనిపిస్తోంది. కానీ అది రంగనాథ ప్రభువు రథం. అది రథాలకే రథం. అందరూ పరమపవిత్రంగా భావించే రథం. అసంఖ్యాకంగా ప్రజలు దాని ముం దు గుమిగూడారు. వాళ్ళలో అన్ని ప్రాంతాలవాళ్ళు వున్నారు. నందిగ్రామ్ లుర్సానా, ఉత్తరకాశీ ఇంకా దూరాన వున్న అయోధ్య నుంచి కూడా గుంపులు గుంపు లుగా తీర్థయాత్రికులు వచ్చారు. మందిర ప్రాంగణం జనసమూహంతో నిండిపో యింది. సందులు ఉపసందులు కూడా

జనసమూహంతో నిండిపోయాయి. రంగ నాథస్వామి రథాన్ని లాగాలన్న జీవితకా లపు కోరిక తీర్చుకునేందుకు అందరూ ఉత్కంఠ భరితంగా వున్నారు.

కచ్చితమైన గ్రహస్థితి తర్వాత శుభఘడి యల్ని ప్రకటించారు. సరిగ్గా ఆ ఘడి యల్లోనే భగవాన్ రఘునాథ్‌కీ జయ్‌హో అంటూ జయజయ ధ్వానాలతో రథాన్ని బయటికి తీసుకువచ్చారు.

'నరవలి' రీతిలో (అందులో ఒక శేరు బియ్యం చక్రం కింద వున్న సందులో ఉం చుతారు) సన్నాహం మొదలైంది. రథం కదిలింది. దానికి ఉన్న అసంఖ్యాకమైన గంటల శబ్దాలు పవిత్ర యమునానదీ తీరాన కెరటాల ధ్వనిని స్ఫురిస్తున్నాయి. అప్సరసలు, గంధర్వులతో అలంకరించిన చెక్క బొమ్మలు సజీవమూర్తులుగా దర్శన మిస్తున్నాయి. నిన్నటి దాకా ఆ చెక్క ఆకృ తులు విడివిడిగా పడివున్నాయి జలోదరం వాపుతో పీడింపబడే వృద్ధమహిళల్లా. ఇప్పుడవి మల్లె మాలలతోను, ముక్కుపుడ కలతోను, చెవిరింగులతోను, చందన లేపనం, నుదుటి మీద సిందూరపు బొట్టు తోను మెరుస్తున్నాయి.

తుపాకులు గర్జించాయి. భారీరథం రంగనాథస్వామి పవిత్రమూర్తితో నెమ్మ దిగా కదలసాగింది. గరుకుగా వున్న తా ళ్ళను లాగాలన్న బలమైన కోరికతో ప్రజ లు కెరటాలలా ముందుకు దూసుకువస్తు న్నారు. అక్కడ భయాందోళనలు చోటు చేసుకున్నాయి. తొక్కిసలాట జరిగి ప్రజ లు రథచక్రాల కిందపడి ఎక్కడ నలిగిపో తారోనని పోలీసులు ఒక వరుసక్రమంలో నిలబడి జనాలని వెనక్కి నెడుతున్నారు.

రథం ఒక్కో అంగుళం కదులుతూ ముందుకుసాగుతోంది. మధ్యమధ్యలో చక్రాల కింద ముందువైపు పెద్దపెద్ద దుంగలు వుంచి రథాన్ని ఆపుతున్నారు. వందల వేల సంఖ్యలో వున్న జనం తాళ్ళు లాగేందుకు ఒకరినొకరు తోసుకుంటు న్నారు. తాడు లాగేందుకు అందరిలోను అద్భుతమైన శక్తి వున్నట్టు అనిపిస్తోంది. ఇంకా చెప్పాలంటే బలహీనంగా వుండే ఆ రాధేశ్యామీలు ఈరోజు బలంగా వున్నారు. పోలీసులు అధికంగా మోహరించి వున్నట్టు కనిపిస్తున్నారు. కొందరు రాధేశ్యా మీలు మల్లెపూలు, పవిత్ర జలాలు పోలీ సుల మొహాలపైన చిలకరిస్తున్నారు.. హర్షోల్లాసాలకి సంకేతంగా.

వారంరోజులపాటు రంగనాథస్వామి గు డి తీర్థయాత్రికులతో నిండిపోయింది. అవ సరార్థం వచ్చినవాళ్ళు కూడా అందులో వున్నారు. ఉదాహరణకి భగవంతుడిని గ రుత్మంతుని వాహనంపైన గానీ, వెండి శే షనాగ వాహనంపైన గానీ ఎక్కించి ఊరే గిస్తారు. కదంబవృక్షం, భగవంతుని రాస లీలా వృత్తాంతాల చిత్రాలను పవిత్రమైన చెక్కతో తయారైన ఆసనం మీద ఉంచి ప్రజభూమిలో ఊరేగిస్తారు. అర్థాకలితో పొట్టనింపుకునే ఈ రాధేశ్యామీలకి తాళ్లు లాగడానికి బలం, శక్తి ఎక్కడి నించి వ చ్చాయో తెలియదు. ధార్మిక విశ్వాసం మా త్రమే ఇలాంటి శక్తిని ప్రసాదించగలుగు తుంది. దీనినే సనాతన ధర్మాన్ని నడిపిం చే అమేయమైనశక్తిగా అభివర్ణించవచ్చు

గోపినాథ్ బజారు నిర్జనంగా ఉంది. పురుషులు స్త్రీలు ఇళ్ళకి తాళాలు వేసి రథ యాత్రలో పాల్గొనేందుకు వెళ్లగా ఇంకొం దరు దాన్ని చూసేందుకు వెళ్ళారు. ఇంకా చెప్పాలంటే బిహారీమోహన్ కుంజ్ దగ్గర ఓ మూల తులసి మాలలు విక్రయించే వ్యక్తి కూడా అంగడి కట్టేసి వూరేగింపులో పాల్గొనేందుకు వెళ్ళాడు.

చాలా సేపటి వరకు ఠాకూర్ సాహెబు మెట్లపైన కూర్చుండిపోయాడు. ఇద్దరు రాధేశ్యామీలు ఆయనను మేడ మీద నుంచి కిందికి తీసుకువచ్చారు. ఆ వృద్ధుడి కోరికను తిరస్కరించేందుకు ఈరోజు

వాళ్ళకి మనసొప్పలేదు. అంధుడైన ఆ వృద్ధుడు తుప్పుపట్టిన రేకుపెట్టెలోంచి ఒక జత జోధ్‌పురి బట్టలు బైటకి తీశాడు. ఒకప్పుడు ఆయన ఇష్టపడ్డ దుస్తులవి. వాటిని ధరించేందుకు అతనికి ఇద్దరు రాధేశ్యామీలు సహాయపడ్డారు.

"ఈ కోటు బాగా వదులుగా ఉంది. ఇది నీకు భారంగా వుంటుంది" అన్నాడు ఆ దారినపోయే ఓ వ్యక్తి.

"అవును గతంలో నా ఛాతీ ముప్పై ఐదు అంగుళాలు ఉండేది" అంత బాధలోనూ గర్వంగా చెప్పాడు ఠాకూర్ సాహెబు.

"సాహెబు! మీరు ఊరేగింపు చూడ్డానికి బయలుదేరారు. కానీ తీసుకువెళ్ళేదెవరు? ఈరోజు ప్రతి ఒక్కరూ రథాన్ని లాగేందుకు ఉత్సాహం చూపిస్తున్నారు. పురుషులు, స్త్రీలు అందరూ వెళ్ళిపోయారు. నీ దగ్గర ఎవరుంటారు? " అడిగాడు ఓ పాత పరిచయస్తుడు.

వృద్ధుడు సమాధానం చెప్పలేదు. కానీ ఆయన సంస్కృత శ్లోక పాదం ఒకటి చదివాడు. దాని సారాంశం- వార్ధక్యం సమీపిస్తున్నా వెంట్రుకలు నెరసిపోయినా, చేతులూ కాళ్ళూ ఆడకపోయినా కూడా కోరికలు యౌవనంగానే ఉంటాయి.

ఆ మాటలు అక్కడేవున్న కొందరు రాధేశ్యామీలను ప్రభావితం చేశాయి. ఠాకూర్ సాహెబ్‌లో ఉత్సాహం కలిగింది. దాంతో ఆయన రెండోపాదం గొణిగినట్టుగా చదివాడు. దాని అర్థం- జీవితాన్ని పేదరికానికి దూరంగా బాగా గడిపిన ఒక జ్ఞానికి బిచ్చమెత్తుకునే పరిస్థితులు వస్తే ఆయన జీవితం, సంపాదించిన జ్ఞానం మధ్యన ముందుగా ఏది విడిపోతుందోనన్న సంఘర్షణ నెలకొంటుంది.

ఓ వృద్ధ రాధేశ్యామీకి అతనిపట్ల జాలికలిగింది. "నీకు చూపు వుండి వుంటే ఈ రోజు నీ మనస్సుకి సంతృప్తి కలిగేదాకా భగవంతుని ఉదయ దర్శనం తిలకించి




అమెరికా కాల్పనిక రచయిత, జర్నలిస్టు అయిన అలెగ్జాండర్ చీ తను రాసుకునేప్పుడు ఎవరికీ కనపడకుండా ఉండేందుకు జాగ్రత్తపడతాడు. ఆ సమయంలో ఎవరైనా తనను చూస్తే రచనకు ఇబ్బంది కలుగుతుందని ఆయన భయం!

ఆనందపడేవాడివి" అంది సానుభూతిగా.

"నాకు ఎలాంటి విచారం లేదు" అంటూ ఠాకూర్ సాహెబు "నా కళ్ళు లేని లోటుని చెవులు పూరిస్తాయి. నేను ఆ భారీ చక్రాల డబడబలు వినగలను. కెరటాల్లాంటి మురళీధరుని పవిత్రమైన నవ్వులను విని ఆనందించగలను" చెప్పాడు.

ఆ వృద్ధుడు అకస్మాత్తుగా రాధేశ్యామీ వైపు వేలు చూపిస్తూ "నేను ఈ రోజు మధురలోని స్వామి పదఘట్టనల ధ్వని విన్నాను గర్జిస్తున్నట్టుగా" అంటూ ఆవేశంతో ఊగిపోయాడు.

ఆ వృద్ధుడితో ఇంకేమాత్రం మాట్లాడకూడదనుకుంది రాధేశ్యామీ. ఆమె రథోత్సవంలో పాల్గొనాలనుకుంది.

"ఈ పాటికి ఆ రథం కూడలి వద్దకు చేరుకుని వుండొచ్చు" అన్నారొకరు.

"అవును వచ్చేవుంటుంది. పదండి మనమూ అక్కడికి వెళ్దాం" అన్నారు మరొకరు.

ఆ తర్వాత ఆ రాధేశ్యామీ వృద్ధుడితో అంది, "వృద్ధ మహాశయా! నిన్ను ఆ తోపులాటకి దూరంగా తీసుకువెళ్ళి ఆ కదంబవృక్షం కింద కూర్చోబెడతాం. అక్కణ్ణించి దుంగలు చక్రాల ముందు పెట్టే శబ్దాలని వినవచ్చు. కానీ అక్కడ నిన్ను కనిపెట్టుకుని వుండడం కుదరదు"

"లేదు, నా బిడ్డల్లారా! నన్ను ఎక్కడికీ తీసుకెళ్లాల్సిన అవసరం లేదు. నన్ను ఇక్కడే వుండనివ్వండి. మీరు ఎక్కడికి



వెళ్ళాలనుకుంటే అక్కడికి వెళ్ళండి. నాకు సహాయపడేందుకు నా మనిషి వున్నాడు"

"నీకు సహాయపడ్డానికి వచ్చేదెవరూ? ఆ మురళీధరుడే స్వయంగా వస్తాడా?" వాళ్ళంతా హేళనగా నవ్వారు.

సమయం గడుస్తోంది. గోపీనాథ్ బజారు దాటిన తర్వాత పరుగెత్తసాగారు రాధేశ్యామీలు. గుర్రాల సంపులో కూరల వర్తకులు సగం సంచీడు పాడైపోయిన బంగాళాదుంపలు పడేసి వెళ్ళారు. అదే మరో రోజు అయివుంటే రాధేశ్యామీలు వాటిపైన విరుచుకుపడేవాళ్ళు. కానీ ఆ రోజు అలా జరగలేదు. ప్రతిఒక్కరికి సమయం గడచి పోతున్న భావన కలగసాగింది.

బాంకే బిహారీ మందిరంలోని భ్రష్టాచారాల వివరాలతో వున్న పోస్టర్లు పంచుతున్నారు. వాటిని పంచేందుకు బహుశా ఎవరో ఆసక్తిగా వున్నట్లు అనిపిస్తోంది. కానీ వాటివైపు చూసేందుకు ఎవరికీ క్షణం తీరికలేదు.

ఠాకూర్ సాహెబు ఊతకర్రని గట్టిగా అదిమి పట్టుకుని సాయంకాలపు యువమిత్రుడికోసం నిరీక్షించిసాగాడు. కానీ ఆ యువమిత్రుడు రాలేదు. ఈ మధ్యలో ఊరేగింపు దూరంగా వెళ్ళిపోవడంతో కోలాహలం సద్దుమణిగింది.

అతను వ్యాకులపడ్డాడు. తన చుట్టూ నీరవమైపోయింది. నిధువన్‌లోని బ్రాహ్మ



ణ యువకుడు ప్రార్థనలు చేస్తూ 'ఘాంజ్' (తాళం) వాయిస్తూ ఆ వృద్ధుడ్ని దాటుకుని వెళ్ళిపోయాడు.

'బహుశా ఆ యువకుడు మర్చిపోయి వుంటాడు. అన్నిటినీ మించి అతను యువకుడు. ఇందులో ఆశ్చర్యపడాల్సిన పనేం లేదు. బహుశా తను ఇచ్చిన మాటను మర్చిపోయి వుంటాడు' అని తనలోతాను అనుకున్నాడు ఠాకూర్ సాహెబు.

ఆ తర్వాత ఠాకూర్ సాహెబుని భూత కాలపు అంధకారం విసిగించసాగింది. అప్పుడప్పుడూ సమయం కూడా కఠినంగా ఉంటుందన్న విషయాన్ని ఎవరూ ఖండించలేరు. కుట్ర కుతంత్రాలు నిరూపితమౌతాయి. మానవుడి పరివేషం అతడిని క్రూరంగాను, తటస్థంగాను మార్చివేస్తుంది. ఇలా కాకపోయివుంటే మృణాళిని కూడా రాధేశ్యామీల్లా జీవితంలో ఇంత త్వరగా తన అంతిమ సంస్కారాల కోసం అంత కఠినంగా మారివుండేది కాదు. తన తండ్రి ఓ లోభి అని ఆమెకు తెలియపరచనక్కలేదు. దీన్ని వాస్తవంలో క్రూరత్వం అంటారా? తర్వాత తాను ఎంతో త్వరగా భూతకాలంలోకి జారిపోతాడో అంతే త్వరగా వర్తమానంలోకి వచ్చేస్తాడు. దూరంగా మోగుతున్న రథం గంటల శబ్దాలు అతని చెవులకి సోకుతున్నాయి. మధురమైన ఆ ఘంటారావం తన చెవిలో

చెబుతున్నట్టుగా అనిపించింది, 'ఒకవేళ ఇతరులకు సహాయపడే అవకాశం నీ దాకా వస్తే ఆఖరిక్షణం వరకూ దాన్ని ఉప యోగించుకో' అని. ఇందుకు అనుగు ణంగా ఏవేవో శబ్దాలు, ఎక్కడి నుంచో తేలియాడుతూ వస్తున్న సుగంధ ద్రవ్యాల పరిమళాలు, అమూల్యమైన వచనాలు అతని చెవిలో గుసగుసలాడాయి.

మరోసారి రథాన్ని ఆపుతున్న దుంగల శబ్దాలు వస్తున్నాయి. గంటలన్నీ సాము హికంగా నెమ్మదిగా మోగాయి. వృద్ధుడు మరింతగా అస్థిరమయ్యాడు. సరిగ్గా అదే సమయంలో ఎవరివో పదధ్వనులు విని పించాయతనికి. అతను తన ఊత కర్రని మరోసారి గట్టిగా అదిమి పట్టుకున్నాడు ఉత్సుకత నిండిన కోరికతో.

ఆ యువకుడు వచ్చేశాడు. "దయచేసి నిలబడండి. నాతో రండి" అన్నాడు వృద్ధు డికి ప్రశాంతత చేకూరేలా.

"అరె! నువ్వు ఇక్కడున్నావా! నాకు తెలుసు నువ్వు తప్పకుండా వస్తావని" అంటూ ఊతకర్ర చివర పట్టుకోవలసిం దిగా వృద్ధుడు ఆ యువకుడ్ని కోరాడు. ఆ యువకుడు అలాగే పట్టుకుని ముసలాయ నికి ఆసరాగా ముందుకు నడిచాడు.

వాళ్లు మౌనంగా గోపీనాథ్ బజారులో నడవసాగారు. నిజంగా అది ఓ మనోహర దృశ్యం. యువకుడు ఒక వృద్ధునికి దారి చూపుతున్న దృశ్యం.

ఆ బ్రహ్మాండమైన రథం కూడలిలోని పోలీసుపోస్టు దగ్గరికి చేరుకుంది. "మీరు వణుకుతున్నారు. నన్ను గట్టిగా పట్టు కోండి. మీరు రథం దగ్గరకంటా వెళ్తారా? ఈ దిబ్బమీద నిలబడతారా?"

ఠాకూర్ సాహెబు పెద్దగా అరుస్తూ "నన్ను దాని దగ్గరకంటా తీసుకువెళ్ళు. గంధపు చెక్కతో తయారైన ఆ అద్భుత ర థాన్ని స్పృశించి ఆనందిస్తాను" అన్నాడు.

ఆ యువకుడు కొంతసేపు మౌనం దా ల్చాడు. అతని మౌనాన్ని ఛేదిస్తూ వృద్ధుడు అన్నాడు, "జనాలతో నిండిన ఆ విశాల సముద్రంలోకి నన్ను తీసుకువెళ్ళడా నికి సంకోచిస్తున్నట్టున్నావు. కానీ ఇక ఏ మాత్రం నిరీక్షించకు నా బిడ్డా. రథం కూడలి మలుపు తిరిగి తోటవైపు సాగిన ప్పుడు ఇంకా జనసమ్మర్దం పెరిగిపోతుం దని అంటుంటారు"

ఆ వృద్ధుడు, ఆ యువ మార్గదర్శి ముందుకు కదిలారు. ఎముకల గూడు లాంటి రాధేశ్యామీల శరీరంలో అకస్మా త్తుగా అత్యధిక శక్తి వచ్చినట్లుగా అనిపిం చిందా వృద్ధుడికి. ఆ యువకుడి నిస్స హాయ అభ్యర్థనలని తోసిరాజని ఠాకూర్ సాహెబు తన ముందున్న గుంపును రెం డు పక్కలకి తోసేస్తూ ఒక్కొక్క అడుగు ముందుకు వేయసాగాడు. తోడుగావున్న ఆ యువకుడి చేతిని విదిలించుకుంటూ. ఆ జనప్రవాహాన్ని తట్టుకునే శక్తి లేక ఆ వృద్ధుడు ఎన్నోసార్లు కిందపడిపోయాడు. అతని పాత జోధ్‌పురి కోటు కూడా చిరిగి పీలికలైంది. అయినా అతను దాన్ని ఒడిసి పట్టుకున్నాడు, తల్లి బిడ్డని ఛాతికి హత్తుకు న్నట్టుగా. ఆ వృద్ధుడు నడుస్తూ నడుస్తూ రథం దగ్గరకంటా చేరుకున్నాడు. చుట్టు పక్కల పరిసరాలలో, వ్యాపించిన ధూపం, మల్లెల గుబాళింపు ఆఘ్రాణించసాగాడు.

పవిత్ర రథాన్ని తాకడం, దానిమీద శిర స్సువుంచి నమస్కరించడం దానిని వీక్షిం చడం ఓ గొప్ప అదృష్టంగా భావిస్తారంతా. ఆ అదృష్టం కొందరికే దక్కుతుంది. అంద రూ తోసుకుంటూ ఆ పవిత్ర రథం సమీ పానికి చేరుకునే ప్రయత్నం చేస్తున్నారు.

ఠాకూర్ సాహెబు కూడా దృష్టి లోపాన్ని అధిగమించి నిస్సత్తువని లెక్కచే యకుండా అలాగే చేశాడు.

మళ్ళీ రథచక్రాలు తిరగసాగాయి. అరు పులు, కేకలు, గలభా, కలకలం మొదల యింది. జనసముద్రం ముందుకు కదిలిం

ది. ఆ వృద్ధుడు, ఆ యువ మార్గదర్శి ఏ క్షణంలోనైనా ఆ జనప్రవాహం తమని తొక్కేస్తుందేమోనని భయపడసాగారు. ఇంతలో మరోవైపు నుంచి కూడా భక్తుల గుంపు ఓ వెల్లువలా రాసాగింది. దాంతో ఆ యువకుడు ఇక ముందుకి వెళ్ళడం భావ్యం కాదని తిరిగి వెళ్ళిపోదామని ఠాకూర్ సాహెబుని అనునయించసాగాడు. కానీ అతను ఆగుతూ, తడబడుతూ జనంలో కలిసిపోయాడు.

కానీ ఆ యువకుడికి అతికష్టం మీద తెలిసింది జరిగిన విషయం. ఆ వృద్ధుడు ఓ బాణంలా రథంవైపు దూసుకుపోయాడు. ఆ వృద్ధుడు ఏం చేయబోతున్నాడోనని ఆ యువకుడు అతడిని పట్టుకునే లోపలే ఆ వృద్ధుడు పూర్తిగా చక్రాల కింద పడి నలిగిపోయాడు.

అతని శరీరాన్ని బయటకు లాగారు. ఆ వృద్ధుడు కొనవూపిరితో కొన్ని ఘడియలు మాత్రమే ఉన్నాడు. రథంనుంచి విసి రేసిన మల్లె మాలలు అతని శరీరాన్ని కప్పివేశాయి. క్షణంలో ఆ వృద్ధుడు వాటిని తన తలపైన పెట్టుకునే బలహీన ప్రయత్నం చేశాడు. ఆ పవిత్ర దృశ్యం అక్కడున్న వాళ్ళని నిశ్చేష్టులని చేసింది. అంత గలభాలో కూడా కొందరు అతని పట్ల విచారం వ్యక్తపరిచారు. కొందరు అతని పెదాలపైన సంప్రదాయ ప్రకారం తులసి తీర్థం వేయడం కనిపించింది.

ఆ వృద్ధుడు రంగనాథుడి రథచక్రాన్ని చుట్టుకుపోయాడు. దాంతో అతను పవిత్ర జీవి అని అందరూ ప్రశంసించారు. తరువాత వాళ్ళు అతని శరీరాన్ని పక్కకి జరిపారు. చక్రాలతోపాటు అందరూ ముందుకు కదిలారు.

రథయాత్ర కొనసాగింది. ఎందుకంటే సమయం వృథా కావటానికి వీలు లేదు. సమయం గడుస్తోంది. ప్రతిక్షణం విలువైందిగా భావిస్తారు. అనుకున్నట్టుగా రథయాత్రని పూర్తి చేయాలి. ఒక్క క్షణం వృథా చేయడమంటే దేశానికి, ప్రజలకి అరిష్టం. బీదరికం, జబ్బులు, ఇంకా చెప్పాలంటే మృత్యువుని ఆహ్వానించడమే అవుతుంది. చివరికి ఠాకూర్ సాహెబు రక్తధారలతో విశాల రథచక్రాలు తిరుగుతూ వెళ్ళిపోయాయి.




అనుపమ ఆరోగ్యం క్షీణించసాగింది. రాయ్‌చౌదరి దిగులు చెందారు. అతని డబ్బంతా కరిగిపోయింది. ఆయనకు దాని ఆలోచన నిమిత్తమాత్రమే. వీటన్నింటినీ ఆయన భార్య చూసేది. ఆమె జబ్బుపడిన తర్వాత లెక్కాడొక్కాలాంటివి లేకుండా పోయాయి.

మునుపటిలా రాయ్‌చౌదరి రోగులకి సహాయమందించలేకపోతున్నాడు. ఒక రోజు ఆసుపత్రిలో కూర్చుని వుండగా 'అయోధ్యగవీ' వెనకవైపు సందులో ఓ వ్యక్తి అంతిమ క్షణాలు లెక్కిస్తున్నట్టుగా తెలిసింది. మల్లెమాల తప్పించి అతని శరీరమంతా నగ్నంగా వుందని ఎవరో చెప్పారు. కానీ డాక్టరు ఎలాంటి ఆసక్తి చూపలేదు. అదే గతంలో అయితే ఆయన ఆ రోగికి పరిచర్యలు చేసేందుకు అతడ్ని తన ఆసుపత్రికి తీసుకువచ్చేవాడు.

ఒక రోగి బనాఖండ్‌లోని భగవాన్ మహదేవ్‌జీ గేటు దగ్గర పడివున్నాడని మరో వ్యక్తి చెప్పాడు. రోగిని చూసేవాళ్ళు

ఎవరూలేరు. ఎన్నో రోజుల నించి ఎవరూ నీటిచుక్క పోయలేదు. అన్నిటికన్నా దుర దృష్టకరమైన విషయమేమిటంటే ఏ చెట్టు కిందయితే ఆ వ్యక్తి పడివున్నాడో దాని మీదే గాయపడ్డ రెక్కలతో కురూపి అయిన గద్ద ఒకటి తన అనుచరుణ్ణి కలిసేందుకు ఏర్పాటు చేసుకుంది. ఇది కేవలం బాధాకరం భయంకరమైంది మాత్రమే కాదు, సిగ్గు చేటైన విషయం కూడా. మానవ జాతికంతటికి అవమానకరమైంది. ఇదంతా తెలిసినా రాయ్‌చౌదరి ఏమీచేయలేదు.

అనుపమ సేవకోసం నియమించిన రాధేశ్యామీ, సౌదామిని తన తల్లిని ఉపేక్షించడాన్ని ఆక్షేపిస్తూ "నువ్వు మీ అమ్మదగ్గరికి ఎందుకు వెళ్లవు? నువ్వు ప్రేమ, అనురాగం ఆప్యాయత ఎందుకు కనబరచలేవు? అలాచేస్తే ఆమె మరికొంత కాలం బతుకుతుంది కదా! ఆమెకి సమయం కేటాయించడం నీ చేతుల్లోనే వుంది. దానిక్కావలసింది ఆమె చెప్పినట్లుగా నువ్వు నడుచుకోవడమే. నువ్వు చేయవల్సింది అదే! నువ్వు అలా చేయడం మంచిది. నేను చెప్పేది అర్థమవుతోందా? " అంది.

ఆ రాధేశ్యామీ చెబుతుండగా అనుపమ మొహం సౌదామిని పట్ల ఏవగింపుతో వికృతంగా మారింది. సౌదామిని ఒక్క మాట కూడా మాట్లాడకుండా రాధేశ్యామీ చెప్పిందంతా వింది. తల్లి ఘోరమైన తిట్లు భరించడం అసాధ్యమని సౌదామినికి తెలుసు. అందుకనే నిగ్రహించుకుంది.

"కొన్ని రోజులే! ఆ తర్వాత ఈ భూమండలంలోని ఏ శక్తీ మీ అమ్మని ఆ పలేదు. తర్వాత నీ యిష్టమొచ్చిన చోటకి నువ్వు వెళ్లొచ్చు. నీ యిష్టప్రకారం పెళ్లిచేసుకో. ఈసాయి, ముస్లిం, సిక్కు, పంజాబీ, నువ్వెవరు కావాలనుకుంటే వారిని. కానీ ప్రస్తుతం మీ అమ్మకి ఉపశమనం కలిగించు. ఆమెని ప్రశాంతంగా వెళ్లిపోనీ" అంటూ ఆ మహిళ సౌదామినికి ఉద్బోధ చేసింది.

డాక్టర్ రాయ్‌చౌదరి చాలా బాధపడుతున్నాడు. ఎన్నోరోజుల నించి కాళ్లీడుస్తున్నట్టుగా నడుస్తున్నాడాయన. ఆయన కళ్లు తన కాలిపంజా మీదే వుంటున్నాయి. స్వభావసిద్ధంగా మితభాషి అయిన రాయ్‌చౌదరి ఇప్పుడు ఎవరు ఎదురుపడ్డా చూడ్డానికి సంకోచిస్తున్నాడు.

ఆ పరిస్థితి ఎంతోకాలం సహించలేనట్లుగా భావించింది సౌదామిని. కాలం దూసుకుపోతోంది. ఇదే సమయంలో ఆమె భర్త ప్రాణస్నేహితుడు వ్రజభూమికి వచ్చారు. సౌదామిని అతణ్ణి కలిసి చాలాకాలమైంది. అతను రావడం తనని చూడకుండానే నిరాశతో వెళ్లిపోవడమూ జరిగింది. తానిక నిరీక్షించలేకపోతోంది. అతణ్ణి కలవాల్సిందే. సమయం గడుస్తోంది. రెక్కలున్న బాణంలా ఆమె స్థితి వేగవంతమౌతోంది.

ఉదయాన్నించే ఆకాశం నల్లబడింది. ఇప్పుడది లేత గోధుమవర్ణాన్ని సంతరించుకుంది. మధ్యాహ్నం పెద్దవర్షం పడింది. అకాలవర్షమది. పిల్లలతో పైకప్పు మీద ఆడుకుంటున్న ఆడనెమలి రక్షణ కోసం గూటిలోకి వెళ్లింది. తడిసిన ఆడపక్షి రెక్కలు పచ్చగా మెరుస్తున్నాయి. ఆ పక్షి పిల్ల లేతగోధుమవర్ణపు బాతుపిల్లలా వుంది.

వర్షం, వివర్ణమయిన ఆకాశం సౌదామిని మదిలో భయంకర ఏకాంతాన్ని అధికం చేశాయి. ఆమె తనలాంటి పరిస్థితి ఎవరికైనా అనుభవంలోకి వచ్చిందా అంటూ రెండువేల మంది రాధేశ్యామీలని అడగడం మొదలుపెట్టింది.

వర్షం తగ్గుముఖం పట్టింది. అయినా ఆకాశం మేఘావృతమై వుంది. తాను మరో ప్రయత్నం చేయాలా? తనను తాను ప్రశ్నించుకుంది సౌదామిని. గతంలోనూ చాలామంది తమ లక్ష్యాన్ని ముందే పొందగలిగారు. తనని ప్రేరేపించేందుకు ఆమె ముందు కొన్ని ఉదాహరణలు వున్నాయి. ఈ ఉదాహరణలు బంగారు

చట్రంలో బందించేంత యోగ్యమైనవి. ఆత్మత్యాగంతో కూడిన కథలూ చాలా వున్నాయి.. వ్రజ ప్రజల కోసం శాశ్వత ప్రాచీన కథలుగా మారిపోయాయి.

సాధారణంగా సమయపాలన, మనస్ఫూర్తిగా చేసే ప్రయత్నాలు అనేక మార్పుల్ని తీసుకొస్తాయని విశ్వసిస్తారు. సౌదామిని ఆలోచనలో పడింది. పతిత యువతుల్లో ఒకరిగా తను భావిస్తోంది. జీవితంలో అన్నీ పోగొట్టుకున్నాక కూడా అంతటినీ నష్టపరిచే ప్రేమలో తనను తాను సమర్పించుకోవాలనుకుంటోందామె. ఆమె ప్రేమ సంఘర్షణ సుప్రతిష్ఠితమైన ఉదాహరణ. గొప్ప ఆత్మబోధకి ప్రతీక. జీవన్మృత్యువుల సంధి ఈ ప్రేమ. ఆమె తప్ప మరెవరైనా ఈ వ్రజభూమిలో ఉంటూ తన స్వర్గీయ భర్త మూర్తిని మదిలోనే మసకబారే ప్రయత్నం చేశారా? ఒకసారి ఆమె ఓ ప్రౌఢ రాధేశ్యామీని కలిసింది. ఆమె అప్పటికే గోపేశ్వర్ శిలపైన పాలాభిషేకం, మారేడుచెట్టు చుట్టూ ప్రదక్షిణ కూడా పూర్తిచేసింది. తాను ఆమెని మరెన్నో సందర్భాలలో కూడా కలిసింది, భజనాశ్రమంలో, భిక్షాగృహంలో, యమునలో స్నానమాచరిస్తుండగా. ఒకరోజు ఎంతో నమ్మకంగా ఆమెని అడిగింది. "నీ మదిలో నీ భర్త జ్ఞాపకాలు పూర్తిగా చెరిగిపోలేదని అనిపిస్తోంది. నిజం చెప్పు.. ఇన్ని సంవత్సరాల తర్వాత కూడా నీ భర్తని మరవటానికి ప్రయత్నం చేయలేదా?"

తన ముందు ఈ రకమైన ప్రశ్న, అది కూడా సౌదామిని ద్వారా రావడం విస్మయం అనిపించింది ఆ మహిళకి.

"ఎప్పుడైనా ఆ జ్ఞాపకం మరుగుపడుతోందన్న భయం కలిగితే నేను తిరిగి దాన్ని పునశ్చరణ చేసి పునరుద్ధరిస్తాను"

"మరి నీ వాంఛల సంగతి..."

ఆ యువతి సౌదామిని మొహంలోకి సూటిగా చూసింది. ఆమె కళ్లు చెమర్చాయి. సౌదామిని ఆమె రెండు చేతుల్ని తన చేతుల్లోకి తీసుకుంటూ "నిజం చెప్పు. నువ్వు ఆ పాత ప్రేమని నీ స్మృతి అగాధంలోంచి తవ్వి వెలికి తీసే అనుభూతిని పొందుతావా?" అంది.

ఆ యువతి కళ్లు పెద్దవి చేస్తూ ఆశ్చర్యంతో సౌదామిని వైపు చూస్తూ మరుక్షణంలోనే నిస్సహాయంగా నదివొడ్డున మెత్తటి ఇసుకలో జారినట్టుగా సౌదామిని భుజాల మీద వాలిపోయింది.

సౌదామిని కూడా చాలా బాధపడింది. ఆమె కళ్లు అశ్రుపూరితాలయ్యాయి. కానీ

## తారుమారు తక్కడిమారు!

ఇద్దరు దర్శకులు చెప్పిన సన్నివేశాలకు తగినట్టుగా వేటూరి రెండు పాటలు రాసి ఇంట్లో టేబుల్ మీద పెట్టి బయటికి వెళ్లారు. ఆయన లేని సమయంలో దర్శకులు వచ్చి ఆ పాటలు తీసుకువెళ్లడంతో ఒకరి పాట ఒకరికి చేరి



తారుమారయ్యాయి.

తర్వాత వేటూరి మొదటిపాట రికార్డింగ్ దగ్గరికి వెళ్లేసరికి పాటలు తారుమారైన సంగతి గ్రహించారు. ఆ సంగీత దర్శకునితో ఈ విషయం ప్రస్తావించడంతో 'అద్భుతమైన పాట.. అందరూ ఎంతో ఆనందిస్తున్నారు.. పాట మార్చే సంగతి మరిచిపొండి' అన్నారు.

ఏం గందరగోళం జరిగిందోనని రెండో దర్శకుని దగ్గరకు వెళ్లారు. వేటూరిగారిని చూడ్డంతోనే ఆ దర్శకుడు 'అద్భుతమైన పాట రాసిచ్చారు' అంటూ ప్రశంసిస్తూ ఎదురొచ్చారు. ఆపైన ఆశ్చర్యపడడం వేటూరిగారి వంతైంది.

ఆమె తన భావనలని తొక్కిపెడ్తూ ఆ మహిళని అడిగింది. "ఆ గంభీరమైన శూన్యం నుంచి నిన్ను నువ్వు కాపాడుకునేందుకు ఏం చేశావు? "

అందుకు సమాధానంగా ఆ యువతి "ఎంతో నిష్కపటభావంతో కొన్నిరోజుల పాటు మల్లెలతోటలో విహరించాను. ఇది చాలాకాలం కిందటి సంగతి. అప్పుడు నా పొడవాటి కురులు మెరుస్తూ వుండేవి. మల్లెలతోటలో నన్ను నేను పరీక్షించుకునేందుకు తిరిగాను. నాకు నేను ముఖాముఖీ కావడమనేది పూర్తిగా కఠినమైంది, క్రూరమైంది. అయినప్పటికీ నేను మల్లెల తోటలో విహరించేదానిని. ఆడనెమళ్లకి 'రస్‌భరీ' తినిపించడంలో ఆనందం పొందేదాన్ని. ఒకసారి ఓ విద్యార్థి నా గుప్పెట్లో 'రస్‌భరీ' నింపే ధైర్యం చేశాడు. నా నుదుటిపైన జీరాడే పొడవైన వెంట్రుకలని తన వేళ్లతో సవరిస్తూ చాలాసేపు నా కాళ్లని పరిశీలించాడు. కానీ నేను అతడ్ని నివారించలేదు. ఎందుకంటే నన్ను నేను పరీక్షించుకోవాలనుకున్నాను. చివరికి తోటలో ఓ మూల నుంచి మరో మూలకి, మరో మూల నుంచి మొదటి మూలకి తిరగసాగాను. ఆ తర్వాత మరో విద్యార్థి కూడా 'రస్‌భరీ' నా ముందు వుంచాడు. ఆ తర్వాత ముందులా నా కాళ్లమీద, జుట్టు కుచ్చులపైన చూపులు నిలిపాడు. అయినా ఎప్పటిలాగే నేను తోటలో తిరిగాను. ఇది జరిగి చాలా రోజులైంది. నా అందమైన కాళ్లు ఇప్పుడు గరుకుగా మారిపోయాయి. భజనాశ్రమంలో పేరు ప్రఖ్యాతులున్నదాన్ని. నేస్తం నన్ను నమ్ము" అంటూ ఆ యువతి సౌదామిని దగ్గరికి వచ్చి చెవిలో గుసగుసగా అంది, "ప్రార్థన సమయంలో నేను ఈ మాలని జపిస్తున్నప్పుడు నేను మల్లెపూరేకుల సౌకుమార్యాన్ని ఆస్వాదిస్తాను. చిన్నతనంలో అందరూ 'మంచి పిల్ల' అంటూ నన్ను ప్రశంసించేవాళ్లు. ఇప్పుడూ అందరూ నన్ను ఆదరిస్తారు. ఇటు చూడు, ఇది నా జపమాల సంచీ. అయినప్పటికీ జపించడానికి ఇందులో చేయిపెట్టగానే మల్లెపూల మెత్తదనాన్ని స్పృశిస్తున్న అనుభూతి పొందుతాను"

మరిన్ని ప్రశ్నలు అడగాలనుకుంది సౌదామిని. ఆమె ముందుకు సాగింది. ఆమె పూర్తిగా భయంతో వుంది.

గర్జనల నేపథ్యంలో కూడా పైన గదిలో వున్న తన తల్లి దగ్గు వినిపిస్తోంది సౌదామినికి. ఆమె తనని చాలా బాధపెడ్తోంది.

తను తల్లి దగ్గరకి వెళ్లాలా? కూతురైనందుకు బాధ్యతగా ప్రేమతో ఆప్యాయతగా ఆమె తల నిమరాలా? ఆమె తన తల్లి. తను ఆమె ప్రియమైన పుత్రిక. తన క్షేమం కోసం తన జీవితాన్ని త్యాగం చేసిందామె. ఇప్పుడామె అంతిమ క్షణాల్ని లెక్కిస్తోంది. అందుకు ఇదా ప్రతిఫలం?

సరిగా అప్పుడే తలుపు తడుతున్న చప్పుడు వినిపించింది సౌదామినికి. ఆమె లేచి వెళ్లి తలుపు తెరిచింది. ఎదురుగా తన తండ్రి. ఆశ్చర్యపోయిందామె. వెంటనే లోపలికి వచ్చి పరిశీలించాడు. "నీ గది పాడుబడింది. నీ బాగోగులు చూడ్డం నాకు కష్టమైపోయింది. గోడలో బీటలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. నువ్వు చూడలేదా? " అన్నాడు.

మితంగా మాట్లాడే తన తండ్రి అకస్మాత్తుగా సూక్ష్మగ్రాహిగా మారడం చూసి సౌదామిని ఆశ్చర్యచకితురాలయింది.

"ఏకాంతం కోసం ఒక లావుపాటి తెర అవసరం.." అన్నాడు తండ్రి. "ఈ ప్రాంత ప్రజలు మన బావిలోంచే నీళ్లు తీసుకువెళ్తుంటారు" అంటూ ఓ బల్లని జరిపి కూతురి పక్కనే కూర్చున్నాడు.

తన తండ్రి బాగా నీరసించిపోవడాన్ని సౌదామిని గమనించింది. ఆయన వెన్ను విల్లులా వంగిపోయింది. మొహం వాడిపోయింది. దేహం ముడతలు పడింది.

## చిరునామా మార్పు

**చ**తురకు నవలలు, చతుర కతలు, ఇతర రచనలు, కూపన్లు పంపేవారు ఇకపై కింది చిరునామాకు పంపాల్సిందిగా విజ్ఞప్తి.

***సంపాదకులు, చతుర, ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్ – 500082 ఫోన్: 040-23318181 EX: 6658, 6532***

రచయితలు/రచయిత్రులు నవలలు తమ సొంతమే అన్న హామీపత్రంతో పాటు తమ పూర్తి చిరునామా, ఫోన్ నెంబరు సహా ఇవ్వాలి. ఫోన్ నెంబరు ఉంటే సమాచారం వేగంగా ఇవ్వడానికి వీలవుతుందని గమనించగలరు. అనువాద నవలలు పంపేవారు మూలరచయిత అనుమతి పత్రం పంపాలి. అది సాధ్యం కాని పక్షంలో తాము ఆ నవల ప్రచురణకర్తల చిరునామాలు, ఫోన్ నెంబర్లు వివరంగా పంపాలి. అప్పుడు అనుమతి పత్రం తీసుకోవడానికి చతుర ప్రయత్నిస్తుంది. **తిరస్కృత రచనలు కావాలనుకునేవారు విధిగా తగినన్ని పోస్టేజి స్టాంపులు అంటించిన సొంత చిరునామాగల కవరును జతపరచాలి.** ఇలా చేయని పక్షంలో ట్రాష్‌లోకి వెళ్లిపోతాయి. ఆ తర్వాత స్టాంపుల కవర్ పంపినా ప్రయోజనం శూన్యం. చందాదారులు కూడా తాము పంపే డీడీ వెనుక/మెయిల్‌లో తమ పూర్తి చిరునామాను ఫోన్ నెంబరు సహా ఇవ్వాలి.

ఎంతోకాలంగా తండ్రి మంచిచెడ్డలు చూడనందుకు తన్ను తాను నిందించుకుంది సౌదామిని.

ఎక్కువసేపు తండ్రిని చూడలేకపోతోంది సౌదామిని. కళ్లు చెమ్మగిల్లాయి.

"నిన్ను అడగకుండా నేను ఓ పని చేశాను" అన్నాడాయన.

తను వింటున్న మాటలు నిజమా? కాదా? అన్న సందిగ్ధంలో పడిపోయింది సౌదామిని.

"నువ్వు నిజంగానే ఆశ్చర్యపోతావు. కాలం రెక్కలు తొడిగిన బాణంలా దూసుకుపోవడం నువ్వు గమనించడం లేదా? నువ్వు వాళ్లని లెక్కించావా? తక్కువ సమయంలోనే కళ్ల ఎదుట నుంచి అదృశ్యమయినవాళ్లని? ఎవరికి తెలుసు మన అంతిమఘడియలు కూడా మరెంతో దూరంలో లేవని! ఆ సమయం దొంగలా వాటిల్లినపుడు.. సరే, ఈ విషయం ఇక్కడితో వదిలేద్దాం" అని తండ్రి కొంతసేపు మౌనం వహించాడు.

మంచిది, ఈ వ్యక్తా తన తండ్రి! సౌదామినిలో విచిత్రమైన ఉదాసీనత చోటుచేసుకుంది. ఆమె తండ్రి ఓ గొప్ప వ్యక్తి. బుద్ధిమంతుడు, ఆత్మవిశ్వాసానికి ప్రతీక. నీతిని జాయతీతో, సత్ప్రవర్తనతో ఓ మహత్తరమైన జీవితం గడిపిన వ్యక్తి ఆయన.

"నా చేతుల్ని చూడు, కొన్నిరోజుల నుంచి నిర్జీవంగాను, స్పర్శ లేనివిగా మారిపోయాయేమోనని అనిపిస్తోంది. తొందరలోనే కదల్లేని అసమర్థుడిగా నిస్సహాయ జీవితాన్ని గడపాల్సి వస్తుందేమోనని భయంగా వుంది" అన్నాడాయన.

సౌదామిని తలఎత్తి చూసింది. తన తండ్రి కళ్ల కింద ఓ నల్లని చారని చూసింది. చంద్రభాను రాకేష్‌కి కూడా ఇలాంటి చార వుందన్న విషయం ఆమెకి జ్ఞప్తికొచ్చింది. ఇది నైరాశ్యానికి, దుఃఖానికి, అనుబంధలేమికి, ఎడబాటుకి సంకేతం.

తండ్రి మళ్ళీ చెప్పడం కొనసాగించాడు.

## డిసెంబరు - 2014
## చతుర ప్రవేశిక విజేతలు వీరే!

డ్రాలో ఎంపికైన ఈ అయిదుగురికీ త్వరలో బహుమతులు అందుతాయి.



1. డి. పాండురంగారావు
- మల్కాజిగిరి, హైదరాబాద్
2. కొల్లూరి నాయుడమ్మ
- ఇంకొల్లు, ప్రకాశం జిల్లా
3. పి. శైలజ
- నవులూరు, గుంటూరు జిల్లా
4. జి. శ్రీలేఖ
- తిరుపతి, చిత్తూరు జిల్లా
5. గానుగపెంట నరసింహులు
- బద్వేలు, కడప జిల్లా

### సరైన జవాబులు

| | |
|---|---|
| 1. శ్రీరామచంద్రమూర్తి | 6. భూదేవి |
| 2. లక్ష్మి | 7. హేమ (గ్రూప్) |
| 3. మైథిలి. | 8. జగన్నాథరావు |
| 4. సాంబశివరావు | 9. టి.ఎస్.ఏ కృష్ణమూర్తి |
| 5. సుగుణాకరం | 10. బోరిస్ పాస్టర్నాక్ |

"నేను నీ స్నేహితుడికి ఉత్తరం రాశాను. ఈ సమయంలో ఇక్కడికి అతను రావడం చాలా అవసరమని"

ఆ తర్వాత ఆయన సౌదామిని దగ్గరకు జరిగి గరుకుగా వున్న తన చేతులతో ఆమె తలను మృదువుగా నిమురుతూ చెప్పడం కొనసాగించాడు. "ఇది వాస్తవాన్ని ఎదుర్కొనే సమయం. అదే అతన్ని ఇక్కడికి రప్పించిందని నువ్వు భావించడం లేదా? అతను వచ్చేశాడు. నువ్వు తయారవ్వు"

నిజంగా తను తల్లిదండ్రులపట్ల కృతఘ్నురాలా? తను ఎన్నడైనా తన తల్లిదండ్రుల ఇష్టానికి భిన్నంగా ప్రవర్తించిందా? గతించిన తన బాల్యాన్ని గుర్తుకు తెచ్చుకోసాగింది సౌదామిని. ఆమె ఎప్పుడూ ఇతరులకి బాధకలిగించే ఆలోచనలు రాకుండా తన్నుతాను రక్షించుకునేది. తల్లి ఒకసారి అంది, 'నువ్వు నా కంటి పాపవి' అని.

తన తల్లి కంటిపాపలాగానే సౌదామిని తన బాల్యం, యౌవనం చాలాసంవత్సరాలు గడిపింది. మరణించిన తన భర్త సుబ్రతతో పరిచయం కాకముందు తనకి ప్రేమికులు చాలామంది వుండేవారు. కానీ ఎవరి ముందూ తన అందాలను చూపించలేదు. అలాంటప్పుడు తను సుగుణవతి గనక అయితే ఇలా ఎందుకు జరిగినట్టు? ఆమె తన తల్లి కనుపాప అయినందుకా? కానీ అది స్థిరమైన కారణం కాదు. అనిశ్చితిలో పడిపోయింది సౌదామిని.

కాలం గడిచిపోతోంది. వేగంగా-సౌదామిని తనకు తాను గుర్తుకు తెచ్చుకుంది.

శీతాకాలం వచ్చేసింది. సాయం సూర్యుడు పూర్తిగా చల్లబడ్డాయి. రాధేశ్యామ్‌ీలు వాచిపోయిన కాళ్ళతో రాయ్‌చౌదరి ఆసుపత్రికి రావడం మొదలయ్యింది.

పరిస్థితులు అనుకున్నట్లుగా వుండక పోవడంతో సౌదామినికి బాధ కలిగింది. ఆమె ప్రేమికుడు వచ్చే సమయం అది. ప్రత్యేక నావ, మధుర నుంచి వచ్చి కేసీ ఘాట్ దగ్గర ఆగే నావ. సౌదామిని వాటిని దగ్గరగా చూస్తోంది. నావ లైట్ల మెరుపులు, ధప్ ధప్ మంటున్న తెడ్డు శబ్దాలు ఆమెని ఎక్కువ ఆతురతతో నిరీక్షించేలా చూసింది. తను ఉత్తేజిత మవటానికి తనను తానే నిందించుకోసాగింది సౌదామిని. కోమలమైన తన భావాలు చాలా ముందుగానే ఆవిరైపోయినట్టుగా ఆమె కన్పించింది. కానీ ఇలాంటి ఆలోచన తప్పు అని ఇప్పుడనిపించింది ఆమెకి.

తనకి తప్పకుండా కొత్త జీవితాన్ని ప్రసా

దిస్తానన్న విశ్వాసం కలిగించిన ఆమె ఈసాయి ప్రేమికుడు తన తండ్రి ఉత్తరం కోసం నిరీక్షించినట్లుగా అనిపించింది సౌదామినికి. ఆ రోజు విదేశీ ఈసాయి యాత్రికుల సమూహాన్ని ఎవరో పనివాళ్ళు మందిరంలో ప్రవేశించేందుకు అనుమతి నిరాకరించినందుకు ఒక చిన్న గలభా జరిగింది. అదే రోజు కేశీఘాట్ దగ్గరికి ఓ నావ వచ్చి ఆగింది. అది మధురలోని అక్రూట్ ఘాట్ నుంచి వచ్చింది. సౌదామిని ప్రియుడు అదే నావలో వచ్చాడు.

అవి కృష్ణపక్షం చివరి రోజులు. రాత్రి చిమ్మచీకటితో చిక్కబడింది. అయినప్పటికీ అర్ధరాత్రివరకు ఆ డాక్టరు రోగుల్ని అందులోను అధికంగా కాలి వాపుతో బాధపడుతున్న వాళ్ళని చూస్తున్నాడు. ఆ తర్వాత ఆయన బావినుంచి నీళ్ళు తోడుకుని కాళ్ళు చేతులూ కడుక్కుని డ్యూటీలో వున్న వాచ్ మెన్‌కి ఆసుపత్రి తాళాలు అప్పగించి సేవానివృత్తి పొందాడు. సౌదామిని అతనికన్నా ముందే నివృత్తి పొంది మిగతారోజులకి భిన్నంగా త్వరగా నిద్రపోయింది.

తర్వాత అకస్మాత్తుగా ఎవరో తలుపు తట్టిన చప్పుడైంది. సౌదామిని ఉలిక్కిపడి లేచింది. కాలివాపుతో బాధ పడుతున్న రాధేశ్యామీలు ఎవరైనా వచ్చారేమోనని అనుకుంది. అర్ధరాత్రి కూడా డాక్టర్‌ని ఎలా విసిగిస్తారో, అయినా వాళ్ళని తప్పు పట్టడానికి లేదు. వాళ్ళు ఆ బాధని ఓర్చుకోవడం కష్టం. ఇంకా చెప్పాలంటే ఆ మహిళలు పశుశాలలో పడివున్న పాడైపోయిన ఆలుగడ్డలకోసం తమలో తాము కొట్టుకుంటారు. మళ్ళీ చల్లగా తెల్లవారగానే తమ తమ గుహల్లో చతికిలబడిపోతారు. ఎంతటి అసహ్యకరమైన దృశ్యం అది.

సౌదామిని తలుపు తీసింది. చేతిలో లాంతరు పట్టుకుని చెప్పులు లేకుండా వరండాలో తన తండ్రిని చూసి ఆశ్చర్యపోయింది. తండ్రి మాట్లాడే లోపలే "నాకు తెలుసు, రాధేశ్యామీల కోసం మీకు ఈ గది కావాలి. మంచిది. నేను ఇప్పుడే దీన్ని ఖాళీ చేస్తాను. నా పక్క బట్టల్ని పైకి తీసుకెళ్ళనివ్వండి" అంది సౌదామిని.

బాగా కన్పించేందుకు వీలుగా తండ్రి లాంతరు వత్తిని పెంచాడు.

"లేదు, నువ్వు తప్పుగా అర్థం చేసుకున్నావు. నీ గది నాకు అవసరం లేదు. నీకు ఓ విషయం చెప్పాలి. నీ స్నేహితుడు వచ్చేశాడు. ఇప్పుడతను ఘాట్ దగ్గరున్న వైష్ణవ బల్లకట్టుపైన నీ కోసం నిరీక్షిస్తున్నాడు. ఇది వెళ్లాల్సిన సమయం కాదు. కానీ మరో మార్గం లేదు. అనుమప గాఢ నిద్రలో వుంది. ఇక ఉదయమే ఆమె లేవడం. త్వరగా తయారవ్వు.. ఒంటిమీద ఏదైనా కప్పుకో. బయట బాగా చలిగా వుంది" అన్నాడు తండ్రి.

కానీ సౌదామిని సంకోచిస్తూ 'నాకు తెలుసు అతన్ని కలవాలని కానీ..' అనుకుంది తనలో తాను.

"నీ తలమీద పైటచెంగుని సరిగ్గా కప్పుకో. నా వెనకాలే రా" అన్నాడు తండ్రి.

పైట చెంగుతో తలని కప్పుకుని సౌదామిని తనలో తాను అనుకుంది, 'నువ్వు నన్ను సరిగ్గా అర్థం చేసుకున్నావు. ఎవరైనా సరే తనకు తాను పరీక్షించుకోవడమన్నది సరైన పద్ధతి'

ఇద్దరూ బైటకి వచ్చారు. ఆకాశం మేఘావృతమైవుంది. కొందరు రాధేశ్యామీలు దారి పక్కన కూర్చుని తలల్ని స్కార్ఫ్‌తో కప్పుకుని వుండడం చూసింది సౌదామిని. వాళ్ళు రంగనాథస్వామి మందిరం నుంచి గాల్లో తేలుతూ వస్తున్న షెహనాయి మధురస్వరాన్ని వింటున్నారు. లాంతరు వెలుగులో రెండు ఆకారాల నీడలు వాళ్ళని దాటుకుని వెళ్ళడం చూశారు. కానీ వాళ్లు ఎవరోనని తెలుసుకోవాలనే ఉత్సుకత ఇద్దరికీ లేకపోయింది. వాళ్లు తల కూడా ఎత్తలేదు. వాళ్లు మృదువుగా

తెలుతూ వస్తున్న షెహనాయీని వింటూ ఆధ్యాత్మికానందంలో మునిగిపోయారు.

సౌదామిని, ఆమె తండ్రి నదివొడ్డుకి చేరుకున్నారు. ఒడ్డున లంగరు వేసిన పడవ ఒకటి పైకి కిందికి ఓ విధమైన లయతో వూగుతుండడం గమనించారు వాళ్ళు. నావలో దీపం కాసేపు వెలుగుతూ, కాసేపు ఆరుతున్నట్లుగా ఉంది.

కూతుర్ని ముందుకెళ్లాల్సిందిగా చెప్పి అక్కడే నిలబడి పోయాడు తండ్రి. గాలివేగంగా వీస్తోంది. ఇసుక రేణువులు గాలికి అంతటా వ్యాపిస్తున్నాయి. సౌదామిని నడుస్తోంది. ఆమె వెనక్కి తిరిగి చూసింది. దూరంగా చేతిలో లాంతరుతో వంగివున్న తన తండ్రి ఆకారాన్ని గుర్తుపట్టింది. ఇంతలో అకస్మాత్తుగా తనకాలికి మెత్తగా స్పాంజిలా తగిలింది ఏదో. దాని మీద అడుగువేయగానే ఉలిక్కిపడింది సౌదామిని. భర్త జీవించి వుండగానే మరణించిన ఎవరో స్త్రీ రంగుల దుపట్టా అది. ఆమె తన కాలికి తట్టుకున్న దాన్ని తీసి దూరంగా విసిరేసింది. 'అంతిమ సంస్కారాల సమయంలో ఆమె భర్త దానిని ఉపయోగించి వుండొచ్చు. ఆమె ఎంతటి అదృష్టవంతురాలు ఆమె ఎవరైనప్పటికీ..!' అనుకుంటూ సౌదామిని ఒడ్డున లంగరు వేసివున్న నావ వైపు సాగింది. మళ్ళీ వెనక్కి తిరిగి చూసింది సౌదామిని. ఆమె కనుల ముందు కనిపించిన తండ్రి ఆకారం మసకబారి అదృశ్యమైపోయింది. ఆమె నావ దగ్గరికి చేరుకుంది. అతను అక్కడున్నాడు -తన ప్రియుడు ఇసుకలో నెమ్మదిగా పచార్లు చేస్తున్నాడు.

అతడు ఆమెను సమీపించి తనచేతిని చాచాడు. ఆమె ఆ చేతిని అందుకుని అతని వెనకాలే నావలోకి వెళ్లింది. నావపైన సురక్షితమైన, దృఢమైన కప్పుకూడా వుంది. వాళ్ళిద్దరూ లోపలికి అడుగుపెట్టగానే నావ అటూఇటూ పెద్దగా వూగింది.

తుదకు ఈవిధంగా అంతమయింది. తన మనసులోని భావన స్పష్టమైన రూపం సంతరించుకోవాలని సౌదామిని ఏది కోరుకుందో సరిగ్గా అలాగే జరిగింది. ఆమె నమ్మకాలన్నీ వాస్తవ రూపం దాల్చాయి. ఆమె ఆ వ్యక్తిలో జీవితానికి అర్థం వెతుక్కుంది. తన దగ్గర కూర్చున్న అతను ముక్కుపుటాల నుంచి విడుస్తున్న ఊపిరి ఆమె శరీరాన్ని వెచ్చబరుస్తోంది. తనుకాక, పవిత్ర ప్రజభూమి ధూళి మహిమను కోల్పోవడానికి కారణభూతురాలైన మరో మహిళ ఎవరైన వుందా?

సౌదామిని తన మదిలో వ్యాకులపరుస్తున్న ఆలోచనలవల్ల బాధతోను ఉదాసీనంగాను వుంది. శీతలరాత్రి కూడా సౌదామిని నుదుటిపైన చెమట బిందువులు మెరుస్తున్నాయి. ఆమె తన వేలితో వాటిని తుడుచుకుంది.

ఆమె తనదగ్గర కూర్చున్న ఆ వ్యక్తిని పరిశీలనగా చూస్తూ "ఈ పవిత్రభూమిలో నాకున్న ఒకే ఒక్క ఆధారం నువ్వు. నాగత స్మృతులన్నీ ఇప్పుడు మసకబారిపోయాయి. ఈ రోజుల్లో నేను నా స్వర్గీయ భర్తని గత జన్మ స్మృతులుగా భావిస్తాను. ఆ విధంగా నేను నిర్దోషి అన్న విషయం నీకు తెలుసు. కానీ ఇప్పుడు నేను కూడా ఎంతో విచిత్రంగా ప్రవర్తిస్తున్నాను.. ఇది సరైంది కాదు. చాలా అనుచితం. మరణించిన ఓ వ్యక్తి పట్ల ఇది ఓ క్రూరత్వం, న్యాయపూర్వకమైందని చెప్పడం అతికష్టం. కానీ నా అవస్థ చూడు. ఓహ్! ఎంతటి దౌర్భాగ్యం. నేను ప్రేమించి గౌరవించిన వ్యక్తిపట్ల క్రూరంగాను, అనుచితంగాను ప్రవర్తించి సాంత్వన పొందే ప్రయత్నం చేస్తున్నాను"

మబ్బులు కమ్మి, ఉరుములు మెరుపులతో ఆకాశం బీభత్సంగా ఉంది. పెద్ద గాలి దుమారం చెలరేగి దుమ్ము ధూళి రేగుతోంది. దాంతో చాలాచోట్ల ఇసుకలో

గుంతలు కనిపిస్తున్నాయి. ఇప్పటి వరకు గాల్లో తేలియాడుతూ వచ్చిన షెహనాయి స్వరం ఇప్పుడు వినబడటం లేదు.

"నన్ను అదిమి పట్టుకో. నీ బిగికౌగిలిలో బంధించు. నువ్వు ఎందుకు ఏడుస్తున్నావు? నిన్ను ఈసాయిని అని అంటారు. అవును, నువ్వు ఈసాయివే. నాకు గానీ మరెవర్నికైనా గానీ అందులో అంతరం ఏముంది? నా రొమ్ముల్ని తాకుతున్న నీ వెచ్చదనం మరణించిన నా భర్త వెచ్చదనంలాగే వుంది. ఏమాత్రం తేడాలేదు"

శాంతం, సంయమనం ,గౌరవం కోల్పోయినందుకు సౌదామిని ఆవేశంతో ఏడుస్తూ, "నన్ను ముద్దుపెట్టుకో! మునుపటిలాగే హృదయపూర్వకంగా ముద్దుపెట్టుకో! త్వరగా ముద్దుపెట్టుకో! ఎందుకంటే గతంలో నాభర్త వల్ల నేను ఆ రుచి చూశాను. ఇది అదే పాత స్పర్శ" అంది.

పెద్ద ఇసుక తిప్ప నది ఒడ్డుకు చేరుకున్నట్టుగా మాట్లాడుతూ మాట్లాడుతూ సౌదామిని తన ప్రియుడి భుజం మీద తలవాల్చింది.

"ఈ సమయంలో ఉపశమనం కలిగించే నీ చల్లదనాన్ని ఓర్చుకోలేక పోతున్నాను. అస్సలు పనికిరాదు. ఈక్షణం కోసమే నేను చాలా ఉత్సుకతతో వేచివున్నాను. నేను ఈ క్షణం కోసమే మనస్ఫూర్తిగా ఎదురు చూశాను. దాని గురించిన ప్రశంస నేనిప్పుడు చేయగలను" అంది సౌదామిని.

గాలికి నావ అటూ ఇటూ ఊగుతోంది. మేఘాలు గర్జిస్తున్నాయి. చినుకులతో మొదలైన వాన కుండపోతగా మారింది. దానికి సాయంగా ఈదురు గాలి ఒకటి. చినుకులు ముఖాలని సూదుల్లా గుచ్చుతున్నాయి. ఇక నావలో కూర్చోవడం ఏమాత్రం సురక్షితం కాదు. "పద ఒడ్డు పైన ఖాళీగా వున్న ఆ వసారాలోకి వెళ్ళిపోదాం తుఫానులా వుంది" అంది సౌదామిని.

ఇద్దరూ నావలోంచి బైటకి వచ్చారు. రోడ్డుపైన ఘాట్ దగ్గరున్న గుడివైపుకి పరుగెత్తారు. వెంటనే ఇసుక తుఫాను మొదలైంది. నది ప్రమాదకరంగా వుంది. గతంలో ఎన్నడూ అలా చూడలేదు సౌదామిని. నది ఉగ్రరూపం సంతరించుకుంది. దుమ్ము ధూళి ఇసుక రేణువులు కలగలసి ప్రేమికుల కార్యకలాపాలకి విఘ్నం కలిగిస్తూ సుడిగాలిలా ముందుకు దూసుకురాసాగింది. అయినప్పటికీ ఇద్దరూ పరుగెడుతూనే ఉన్నారు. వర్షాన్ని తుఫానుని లెక్క చేయకుండా తమ లక్ష్యం వైపు దూసుకుపోతున్నారు వాళ్లు.

అప్పటికే అర్ధరాత్రి దాటింది. తుపాను మరింత బీభత్సంగా మారింది.

మరోసారి సౌదామిని మదిలో మొండి పట్టుదలతో కూడిన సందేహాలు వెంటాడసాగాయి. అన్నింటినీ మించి ఆమె ఆశించినదేంటి? అన్ని అధికారాలని, భావనలని

## గాలిని పోగేస్తే లవ్ సాంగా!

ఒక పాట రాయమంటూ ఓ పెద్దాయన వేటూరిగారి దగ్గరకు వచ్చారు.

'పాట సిట్యుయేషన్ ఏంటయ్యా' అని అడిగారు వేటూరి.

దానికా పెద్దాయన 'ఏముంది గురూగారూ!



హీరోహీరోయిన్లు లవ్ చేసుకుంటారు. కట్ చేస్తే ఊటీలో పాట' అన్నాడు.

'అంటే, ఊటీ గాలి పోగేసి లవ్ సాంగ్ రాయాలా? ఏం చేస్తాం, అలాగే రాద్దాం' అన్నారు వేటూరి.

ఉపేక్షించినందుకు ఆమె పొందింది ఇదే నా? సౌదామిని తన ప్రియుడితో అంది, "నువ్వు కూడా భయంకరమైన ఏకాంతాన్ని అనుభవించి ఉంటావు. నీకూ వృద్ధాప్యం వస్తున్నట్టుంది. చీకట్లో తలలో తెల్లటి తెలికపాటి చారలు కనిపిస్తున్నాయి"

అతను తలని మోకాళ్లపైన ఆనించాడు తప్ప ఏమీ మాట్లాడలేదు.

"లేదు ప్రియా! మన అధైర్యానికి ఎలాంటి కారణం లేదు. ఈ రోజు మనం హృదయం విప్పి మాట్లాడుకుందాం. ఈ క్షణం మహత్తరమైంది. మిగతా ఆలోచనలన్నీ వృథా. నువ్వే నా లోకం.. నీతోటే జీవితం.. దీన్ని ఉపయోగించుకో. మన జీవితాల్లో మహత్తర క్షణాలివి. ఈ క్షణాలని శాశ్వతంగా మిగుల్చుకుందాం. దగ్గర నుంచి నన్ను ముద్దాడు. నన్ను ఆలింగనం చేసుకో...! ఓ పిచ్చి ప్రేమికుడిలా. మిగతావన్నీ ప్రాముఖ్యాన్ని కోల్పోయాయి. ఈ రోజు నేను నిరీక్షించిన రోజు" అంటూ సౌదామిని "ఏడుస్తున్నావా ప్రియా! నాకూ దుఃఖం వస్తోంది" అంది.

కొంత మౌనం తర్వాత సౌదామిని చెప్పడం కొనసాగించింది. "నిజం చెప్పాలంటే నేను ఈ రోజు కోసమే ఎదురుచూస్తున్నాను. ఎందుకంటే నా జీవితంలో ఓ కొత్తఅధ్యాయం మొదలవుతుంది. ఓ కొత్త మార్గానికి నాంది పలకాలని భావించాను. నా భయాలకి, సందేహాలకి ఇది పూర్తి విరామం చేకూరుస్తుంది. రా, నా ప్రియా, నాకింకా దగ్గరగా జరిగి ఆనుకుని కూర్చో! ఈ బీభత్స వాతావరణంలో బయట తుపానులాగే నా హృదయంలో కూడా తుపాను చెలరేగుతోంది. నేను ఇన్నాళ్లూ నైరాశ్యంలో కూరుకుపోయాను. నేను ఇప్పుడు ఆకలిగొన్న మృగాన్ని. నా ఈ తాపం వెనక శరీరం, మనోవేదనలు ఇమిడి ఉన్నాయి. ఒక ఈసాయీ ఒక హిందువు ఆనందదాయకమైన బిగికౌగిలిలో బంధింపబడడం. ఇదో రహస్యపూరిత వేదన. ఈ వేదనలో నేను జీవిత అస్తిత్వం అర్థాన్ని గ్రహిస్తాను"

"ఇతరులు కూడా లయబద్ధమైన మన వెచ్చని హృదయాల స్పందనలు వినాలని నా కోరిక"

సరిగ్గా అప్పుడే ఓ గోడ కూలిన శబ్దం వినిపించింది సౌదామినికి.

"ఎవరైతే మతం కారణంగా నిన్ను వెలివేయాలనుకున్నారో వాళ్లు కసాయిల కన్నా ఎక్కువేమీ కాదు. నేను వాళ్లని కసాయిలనే అంటాను" అంది సౌదామిని తిరుగుబాటు ధోరణిలో. తర్వాత మోకాళ్ల మధ్య తల ఆన్చి చిన్నపిల్లలా ఏడవసాగింది.

తుపాను తీవ్ర రూపం దాల్చింది. పీపా బ్రిడ్జి స్తంభాల దగ్గర చెట్టు మోడులు గుద్దుకుంటున్న శబ్దాలు వినిపిస్తున్నాయి. ఓ అసహాయ జీవి దగ్గర్లోని సుడిగుండంలో పడిపోతున్నట్టుగా కేకలు వినిపించాయి. ప్రతి సంవత్సరం కొందరు రాధేశ్యామీలు ఆ రాక్షస సుడిగుండంలో జలసమాధి అవుతారనే కథనం వ్యాప్తిలో ఉంది. ఈ రోజు ఉప్పొంగి ప్రవహిస్తున్న నది భయంకరంగా ఉంది.

విరిగిన గోడ దగ్గర ఏదో వస్తువు దొర్లిన శబ్దం వినిపించింది. సౌదామిని లేచి నిలబడింది. ఆ దొర్లిన వస్తువు మరేదో కాదు. తన తండ్రి ఇచ్చిన లాంతరు. అంటే దీని అర్థం తన తండ్రి ఇప్పటికీ ఘాట్ దగ్గరున్న మెట్లపైనే కూర్చున్నాడన్నమాట. ఆతృతగా సౌదామిని బయటికి తొంగి చూసింది. కానీ ప్రచండ తుపాను, చీకటి కారణంగా ఎలాంటి ఆకృతి, నీడ కూడా ఆమెకి కనిపించలేదు.

గాలికి తెరచి ఉన్న కిటికీలోంచి కొన్ని దూది ఉండలు దూసుకువచ్చాయి. అవి ఓ రాధేశ్యామీ కంబళి నుంచి బయటపడినవి. కొన్నాళ్ల క్రితం దొంగ ఎవరో ఆ కంబళిని చింపి ఆమె అంతిమ సంస్కారాల

# వనాలు కాదు.. శ్మశానాలు



అమెరికాలోని షికాగోకి చెందిన శ్మశానాలు ఉద్యానవనాలను తలపిస్తాయి. దూరం నుంచి చూస్తే పెద్ద పెద్ద పార్కులనే భావన కలుగుతుంది. చల్లటిగాలి, నీడనిచ్చే పెద్ద పెద్ద చెట్లు, అందమైన పూలమొక్కలు, పచ్చిక బయళ్లు, తీర్చిదిద్దిన సిమెంట్ రోడ్లు, నీటి కొలన్లు, అన్ని వసతులతో విశ్రాంతి భవనాలు, ప్రశాంతమైన వాతావరణం.. షికాగో శ్మశానాల సొంతం.

అన్ని రంగాల్లోనూ ముందుండే అమెరికా శ్మశానాల నిర్వహణలోనూ ప్రత్యేకతను చాటుకుంటోంది. వివిధ మత సంస్థలు గత ఏభై ఏళ్లుగా ఆరోగ్యవంతమైన శ్మశానాలు నిర్వహిస్తున్నాయి. ఇల్లినాయిస్ రాష్ట్రంలో 1874 శ్మశానాలు ఉండగా, ఆ రాష్ట్ర ముఖ్యనగరమైన షికాగోలో 253 ఉన్నాయి. అందులో 44 అత్యంత అద్భుతంగా కేథలిక్ మత సంస్థ నిర్వహిస్తోంది. శ్మశానాల్లో కొన్ని కేవకలం ఎకరం రెండెకరాలకే పరిమితం కాగా పెద్దవి 350 ఎకరాల వరకు విస్తరించి ఉన్నాయి. షికాగో నగరంలో కేవలం శ్మశానాలే పదివేల ఎకరాల స్థలాన్ని ఆక్రమించాయి.

శ్మశానంలో స్థలాన్ని అంగుళాలు, అడుగుల లెక్కన కొనుగోలు చేయాల్సి ఉంటుందంటే ఆ స్థలం ఖరీదు ఏ స్థాయిలో ఉంటుందో అంచనా వేయవచ్చు. అక్కడ అడుగున్నర (18 అంగుళాలు) స్థలం కొనాలంటే సుమారు వెయ్యి డాలర్లు (రూ. 58,000) వెచ్చించాలి. శవాన్ని పూడ్చిన స్థలంలో సమాధి కట్టాలంటే భారీ మూల్యం చెల్లించక తప్పదు. కొందరు అలాంటి నిర్మాణాల జోలికి పోకుండా ఆ స్థలంలో పేర్లు రాసిన చిన్న శిలాఫలకాలను ఉంచుతారు. ఆ ఫలకం దగ్గరే పూల కుండీలను అమరుస్తారు. ఈ కుండీలు విధిగా చెక్కవిగానీ, ప్లాస్టిక్ విగాని అయి ఉండాలి. శ్మశాన ఆవరణలో ఎక్కువగా కొవ్వొత్తులు వెలిగించ కూడదు. బాణసంచా కాల్చకూడదు. పిక్‌నిక్ పార్టీలు నిర్వహించరాదు. మద్య, ధూమపానాల్ని అనుమతించరు. కుక్కలు లాంటి పెంపుడు జంతువులను కూడా అనుమతించరు. పదడుగుల పొడవు, పదడుగుల వెడల్పు, పదడుగుల లోతు తవ్వకోవడానికి వీలుగల స్థలాన్ని ఒక కుటుంబం కొనుగోలు చేసి, వారి కుటుంబ సభ్యుల అంత్యక్రియలను కొన్ని సంవత్సరాలపాటు అక్కడే నిర్వహించుకోవచ్చు. ఎక్కడో చనిపోయినవారి సంస్మరణ కోసం కూడా ఏర్పాట్లు ఉన్నాయి. ఇందుకోసం గోడలపై వారి పేరు, మరణ తేదీలతో కూడిన శిలాఫలకాలను అమరుస్తారు. 350 ఎకరాల స్థలంలో గల సెయింట్ అడల్బెర్ట్ శ్మశానవాటికలో 125 సంవత్సరాల్లో మూడు లక్షల అంత్యక్రియలు జరిపినట్లు రికార్డులు తెలుపుతున్నాయి. శ్మశానంలోని ఆఫీసు సిబ్బంది మృతుల జాబితాలను జాగ్రత్తగా నిర్వహిస్తుంటారు.

### భారీ వ్యాపారసరళి

షికాగోలో ఆ మాటకొస్తే అమెరికా అంతటా ప్రస్తుతం ముందస్తు అంత్యక్రియల ఏర్పాట్ల వ్యాపారం జోరుగా సాగుతోంది. శ్మశానంలో స్థలాల బుకింగ్ కోసం ఏకంగా ఏజెంట్లను రంగంలోకి దింపారు. గతంలో జీవిత బీమా కంపెనీల మాదిరిగా ఈ ఏజెంట్లు శ్మశాన స్థలం అడ్వాన్సు బుకింగ్‌లు జరుపుతున్నారు. కొందరయితే ఇన్‌స్టాల్‌మెంట్ అవకాశం కూడా కల్పిస్తున్నారు. పేరుపొందిన శ్మశానాల్లో స్థలాన్ని కలిగి ఉండటం ఒక హోదాగా మారిపోయింది. అనాథ వృద్ధుల కోసం ప్రత్యేక అంత్యక్రియల పథకాలను అమలుచేస్తున్నారు. మనలా శవాన్ని మోసే నలుగురు లేరనే బాధ లేకుండా అమెరికాలో అంత్యక్రియల తంతు నడుస్తోంది.

**– పుట్టా సోమన్న చౌదరి**

కోసం దాచుకున్న డబ్బు దొంగిలించాడు.

ఆ ప్రేమికుడు మౌనంగా తన ప్రేయసి చంచలత్వంతో కూడిన చేష్టల్ని తమాషాగా చూస్తున్నాడు. ఆమె ఇప్పుడు తన దగ్గరికి వచ్చి మోకాళ్లపైన కూర్చుంది. తర్వాత ఆమె అంది "పద అక్కడ ఉన్న చెక్క బల్లని కింద వేసుకుని కూర్చుందాం! వ్రజ లోని కొందరు దుష్ట యువకులు మాధవ నారాయణ మందిరంలోని పండాల అన్యా యాన్ని వెలుగులోకి తెచ్చేందుకు ఆ బోర్డుని తయారుచేశారు.

మనం కొంచెం సేపు ఇక్కడ విశ్రాంతి తీసుకోవచ్చు తుపాను ఆగేంత వరకు. అబ్బ, ఎంత భయంకరంగా ఉంది తు పాను! బయట అంతా అల్లకల్లోలంగా ఉంది. చూడు అలలు ఎంత ఉవ్వెత్తున ఎగసిపడుతున్నాయో. అవి ఇక్కడిదాకా వస్తాయా? మనల్ని ముంచెత్తుతాయా? నీకు తెలు సో? లేదో? చాలా రోజుల క్రితం నాకు ఇలాంటి దృశ్యమే కలలోకి వచ్చింది. అలల ఉపరితలం కసాయివాడి తలలా అన్పించడం లేదా? ఎంత విచి త్రంగా కనిపిస్తున్నాయవి! ఎంత భయం గొల్పుతున్నాయి" ఆ తర్వాత కొంతసేపు ఆగి విచారవదనంతో సౌదామిని అంది, "మా అమ్మ ఇంకెంతో కాలం బతకదు. ఇక నా సంగతి చెప్పాలంటే ఆమె అకాల మరణానికి నన్ను నేను దోషిగా భావి స్తాను. మా అమ్మ గురించిన ఆలోచనలు రావడంతో నా హృదయం బరువెక్కిపో తోంది. ఉవ్వెత్తున ఎగిసి పడుతున్న ఆ అలలు నన్ను చుట్టేస్తాయేమోననిపిస్తోంది. గుర్రాల గిట్టల చప్పుడు వంటి ఆ కలల భయంకర శబ్దాలు నాపైన దాడి చేస్తా యోమోనని నాకనిపిస్తోంది.

నా చెంతకు రా! నా ప్రాణమా! నా దగ్గరకంటా రా! నన్ను ముద్దాడు. నా హృదయ జ్వాలలను చల్లా ర్చు. అది నాకు అవసరం. అత్యవసరం. నాలో చుల కన భావం లేదు. ఇది నన్ను నేను పరీ క్షించుకోవడం లాంటిది. బహుశా నువ్వు నా భావాలని ప్రశంసించలేవు. నా దగ్గరకంటా రా ప్రియా. మనం ఇక్కడ కూర్చుందాం. ఈ చెక్కబల్లపైన ఒకరి మీద ఒకరం అన్నంత దగ్గరగా"

వాళ్లు ఆ చెక్కబల్లపైన కూర్చున్నారు. మాధవనారాయణ మందిరంలోని అనైతిక పనులకు సాక్షీభూతం ఆ బల్ల. ఆ క్షణాన అక్కడ కూర్చున్న వాళ్లిద్దరూ రెండు పవిత్ర పూజాపుష్పాల్లా కనిపిస్తున్నారు.

మరికొంత సేపట్లో తెల్లవారుతుందనగా కూడా తుపాను ఆగలేదు. సౌదామిని గు డిసెలోంచి బయటికొచ్చినప్పుడు తుఫాను తగ్గుముఖం పట్టినట్లు అనిపించింది. కానీ తగ్గలేదు.

ఇంకా భీషణంగా మారింది. నది నీటి మట్టం అంతకంతకూ పెరుగుతోంది. నుర గలుగక్కుతూ పొంగి పొరలుతోంది. సౌదామిని అటువైపు వెళ్లింది. ఆకాశంలో గర్జనల మధ్య తన అస్తిత్వాన్ని బాధ, ఒంటరితనంలోని దయనీయమైన స్వరం వెంబడిస్తున్నట్లనిపించింది సౌదామినికి. దుఃఖం అస్పష్టంగా ఆమె ఆత్మని మార్దవం గావించింది. 'ఈవిధంగా జరగా లని నేను భావించానా? సరిగ్గా ఇలాగే జరగాలనుకున్నానా?' అంటూ మాటిమా టికీ తనను ప్రశ్నించుకుంది సౌదామిని.

ఆమె పూర్తిగా విభిన్నంగా ఆ భయంకర గిట్టల శబ్దం వింటున్నట్లుగా అనిపించింది. ఆమె చింతనతో, అనిశ్చితితో అస్త్రశస్త్రాలు లేని ఓ దెబ్బతిన్న సిపాయిలా నిరీక్షించసా గింది. కానీ ఎవరికోసం ఈ నిరీక్షణ, సందేహాస్పదమే.

సమయం గడచిపోతోంది. తను వెనక్కి తిరిగి వెళ్లిపోవాలా? ఎవరి దగ్గరికని వెళ్లాలి? మరణించిన తన భర్త దగ్గరికా. చెదిరిపోయిన ఆర్ద్రతతో కూడిన జ్ఞాపకా లని ఆశ్రయించాలా?

సౌదామిని తుపాను రాత్రి నాటి భీభత్స స్థితిలో గడిపిన స్థలం వైపు చూసింది. సమయం నిరాశాజనకంగా గడుస్తున్నట్లనిపించింది సౌదామినికి. తన తల్లిని కబళించడానికి మృత్యువు వేగంగా సమీపిస్తోంది. ఎందుకు ఇలా అయ్యింది? ఎందుకు. అయ్యో! ఇతర నిస్సహాయ జీవుల ఆత్మలు ఆమె ఎదుటే జీవితంలోని వాస్తవమైన ఆశ్రితులని ఏకీకృతం ఎందుకు చేసినట్టు? బుద్ధిమతతో సరితూగే మాటలు ఇవి. ఇవి బంగారు చట్రంలో బంధించదగ్గవి. ఇదే ప్రదేశంలో గతంలో దేవఝరి బాబా జీవనానికి, జగత్తుకు సంబంధించిన అమూల్య ప్రవచనాలు చేశారు. అక్కడ కూడిన రాధేశ్యామీలు ఆయన మాటల్లో లీనమైపోయారు. ఆనందపారవశ్యాలతో కన్నీరు కార్చారు. బాబా పాదధూళిని శిరస్సుపైన చల్లుకుని కోరికలు కోరుకున్నారు. "నా జీవితం, నా అవయవాలు, నేను ఉన్నచోటే రాలిపోనీ. నా మాంసం, నా ఎముకలు నా తత్వంలో విలీనమైపోనీ. అయినప్పటికీ నేను చలించకూడదు. ఎప్పటివరకు అంటే, ఆత్మబోధ వాస్తవ ప్రకాశం నాలో ఉదయించనంతవరకు.. ఆత్మజ్ఞానం వాస్తవమైంది, దుర్లభమైంది. అతికష్టం మీదే దానిని పొందగలం. ఎన్నో యుగాల ఆడంబరం లేని ధ్యానం తర్వాతనే"

"మీ ఆవేశాలపైన, లౌకిక బంధనాల పట్ల నియంత్రణ పొందండి" అన్నాడు ప్రబోధకుడు. అర్ధనారీశ్వరుడైన ఆ భగవంతుడు ఎన్నడైనా తన ప్రేయసి మోహాన్ని చూడగలిగాడా? " అన్నాడు ప్రబోధకుడు

"వాస్తవం బంగారు పొరల కింద నిక్షిప్తమై ఉంటుంది. ఆ పొరని తొలగించండి. ఓ సూర్యుడా! మమ్మల్ని ఆదుకునే ఆ సత్యాన్ని చూడగలుగుతాం"

బుద్ధిమతతో కూడిన పదాలు న్యాయాన్ని పవిత్రతని ప్రతిబింబిస్తాయి. అమూల్యమైనవి బంగారు చట్రంలో బంధించదగ్గవి. బాధాకరమైన విషయమేమిటంటే ఆ ఉపదేశంలోని ఒక్క శబ్దం కూడా సౌదామినిని ప్రభావితం కావించలేకపోయింది.

పోటెత్తుతున్న నదిలోని అలలు సౌదామిని చెంతకు వస్తున్నాయి. చల్లగాలి ఎముకల్ని వణికిస్తోంది. ఓ కొత్తరోజు ఉదయించాల్సి ఉంది.

అనుపమ, తన తల్లి మరణిస్తుంది. అతి త్వరలో మరణిస్తుంది. మరణం ఆమెని విజేతగా ప్రకటిస్తుంది. ఆ తర్వాత స్వర్గాన్ని జ్ఞాపకం చేసుకుంటుంది. వెంటనే మూసుకున్న ఆత్మద్వారాలు ఒక్క క్షణం పాటు తెరుచుకుంటాయి. ఓ దివ్యమైన కాంతి బయటకొస్తుంది. ఆమె ఆ భీషణ భయాన్ని దర్శిస్తుంది. లేదు, అనుపమని తనపైన విజయం సాధించకుండా చేయాలి. కానీ ఎందుకలా? సౌదామిని తన

## వడ్డీకాసుల వాడికీ తిప్పలు!

'ఫలానా ఘనుడు పాట రాయించుకుని డబ్బులు ఎగ్గొట్టాడు గురూగారూ!' అని ఓ పాటల రచయిత వేటూరిగారికి మొరపెట్టుకున్నాడు.



'రోలు వచ్చి మద్దెలతో మొరపెట్టుకున్నట్టుంది' అన్నారు వేటూరి.

'అదేంటి గురూగారూ! మీక్కూడానా? ' ఆశ్చర్యపోతూ అడిగాడాయన.

'వడ్డీకాసుల వాడికే ఎగ్గొట్టే మహానుభావులున్నారు నాయనా' అని వేటూరి వ్యంగ్యంగా చమత్కరించారు.

అభిప్రాయాన్ని సిద్ధింపజేసుకునేందుకా!

తర్వాత సౌదామిని తన ప్రియుడితో సున్నితంగా అంది, "నన్ను క్షమించు. వెళ్లిపో! నన్ను మన్నించు"

సరిగ్గా అప్పుడే మళ్లీ కుండపోతగా వాన మొదలైంది. ఆకాశంలో పెద్దపెద్ద మేఘాల తునకలు ఒకదానినొకటి ఢీ కొడుతున్నట్టుగా ఉన్నాయి. గాలి బలంగా వీస్తోంది. సౌదామిని తన బలహీన శరీరంతో చింపిరి గుడ్డల్లో దూరిపోయింది. పీపా బ్రిడ్జి ఆవలివైపున ఎక్కడో ఆకాశం గర్జించింది. పిడుగు పడింది. కానీ ఇంతటి విస్తారమైన సన్నాహం వల్ల ఉపయోగం ఏముంది? కానీ ఆ తత్వాలని చిన్న వయస్సున్న పిల్లకి, దాడిలా బాగా గాయపడ్డ, జీవితాన్ని స్వాగతించేందుకు ఇంతటి క్రియాశీలంగా ఎందుకు మారాలి?

సౌదామిని ముందుకు కదిలింది. ఆమెకి తెలుసు ఇది ఓ సువర్ణావకాశమని, అది తిరిగి రాదని. అలలు గర్జిస్తూ నాట్యం చేస్తున్నాయి. ఒడ్డును తాకుతున్నాయి. సౌదామిని మరింత ముందుకు సాగింది. ఓ హెచ్చరికలాంటి కేక పీపా బ్రిడ్జి వైపు నుంచి వినిపించింది. "మన పవిత్ర మాత రాధ పేరుతో నేను నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను. అడుగు ముందుకి వేయకు. నదిలో వరద వచ్చేసింది"

ఆ స్వరాన్ని సౌదామిని గుర్తుపట్టింది. అది పరిచితమైందే. ఆ పాములు పట్టే వాడి గొంతు అని గుర్తుపట్టింది. ఆ భయంకర వాతావరణాన్ని తనకు అనుకూలంగా ఉపయోగించుకుంటున్నాడు.

'రాధాకీ జై' అన్న పవిత్ర శబ్దం ఆ విపత్కర క్షణంలో భూమ్యాకాశాలలో వ్యాపించినట్టుగా అనిపించసాగింది సౌదామినికి. సమయం ముగిసిపోతోంది. ఇంకా ఆలోచించి ఏం ప్రయోజనం? కేవలం అవన్నీ వృథా ఆలోచనలే. కానీ ఓ ప్రధానమైన ప్రశ్న సౌదామినిని వెంటాడి చికాకుపెడుతోంది. ఆమె ఆ భయంకరమైన ఒడ్డుకి చేరుకుంది. కానీ ఇలా ఎందుకని? బహుశా ఇలాగే జరగాలని వుందా? కానీ ఎందుకని? చివరికేమిటిదంతా?

తర్వాత చివరి గెంతు, తెల్లవారింది. తుపాను వదిలిన మరకలతో నిండిన ఆ నది ఒడ్డున సౌదామిని దుపట్టాని గుర్తించారు అక్కడి కొందరు. అది మరోరంగు దుపట్టాతో కలసిపోయివుంది. అది తన భర్త జీవించి వుండగానే అంతిమశ్వాస విడిచిన ఓ అదృష్టవంతురాలిది.

నది ఒడ్డున వదంతులు వ్యాపించాయి. అక్కడి గుంపులో రాధేశ్యామీలు అధికంగా వున్నారు. మొదటి విపత్తు పూర్తయింది. సౌదామిని నిష్క్రమించింది. ఆత్మ గురించి ఎలా కావాలనుకుంటే అలా ఎన్నోరకాల కల్పనలు చేసింది ఆమె. కానీ వాటిల్లో ఆమెకు ప్రియమైంది ఏదీ లేదు. అందులో ఒక్కటి కూడా సానుభూతి పూర్వకంగా లేదు. ఆమె దుపట్టా, ఇసుకలోంచి తవ్వి బయటకి తీసింది. సౌదామిని అవ్యక్త చరిత్రను తిరగదోడేందుకు దాన్ని ఓ చిహ్నంగా వుంచారు. ఎవరికి తోచిన అర్థం వారు దానికి చెప్పుకోవచ్చు.

★ ★ ★

సౌదామిని స్మృతులు తొందరగానే విస్మృతి అగాధంలోకి జారిపోయాయి. నీటిపైన, వెదురు మంచెపైన ఉండే దేవఝురి బాబా మరోసారి భక్తుల్ని ఆకర్షించసాగాడు. బాబా మాటల్ని వినేందుకు ప్రజలు నదితీరాన మూగసాగారు.

సౌదామిని మరణించిన తర్వాత కళాకారుడు రాకేష్ ఎన్నోరోజులు ఇసుకలో తిరుగుతూ కనిపించాడు. తర్వాత అతను అష్టసఖి మెట్ల మీద కూర్చుని ఒక చిత్రాన్ని రూపొందించడం మొదలుపెట్టాడు.

పండాల సమూహం కొత్త తీర్థయాత్రికుల కోసం అశ్లీల జోకులు వేయసాగారు. వాళ్లు రాకేష్‌తో "మహాశయా! మీరు కేవ

లం పాదముద్రలే చిత్రీకరిస్తున్నారు. కానీ వాటిని కొనేవారెవ్వరు!" అన్నారు.

ఆ కళాకారుడు ఉత్తేజితుడయ్యాడు. "నేను ఏవైతే చిత్రీకరిస్తున్నానో వాస్తవంగా అవి పదచిహ్నాలే. నేను యమున దగ్గర ఇసుకలో వీటిని తాజాగా సేకరించాను. నేను సవాలు చేస్తున్నాను, ఇందులో ఏది హిందువుదో, ఏది ఈసాయిాదో, ఏది ముసల్మానుదో మీరెవరైనా చెప్పగలరా? "

ఆ మూర్ఖులు అవాక్కయ్యారు. ఆ కళాకారుడు ఇప్పుడు ఒక రొట్టెముక్క కోసం భిక్షాగృహాలకు తిరుగుతున్నట్టుగా వాళ్లు విన్నారు. మతిస్థిమితం లేనివాడిలా అతను రాధేశ్యామీల గుడిసెల దగ్గర కూడా తిరగడం చూశారు వాళ్లు. తన దగ్గర వున్న ఒకే ఒక దుప్పటిని అతను నిద్రిస్తున్న ఓ ముసలి రాధేశ్యామీపైన విసిరేశాడు.

కొన్నిరోజుల తర్వాత పండాలు ఆ వృద్ధ కళాకారుడిని మధుర జంక్షన్ రైల్వేస్టేషన్ దగ్గర చూశారు. కొత్తగా వచ్చే తీర్థయాత్రికుల్ని పవిత్ర వ్రజభూమికి తీసుకువెళ్లే సన్నాహాలు చేస్తున్న ఆ పండాలు ఆయనతో అన్నారు, "నిన్ను ఎలా గుర్తుపట్టడం? ఒకవేళ మేం మళ్లీ ఎప్పుడైనా నిన్ను కలవాలనుకుంటే ఎలా? అసలు నువ్వు ఎక్కడ వుండాలనుకుంటున్నావు? "

కళాకారుడు నవ్వుతూ అన్నాడు, "మొఘల్‌శైలి చిత్రకారుల్లో ఆఖరి చిత్రకారుడు రాంప్రసాద్ గురించి కళాకారుడైన రాయ్ కృష్ణదాస్ ఏం చూశాడో? చెప్పాడో? మీకు గుర్తులేదా? స్వాభావికంగా అతను నిజాయితీ దృక్పథం గలవాడని, సౌందర్య పిపాసకుడని అంటూంటారు. నా ఉద్దేశంలో అతను భిన్నమైనవాడు. వాస్తవమైన గ్రహింపు అతనిలో విరాజమైన సౌందర్య ప్రశంసల్లో నిహితమైంది. రాంప్రసాద్ పరిశీలన చాలా గంభీరమైనది లోతుల్లోకి చొచ్చు కుపోయేది. ఓ చిత్రకారుడిగాను, గాయకుడిగాను సమాన యోగ్యతలు కలవాడతను. కానీ బాధాకరమైన విషయమేమిటంటే అలాంటి మహానుభావుడు తన జీవితం అభావంతోను దారిద్ర్యంతోను గడపాల్సి వచ్చింది. ఇప్పుడు మీరు రాయ్‌కృష్ణదాస్ మాటలని గుర్తుకు తెచ్చుకోవచ్చు. కాశీలోని ఓ అసహ్యమైన సందులో ఆ మొఘల్‌శైలి చిత్రకారుల గొప్ప ప్రతినిధిని ఎలా గుర్తించాలో అతనికి తెలుసు. మీకు ఆ ప్రవీణుడు తెలుసా? కళాకారుడు అంటూ" అతని అసహ్యాకరమైన వ్యవస్థిత గడ్డం, మాసిపోయిన ధోవతి, ఇంకా భుజాలపైన పడివున్న శుభ్రమైన శాలువాతో తరచుగా అతను కాళ్లకి చెప్పులు లేకుండా నడుస్తాడు. అయినా కూడా మీరు అతణ్ణి ఇట్టే గుర్తుపట్టేస్తారు. నేను ఏ కళకీ ఎలాంటి అంతిమ ప్రతినిధినీ కాను. వ్రజలోని అష్టధాతు కళాకారుల అయోగ్య వారసుణ్ణి. రాంప్రసాద్‌జీని అతని శుభ్రమైన శాలువాతో గుర్తించవచ్చు. కానీ నేను అలాంటిదేమీ ధరించను. ఇప్పుడెలా వున్నానో అలాగే శాలువా లేకుండా నన్ను మీరు చూస్తారు. రాంప్రసాద్‌జీ గాంధీ టోపీ కూడా ధరించేవాడు అన్నారు వాళ్లు, నా నెత్తిమీద కూడా గాంధీ టోపీని చూడవచ్చు. ఉజ్వలంగా మెరిసే శుభ్రమైన గాంధీ టోపీ"

"గాంధీ టోపీయా? " అడిగారు పండాలు ఆశ్చర్యంతో.

"ఔను, ఒక గాంధీ టోపీ. నా ఉద్దేశం అదే. నేను తరచుగా పాదాలకి చెప్పులు లేకుండానే నడుస్తాను. అయినా ఓ నిర్మలమైన గాంధీ టోపీ నా శిరస్సుని శోభాయమానం చేస్తుంది"

వాళ్లకి నమ్మకం కలిగించేందుకు చివరగా ఆ కళాకారుడు అన్నాడు, "పరిపూర్ణమయ్యేందుకు ఇది ఎప్పటికీ నా గుర్తుగా వుంటుంది. ఓ గాంధీ టోపీ, నిర్మలమైన తెల్లని పరిశుభ్రమైన టోపీ.

# తాళం తెచ్చిన తంటా!!



– కె.వి.లక్ష్మణరావు

## చతుర కథ

మత్తుగా నిద్రపోతున్న తాయారమ్మ బయట అలికిడికి ఒక్కసారిగా ఉలిక్కిపడి నిద్రలేచింది.

భర్త బంగారయ్య వైపు చూసింది. అతడు గుర్రుపెట్టి నిద్రపోతున్నాడు. కానీ బయట చప్పుడు అలాగే వినిపిస్తోంది. చడీచప్పుడు గాకుండా మంచంపై నుండి లేచి వరండాలోకి వెళ్ళింది. చప్పుడు వినిపిస్తోన్న దిశగా చూసింది.

ఇంకేముంది? ఎదురింటి తాళం కప్పను ఎవరో వ్యక్తి పగలుగొడుతున్నాడు.

అంతే! ఒక్క ఉదుటున భర్త వద్దకెళ్ళి "ఏమండోయ్? మిమ్మల్నే లేవండి! ఘోరం జరిగిపోతోందండీ!" అంది. భర్త ఎంతకీ లేవకపోయేసరికి "మొద్దు నిద్రపోతే మీరూ కుంభకర్ణుడూ ఒక్కటే!" అంటూ విసుక్కుంది.

ఈయనకి ఇలా కాదంటూ, చెంబుడు నీళ్ళు మొహంపై దిమ్మరించింది తాయారమ్మ.

"ఛీ! ఛీ! బంగారం లాంటి నిద్రను పాడుచేశావు కదే!" బంగారయ్య తిట్టుకుంటూ లేచాడు.

"ఊరకనే నిద్ర లేపాననుకున్నారా? అక్కడ ఆ మనకెదురుగా ఉండే అన్నయ్యగారింట్లో దొంగపడ్డాడు!"

"ఆ! ఏమిటీ? నారాయణ ఇంట్లో లేని సమయం చూసి దొంగ దూరాడా? నిజమేనా?" అంటూ వరండాలోకి వెళ్ళి చూశాడు.

"నిజమే తాయారు! నారాయణ ఊరెడుతూ మా ఇంటిపై కన్ను వేసుంచమని చెప్పాడు"

"ష్! మెల్లగా మాట్లాడండి!"

"వాడి వాలకం చూస్తే దొంగలా ఉన్నాడా? సూటు.. బూటు.. టక్.. ఎంత టెక్కుగా ఉన్నాడో!"

"అవునే తాయారూ! ఈ మధ్యన దొంగలు ఎర్రబనీను.. గళ్లపంచీ.. కోరమీసాలతో పాత సినిమాలో రాజనాల మేకప్‌లో రావడం లేదు. వాళ్లు దొంగపనికి కూడా దొరల వేషాలేస్తున్నారట! ఈమధ్య పేపర్లో ఈ విషయమే రాశారు కూడా!"

"చాల్లెండి! ఇప్పుడా విషయాలు చెప్పుకుంటూ మీనమీషాలు లెక్కించడం మన మూర్ఖత్వమే అవుతుంది. అవతల అన్నయ్యగారిల్లు గుల్లగాకుండా ఆ 'దొంగ' కంట్లో కాసింత కారం కొట్టండి!"

"నేను కొట్టలేనే తాయారు!"

"మగపుట్టుక పుట్టి ఇంత పిరికేమీటండీ? "

"నువ్వు పిరికనుకో? మరోటనుకో! నా వల్ల గాదు! కావలిస్తే నీవు కారం కొట్టు! నీకు తోడుగా నీ వెనుక ఉంటాను. ఏమంటావ్? "

"సంతోషించాం! ఈ కారం పొట్లం మీ చేతిలో ఉంచుకుని నా వెనుకనే రండి! ముందు నేను ఈ కర్రతో ఆ దొంగ వెనుకగా వెళ్ళి వాడి వీపుపై గట్టిగా ఓ దెబ్బ కొడతాను! 'అమ్మా!' అంటూ వాడు నా వైపు తిరుగుతాడు! వెనువెంటనే ఆ కారం వాడి కళ్ళల్లో కొడతా! ఆ దెబ్బకు వలలో పడిన చేపలా గిలగిలా గింజుకుంటాడు! ఎలా ఉందండీ? నా ఐడియా? "

"సూపర్ తాయారూ! నీ దెబ్బతో ఆ దొంగ జీవితమే మారిపోతుంది"

"ష్! మెల్లగా! అడుగులో అడుగేసుకుంటూ నా వెనుకనే రండి!"

"పాపం! ఆ దొంగ వెధవకు ఇంకా తాళం బద్దలవలేదే? "

"ష్! మాట్లాడకండీ! మీ బుర్ర తక్కువ మాటలు వాడి చెవిన బడితే.. కాలికి 'బుద్ధి' చెప్పేస్తాడు"

"అలాగేనే! ఇంక మాట్లాడనులే!"

దొంగ వెనుకగా చేరుకున్న తాయారమ్మ ఆ కర్రతో దొంగవీపుపై అమాంతం ఒక్క దెబ్బేసింది!

'చచ్చాన్రా దేవుడా!' అంటూ ఆ దొంగ ఆ దెబ్బకు కిందపడ్డాడు!

ఆ దొంగ కళ్ళలో కారం కొట్టబోతూ.. తేరిపార చూసేసరికి తాయారమ్మ నిశ్చేష్టురాలైంది! బంగారయ్య కిందపడిన దొంగను చూసి "నారాయణా! నువ్వా! లే!" అంటూ మెల్లగా చేయందిస్తూ పైకి లేపాడు.

కొంతసేపటికి తేరుకున్న తాయారమ్మ "అన్నయ్యగారూ! మీ ఇంటి తాళం మీరే బద్దలకొట్టే ఖర్మ పట్టిందా? "

"ఏం చేయను చెల్లమ్మా! ప్రయాణంలో తాళం చెవి పోగొట్టుకున్నాను. ఎంత వెతికినా దొరకలేదు సరిగదా! ఇంటికొచ్చేసరికి అర్ధరాత్రి దాటింది. వేరే దారిలేక రాయితో తాళం పగలుగొడదామని.. ఈ చీకట్లో ఓ రాయి వేశాను. కానీ ఆ రాయికి తాళం పగల్లేదు.. నా వీపు పగిలింది. 'అమ్మా..!' అంటూ మరొక్కసారి మూలిగాడు నారాయణ. ©


## కొత్త గొంతులకు స్వాగతం

**తళుక్కున మెరిసే హైకూలు**

**చురుక్కుమనిపించే నానీలు**

మీ ఆలోచన ఏదైనా అక్షర రూపం ఇవ్వండి.

క్లుప్తంగా నాలుగైదు పంక్తులకు మించకుండా చూసుకోండి.

ఆ ఆలోచనకు వేదికగా నిలుస్తుంది **చతుర**

మీ కవితను పంపాల్సిన చిరునామా :

సంపాదకుడు, చతుర, ఈనాడు కాంపౌండ్,

సోమాజిగూడ, హైదరాబాద్-500 082




పురాణం సుబ్రహ్మణ్యశర్మ

# హంగామా

నిర్వహణ : వి. రాజారామమోహనరావు

**హంగామా పేరుకి తగినట్లే, అంతా హడావిడి, అల్లరి కథ. ఈ కథ వెనుక పురాణం సుబ్రహ్మణ్యశర్మగారి తాలూకు హాస్యం, వ్యంగ్యం, విమర్శలాంటి చురకలు పుష్కలంగా వున్నాయి. అప్పటి ఆంధ్రజ్యోతి వారపత్రికలో సంపాదకులుగా రాసిన ఇల్లాలి ముచ్చట్లు, పుస్తక సమీక్షలు, విమర్శనా వ్యాసాలు, ప్రముఖుల జయంతి, వర్ధంతి సందర్భాలలో విషయవివరణ.. ఇలా ఏది రాసినా పురాణంవారి ముద్ర కొట్టొచ్చినట్టు ఉంటుంది. 'హంగామా' ఆయన చివరి నవల. ఈ చిన్న పుస్తకాన్ని రావిశాస్త్రిగారికి, వారి శ్రీమతికి అంకితం చేశారు. 1995లో అంటే దాదాపు ఇరవై ఏళ్ళ క్రితం రాసిన నవల ఇది.**

కురంగేశ్వరావు, సూర్యకుమారి భార్యాభర్తలు. సూర్యకుమారికి కొంచెం నోటి దురుసు ఎక్కువ. కురంగేశ్వరావు బాగానే మాట్లాడతాడు కానీ, భార్యతో పోలిస్తే మాటల తక్కువ మనిషే. ఇద్దరూ కలిసి సినిమాకి వెళ్లటంతో నవల ఆరంభమవుతుంది. నిజానికి సూర్యకుమారి పోరు పెట్టి కురంగేశ్వరరావుకి సినిమాకి ఈడ్చుకెళ్ళింది అంటారు రచయిత. ఆమె నోరంటే భయం కురంగేశ్వరావుకి. అందులో సినిమాహాల్లో నలుగురి ముందూ ఏమంటుందోనని మరీ బెదురు. సూర్యకుమారి అననే అనేసింది.. "మనకి తెలిసినవాళ్ల బట్టతల నవ్వు తెప్పించదు కదండీ" అని మొగుడితో. సదరు మొగుడికి బట్టతల. ఇలాంటి భార్య మాటలంటే భయం, సిగ్గు, బెదురు, అలా .. రకరకాలు కురంగేశ్వరావుకి.




ఈ నవలలో మొదటి భాగమంతా భార్యభర్తలిద్దరు సినిమాకి వెళ్ళి వచ్చిన కథే. ఎవరితోనో ఒకరితో కల్పించుకు మాట్లాడితేనేగానీ సూర్యకుమారికి తోచదు. సినిమాహాల్లో ఆమె పక్క సీట్లోకి ఏ ముసలో ముతకో రాలేదు. కిరీటి అనే ఓ యువకుడు వచ్చాడు. వస్తూనే సూర్యకుమారి కాలు తొక్కి 'సారీ' అన్నాడు. 'వెధవ్వేషాలు' అంది సూర్యకుమారి. మాటామాటా పెరిగింది. అదంతా చూసి చేసేదేంలేక యథాప్రకారం సీటు మారాడు కురంగేశ్వరావు.

అక్కడ పక్కన మరో సీట్లో అతను నవ్వుతూ చప్పుడు వచ్చేలా, ఆపకుండా ఏదో ఒకటి తింటూనే వున్నాడు.

"మంచి ప్రిపరేషన్‌తో వచ్చినట్టున్నాడే" అంది సూర్యకుమారి.

"ఏమిటి అంటున్నారు? " అన్నా డు, చప్పుడులో మాట వినిపించనట్టు ఆ తింటున్న వ్యక్తి.

"మీరు తింటూనే భలే మాట్లాడతారే జోక్యులర్‌గా" అంది.

తింటున్న బజ్జీల పొట్లం సూర్యకుమారికి జనరస్‌గా అందించాడు. సూర్యకుమారి భర్తకి కూడా ఇచ్చింది. అందరూ కలిసిపోయారు తిండిలో.

'తినే వాడికి హాయిగానే వుంటుంది గానీ, తుప్పరమంది.. రసోల్లాసం వాడిది' అంటారు రచయిత సినిమాహాల్లో తిండి గురించి చురక లేస్తూ. సినిమా మధ్యలో ఎందుకు గుర్తొచ్చిందో

# అక్షరాలతో అల్లరే అల్లరి!



సుప్రసిద్ధ హాస్యవ్యంగ్య రచయితల్లో పురాణం సుబ్రహ్మణ్యశర్మగారు అగ్రేసరులు. వార, దిన పత్రికలకు సంపాదకులుగా వ్యవహరించడమే కాదు, ఆ రోజుల్లో ప్రత్యేకమైన రచనా శైలికి శ్రీకారం చుట్టారు. సంపాదకీయాలే కాక, 'పురాణం సీత' కలంపేరుతో శర్మగారు 'ఇల్లాలి ముచ్చట్లు' శీర్షికన రాసిన వ్యాసాలు ఆంధ్రపాఠక లోకాన్ని ఎంతోగానో అలరించాయి. చైనా రాజకీయాలు మొదలు చీపురుకట్ట వరకు తడవని అంశం లేదు. ఏది రాసినా శర్మగారి ముద్ర విలక్షణంగా కనిపించేది. అటు కథలైనా అంతే. ఇక నవలలైతే చెప్పేపనే లేదు. సమకాలీన రాజకీయ, సాంఘిక జీవితంపై వ్యంగ్యం అవసరమైన చోట్ల చురకలు కొల్లలుగా కనిపిస్తాయి. పాత్రలు, సంఘటనలు నిజజీవితంలో తారసపడినట్లుగానే కనిపిస్తాయి. కవ్విస్తాయి. కొన్నిచోట్ల ఆలోచింపజేస్తాయి. కథాసాగరం (15 కథలు), కలకానిది (7 కథలు), నీలి (5 కథలు), శివకాంత (13 కథలు) కథా సంపుటాలు వెలువడ్డాయి. నవలలతో పాటు వ్యాసాలు, విమర్శలు, సమీక్షలు ఇలా ఎన్నో ప్రక్రియల్లో వీరి రచనా రంగం సాగింది.

అకస్మాత్తుగా కిరీటిని.. "మీరు 'ఫీవర్' నవల చదివారా? " అనడిగింది సూర్యకుమారి.

"లేదండీ" అన్నాడు సిగ్గుపడుతూ.

"వెధవది కుర్రాళ్ళు ఇప్పుడేం చదవరండీ" అంది. అని ఊరుకోలేదు. "కమర్షియల్ తెలుగు కింగ్ నవలలేవీ చదవలేదా? ఫీవర్లూ అని తెలుగులో రాశాడు మీలాంటి వాళ్ళకోసం" అంది.

సూర్యకుమారి మాటలు తట్టుకోలేక కిరీటి కుర్చీ ఖాళీ చేసి వెళ్ళిపోయాడు.

ఇంక అప్పుడు సినిమాలో లీనమైంది సూర్యకుమారి. సినిమాలో ఇంటర్వెల్ ముందు ఒక బ్రేక్ డాన్స్ సీను పెట్టారు. రైల్వేస్టేషన్‌లో ఇటూ అటూ రెండు రైళ్ళు ఆగి వున్నాయి. ఓ యాభై మంది యువతీ యువకులు నవీన డ్రెస్సుల్లో ఒళ్ళు విరుచుకుంటూ, అసహ్యంగా కాళ్ళు జాపుతూ, రకరకాల భ్రష్టధ్వనులు చేస్తూ ముక్కుతూ, మూలుగుతూ ఓ కీర్తన పాడుతున్నారు. అందులో 'చంకనాక' ఉందనుకోండి. కొందరు 'చంక' పట్టుకుంటే, మరికొందరు 'నాక.. నాక' అంటూ రిపీట్ చేస్తున్నారు. అందరూ ఏక కంఠంతో 'అమ్మ' అంటే 'అమ్మ.. రెమ్మ.. కొమ్మ..' అని మిగిలినవాళ్ళు అరుస్తున్నారు. ఫ్లాట్‌ఫారం మీద వున్న రైళ్ళలోకి ఎక్కిదిగుతూ 'కుయ్యో, మొర్రో' అంటూ ఎగురుతున్నారు.

పూర్వం సినిమాల్లో అయితే 'చల్లగాలిలో' అనో, '.. నీకోసమే నే జీవించునది' అనో పల్లవి, చరణాలు రాగయుక్తంగా వుండేవి.. అనుకున్నాడు కురంగేశ్వరావు. సూర్యకుమారి మాత్రం రావు భుజం మీద దరువు వేస్తూ, కూర్చున్న కుర్చీలో మెలికలు తిరుగుతోంది. 'ఎవరి సంగీతం' వారిది అనుకున్నాడు రావు.

ఈ నవలంతా ఇలాంటివే చిన్నచిన్న సంఘటనలు. ఆయా సందర్భాలలో వచ్చి వెళ్ళే చిత్రమైన పాత్రలు, వాళ్ళ వాక్చాతుర్యం, అందులో హాస్యం, అంతర్లీనంగా సమాజరీతి మీద, కళామాధ్యమాల దిగజారుడు మీద బలమైన విమర్శ. నవలా రచనలో ఇదో కొత్త సంవిధానం. ఎంత మాత్రం బరువైన కథాంశం లేకుండా ఇలా నవల రాయటం పురాణం బ్రహ్మణ్యశర్మగారికే చెల్లుతుంది.

నవల నడవాలి కాబట్టి, ఒక సూత్రం వుండాలి కాబట్టి పురాణంవారు ముడిపెట్టిన మరోకథకి, నాయకురాలు లీలావతి. ఈ లీలావతి.. కురంగేశ్వరావుకి మేనత్త కూతురు. లీలావతి నెల్లూరు నుంచి బస్సులో వస్తోందని టెలిగ్రాం అందుకుంది సూర్యకుమారి. వచ్చేది తనకి రైవల్ అనుకుంది. రైవల్ అయినా ఫరవాలేదు.. ఎంత మాత్రం అందంగా వుండదు.. ఎత్తు పళ్ళు, నల్ల రంగు.. అనుకుంది. కానీ అప్సరసలా అందంగా ఉన్న లీలావతి బస్సు దిగింది. సూర్యకుమారి కన్నా చురుగ్గా వుంది. "మా బావ పెళ్ళాడింది నిన్నేగా.." అంటూ కౌగిలించుకుని బస్‌స్టాండ్ లోనే ముద్దాడింది. బస్సులేటు, కొంచెం లేటుగానే ఇద్దరూ ఇల్లు చేరారు. బస్‌స్టాండ్‌కి వెళ్ళి వెంటనే రావడమే కదా అని, ఇంట్లో నిద్రపోతున్న కురంగేశ్వరావుని నిద్రలేపకుండా ఇంటికి బైట తాళం వేసి వెళ్ళింది కుమారి. భార్యవచ్చే వరకూ, ఏం

జరిగిందో తెలియక, బోనులో ఎలకలా ఇబ్బంది పడ్డాడు కురంగేశ్వరావు. ఈ సంఘటనలో కూడా శర్మగారు, సినిమాల్లో ఇలాంటి దృశ్యాన్ని ఎంత రొటీన్‌గా చిత్రీకరిస్తారో చమత్కరించారు.

లీలావతిలాంటి అందగత్తెను, చురుకైనదాన్ని, వరసైనదాన్ని కురంగేశ్వరావు ఎందుకు పెళ్ళాడ లేదా? అన్న సందేహం వచ్చింది సూర్యకుమారికి. వెంటనే సమాధానం కూడా దొరికింది. వాళ్ళిద్దరూ ఒకేచోట పెరిగారు. 'ఏరా, ఒసే' వరసలతో పెరిగారు. పెళ్ళయినా, పదిమంది ముందూ తనని అలాగే 'ఒరే' అని ఆడిస్తుందని జాగ్రత్త చర్యగా లీలావతిని కురంగేశ్వరావు చేసుకోలేదు. వీళ్ళ కొత్తకాపురం చూడటం అన్న వంకతో వచ్చి బావని ఓ ఆట ఆడించే కార్యక్రమంలో వుంది లీలావతి. ఆ కార్యక్రమం, అల్లరి తనకీ ఇష్టమే కాబట్టి లీలావతితో చెయ్యి కలిపింది సూర్యకుమారి. వాళ్ళ ప్రయత్నాన్ని గ్రహించిన కురంగేశ్వరావు రాబోయే ప్రమాదానికి విరుగుడుగా తనో ఎత్తు ఎత్తాడు. వాళ్ళిద్దరికీ చేతినిండా పని ఉండేలా చెయ్యగలిగితే, తన జోలికి రారని నిశ్చయించుకున్నాడు. అందుకుగాను వాళ్ళకి ఖాళీ లేకుండా ఎప్పుడూ తినటానికి రెడీగా చిరుతిండి ఏర్పాటుచేస్తే చాలనుకున్నాడు. కానీ ఖర్చు భరించటం అంత తేలిక్కాదు. అలాగే రెండు మూడు పథకాలు ఆలోచించినా డబ్బు ఖర్చవని మార్గం తోచలేదు. చివరికి కురంగేశ్వరావుకి బ్రహ్మాండమైన ఐడియా వచ్చింది. ఆడవాళ్ళకి చీరలంటే మోజు... అవి పాతైతే చూళ్ళేరు. అంతే తన కార్యక్రమం అమలు చేశాడు. బీరువాలో, పెట్టెల్లో వున్న పాత, కొత్త చీరలన్నింటినీ బైటకితీసి ఇల్లంతా చెల్లాచెదురుగా పారేశాడు. చీరలు అల్లా అల్లకల్లోలం చెయ్యటం చూసి అతని 'స్క్రూ' ఏమైనా లూజయిందేమో అనుకున్నారు ముందు. చివరికి అతని ఎత్తు తెలిసి.. చేసేదేంలేక, బలంగా భోజనం చేసి చీరలు సర్దుకోవాలకున్నారు. చర్చల్లో లీలావతికి ఆ ఇంటికి రావటంలో మరో ప్రోగ్రాం వుందని తెలిసింది. అదేమిటంటే వెంకటరత్నం అని అమెరికా రిటన్డు స్మార్ట్‌గై ఒకతను ఆ ఊరు ట్రాన్స్‌ఫర్ మీద వచ్చాడు ఆ వెంకూ కోసం వచ్చింది లీలావతి.

ఇలా ఈ కథ ఒకచోట నుంచి మరోచోటకి.. ఓ విషయం నుంచి మరో విషయానికి మారుతూ సాగుతుంది. చివరికి సుఖాంతమే. వెంకూ, లీలావతి కలుస్తారు. వాళ్ళు అలా కలిసే లోపు చాలా చమత్కారాలు జరుగుతాయి.

మొదటి అంకంలో సూర్యకుమారి, లీలావతి సలహామీద, సడన్‌గా కడుపు నొప్పి వచ్చినట్టు నటించటానికి నడుంకడుతుంది. పెద్ద డ్రామాకి దారి తీసింది కార్యక్రమం. సూర్యకుమారిని పరామర్శించటానికి వీధిలో వాళ్ళేకాక, కురంగేశ్వరావు ఆఫీసువాళ్ళు. ఆ వీధికి సంబంధించిన, రాజకీయ వ్యక్తులు, ప్రెస్ వాళ్ళు, ఫోటోగ్రాఫర్లు రావటం. ఒకరిమాట ఒకరికి పొసగక పెద్దఫార్స్ జరగటం, రుబ్బురోలులాంటి ఆవిడ కుమారిని అదిమిపెట్టి కళ్ళల్లో కలికం పెడుతుండగా కళ్ళమంటకి కుమారి గట్టిగా అరవడం.. అప్పుడే అటుగా వెడుతున్న 'సులేమాన్' అనేకానిస్టేబులు పరిగెత్తుకువచ్చి, కురంగేశ్వరావుని, రుబ్బురోలులాంటావిడిని లాఠీతో అదే పనిగా బాదటం.. చివరికి ఆ దెబ్బలకి సున్నం పట్టీలు వేస్తే, వాళ్ళిద్దరూ జంతుశాలలోని తెల్లపులుల్లా రూపుదాల్చటం.. ఈ డ్రామా మొత్తంలో కథానాయకి కుమారి ఉద్వేగం మితిమీరి, చూట్టానికి వచ్చిన జంబులింగం అనే శాల్తీని కరవటం.. ఒకరకం కాదు, నానా హంగామా!

ఒక చిన్నవిషయం ఎంత అర్థరహితంగా పెద్ద ఇష్యూగా మారుతుందో, మన వ్యవస్థలో దానికి ఎన్నిరంగులు అద్దుతారో వ్యంగ్యాత్మకంగా చిత్రించటమే పూరాణంవారి ముఖ్యఉద్దేశం. ఆ రకంగా 'హంగామా' అద్భుత ప్రయత్నం. పూర్తిగా విజయవంతమైన ప్రయోగం.

ఆ వీధి పోస్ట్‌మాన్ శివకామేశం, మరో పోలీస్కానిస్టేబుల్ ఓ సర్దార్జీ, మురుగేశన్, సన్యాసిరావు, జానీలాంటి విభిన్న పాత్రలు మరికొన్ని ఈ కథలో ప్రవేశించి తమవంతు సాయంగా విషయాన్ని ముందుకు సాయంపట్టాయి.

కొన్నిచోట్ల కడుపు పగిలేంతగా నవ్విస్తుంది. కొన్నిచోట్ల చురుక్కుమని వ్యంగ్యం పొడుస్తుంది. మరికొన్నిచోట్ల.. 'మనది సెక్యులర్ కేపిటలిస్ట్ సమాజం' లాంటి లోతైన రాజకీయవ్యాఖ్యలు కదిలిస్తాయి. సరదాగా, ఎంతగా చదివిస్తుందో అంతగానూ ఆలోచనల్ని రేపుతుంది 'హంగామా'. మన చుట్టూ జీవితం ఎంత అస్తవ్యస్తంగా వుందో కళ్ళకు కట్టిస్తుంది.

పెద్దకథ లేకుండా కథనశక్తితో రచనని అద్భుతంగా ఎలా తీర్చిదిద్దవచ్చో చూపించింది ఈ నవల. లాగగలిగే శక్తి వుంటే, హాస్యాన్ని ఎందులోనుంచైనా లాగొచ్చని నిరూపించిన రచన ఇది. పురాణం వారి చక్కటి ప్రతిభకి ప్రతిరూపం 'హంగామా'. ©




# కేన్వాసే కెమేరా!

నార్వే దేశస్థురాలు 'అనే కరీన్ ఫురునెస్' నల్లటి కేన్వాస్ మీద వేల కొద్దీ సన్నటి రంధ్రాలు చేసి ఫొటోలా కనిపించే ఈ చిత్రాన్ని రూపొందించింది. 1990లలో ఆమె ట్రోన్డ్ హైమ్ నగరంలోని ఆర్ట్ అకాడమీలో చదివేటప్పుడు కేన్వాస్‌కి రంధ్రాలు చేసి చిత్రాన్ని రూపొందించే కళను అభ్యాసం చేసింది. ఈ చిత్రంలో ముప్పయి సైజుల్లో రంధ్రాలు చేసింది. పూర్తయ్యాక తెల్లటి గోడ మీద కేన్వాస్‌ను ఉంచితే రంధ్రాల్లోంచి గోడమీది తెలుపు కనపడి బ్లాక్ అండ్ వైట్ చిత్రంలా కనిపిస్తుంది. ఇందుకోసం ఆమె పాత బ్లాక్ అండ్ వైట్ చిత్రాలనే మోడల్‌గా తీసుకుంటుంది. ముప్పయి రకాల రంధ్రాలని వాడడానికి కారణం ముఖంలో జీవకళ తేవడానికే. ఇప్పటికే ఈమె మూడొందలకు పైగా ఇలాంటి చిత్రాలను రూపొందించింది.

# భామనే.. సత్యభామనే..!

11

'తీన్ పట్టి' సినిమాతో తెరంగేట్రం చేసిన ఆ అందాల రాశి 'ఆషికీ 2' సినిమాతో ఒక్కసారిగా వెలుగులోకొచ్చింది.. మేకప్ మెరుగులతో పెద్దగా అవసరం లేని సహజమైన అందం ఆమె సొంతం..పార్టీలు, ఫంక్షన్‌లకు దూరంగా ఉండే ఆ భామ ప్రముఖ బాలీవుడ్ నటుడు శక్తి కపూర్ తనయ.. ఇంతకీ ఎవరామె అనే కదా మీ సందేహం.. మరెవరో కాదు.. శ్రద్ధా కపూర్.. మరి ఆమె సౌందర్య రహస్యాలేంటో చూద్దాం..

## సొగసు చూడతరమా...



చిన్నప్పటినుంచీ బాస్కెట్ బాల్, వాలీ బాల్ వంటి ఆటలు ఆడేదాన్ని. పరుగు పందెంలో కూడా మొదటి స్థానంలో ఉండే దాన్ని. అదే నా ఫిట్‌నెస్‌కు, చక్కని శరీర ఆకృతికి ఉపకరించింది. వారానికి నాలుగైదు సార్లు జిమ్‌కు వెళ్తుంటాను. గుండెకు సంబంధించిన వ్యాయామం చేస్తుంటాను. బరువును తగ్గించుకునే మార్గాల్లో నాకిష్టమైంది డ్యాన్సింగ్. గది తలుపులు మూసేసి పెద్ద శబ్దంతో టేప్‌రికార్డర్‌లో పాటలు పెట్టుకుని అలసిపోయేవరకూ నృత్యం చేస్తాను.

జంక్ ఫుడ్, అధిక కొవ్వు ఉండే అనారోగ్య పదార్థాలను ముట్టుకోను. పీచు పదార్థాలు, ప్రోటీన్లు పుష్కలంగా లభించే ఆహారాన్ని ఎంచుకుంటాను. రాత్రి ఎనిమిది కల్లా భోజనం ముగిస్తాను. పదకొండుకు నిద్రకుపక్రమిస్తాను.

వారానికి ఒకసారి కొబ్బరి నూనెతో తల మసాజ్ చేయించుకుంటాను. ఇలా చేయడం వల్ల

కుదుళ్లు దృఢపడి ఆరోగ్యమైన జుట్టు ఎదగడానికి దోహదపడుతుంది. అలోవీరా, మందార ఆకులు లేదా పువ్వులు, పెరుగుతో చేసిన హెయిర్ ప్యాక్‌లను వాడతాను. ఆ మూడింటితో చేసిన ప్యాక్‌ను జుట్టుకు పెట్టుకుని 20 నిమిషాల పాటు ఉంచి నీటితో కడుగుతాను. జుట్టు మృదువుగా కాంతివంతంగా ఉంటుంది.

మేకప్ విషయంలో చాలా జాగ్రత్తగా ఉంటాను. తరచుగా ఫేస్ మాస్కులు, స్క్రబ్‌లు ఉపయోగించడం వల్ల మేలు కన్నా కీడే ఎక్కువ. అందుకే అవసరం లేనపుడు మేకప్ లేకుండా ఉండేందుకే ఇష్టపడతా. షూటింగు సమయాల్లో మేకప్ వేసుకునే ముందు మాయిశ్చరైజర్ రాసుకుంటాను. పడుకునే ముందు మేకప్ పూర్తిగా కడిగేసుకుంటా.

మంచి అలవాట్లను అలవర్చుకోవడం మన చేతుల్లోనే ఉంటుంది. ఆరోగ్యానికి హాని కలిగించే జంక్ ఫుడ్, కొవ్వు పదార్థాలను పక్కన పెట్టి పోషకాలతో కూడిన ఆహారాన్ని తీసుకోవడం అలవాటు చేసుకుంటే అందం ఆరోగ్యం కోసం ఎటువంటి వ్యయప్రయాసలూ అక్కర్లేదు. ఎపుడూ సంతోషంగా, సానుకూల దృక్పథంతో ఉండడం వల్ల అందం రెట్టింపవుతుంది.

సేకరణ : **సంధ్యారాణి**

## మహిళా శక్తి



మనల్ని ఎవరూ రక్షించరు. మన గమ్యానికి మనమే దారి ఎన్నుకోవాలి.

– గౌతమ బుద్ధుడు



నిజానికి నిన్ను బంధించి ఉంచే శక్తి ఎవరికీ లేదు. పూర్తి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు ఉన్న మనిషివి నువ్వు.

– చార్లొట్టి బ్రాంటీ

## టెక్ గురూ!

### యాప్ లాక్

ఖరీదు ఎక్కువైనప్పటికీ ఎంతో ఇష్టంగా కొనుక్కున్న ఫోను కాస్తా పోగొట్టుకున్నారనుకోండి.. ఆ బాధ వర్ణనాతీతం! కానీ ఇపుడా బెంగ అక్కర్లేదు.. ఎందుకంటే యాంటీ వైరస్ సెక్యూరిటీ యాప్‌ను ఇన్‌స్టాల్ చేసుకున్నారంటే గూగుల్ మ్యాప్స్ ద్వారా అది ఎక్కడ ఉందో కనుక్కోవచ్చు. అంతే కాదు, ఈ యాప్ వల్ల ఇంకా చాలా ఉపయోగాలున్నాయి. వ్యక్తిగత ఫైల్స్, మెసేజ్‌లు, ఫొటోలు వంటి వాటిని లాక్ చేసి ఉంచుతుంది. ఫోన్ వేగాన్ని తగ్గించే అనవసర పనులను తొలగిస్తుంది. ఎప్పటికపుడు బ్యాటరీ, స్టోరేజి, డాటా ప్యాకేజి యూసేజికి సంబంధించిన సమాచారాన్ని అందిస్తుంది. డౌన్‌లోడ్ చేసుకున్న ఫైల్స్‌ని స్కాన్ చేసి వైరస్‌ను అడ్డుకుంటుంది. పొరపాటున ఫేక్ యు.ఆర్.ఎల్‌లోకి వెళ్తే వెంటనే క్షేమంగా బయటికి వచ్చే వీలు కూడా ఉంది.




### రిమోట్ యాప్

రిమోట్లకు కాలం చెల్లనుంది. ఎదుకంటారా.. ఫోన్‌నే రిమోట్‌గా మార్చే రిమోట్ వచ్చేసింది కదా. ఈ యాప్ ఉందంటే ఇక రిమోట్‌తో పని లేదు. మీ స్మార్ట్ ఫోనే రిమోట్‌గా మారిపోతుంది. టి.వి. రిమోట్‌లో ఉండే ఆప్షన్సన్నీ దీనిలో ఉంటాయి. ప్రస్తుతం వస్తున్న ఆధునిక టీవీలలో దేనికైనా ఇది పనిచేస్తుంది. పెద్ద సౌండ్‌తో టీవీ చూస్తున్నపుడు సడన్‌గా ఫోన్ వస్తే రిమోట్ కోసం వెతక్కుండా రిమోట్ యాప్‌తో ఎంచక్కా ఫోన్‌తోనే వాల్యూమ్ తగ్గించుకుని మాట్లాడుకోవచ్చు. టి.వి.కి వైఫై కనెక్షన్ తప్పకుండా ఉండాలి మరి! దీన్ని ఉచితంగా డౌన్‌లోడ్ చేసుకోవచ్చు.

# అంతర్నేత్రం

## ఆన్‌లైన్ షాపింగ్ జాగ్రత్తలు

ఆన్‌లైన్ షాపింగ్‌తో ఎన్నో ఉపయోగాలు.. సమయం ఆదా అవుతుంది.. ట్రాఫిక్‌లో చిక్కుకునే ఇబ్బంది ఉండదు.. షాప్‌లో గంటల తరబడి నిల్చునే అవసరం అంతకన్నా ఉండదు.. మనకు వీలైన సమయంలో షాపింగ్.. ఫలానా వస్తువు కావాలని సైట్‌లో ఆర్డర్ ఇచ్చామంటే ఇంటికే వచ్చి చేరుతుంది. అయితే ఆన్‌లైన్‌లో షాపింగ్ వల్ల కొన్ని నష్టాలూ ఉన్నాయి. కాస్త జాగ్రత్తగా వ్యవహరిస్తే చాలు.. అంతగా ఆందోళన చెందాల్సిన అవసరంలేదు.

*ఇంతకీ ఏంటా జాగ్రత్తలు..?*

★ పేపాల్, అమెజాన్ వంటి థర్డ్ పార్టీ సర్వీస్ వెబ్‌సైట్స్‌లో షాపింగ్ చేయడం వల్ల కొనుగోలుదారునికి రక్షణ ఉంటుంది. వేర్వేరు కంపెనీలు ఉత్పత్తి చేసే ఒకే వస్తువు ధరలను పోల్చి చూసుకోవచ్చు. పైగా ఆయా వస్తువుల మన్నిక గురించి అంతకుముందు కొన్నవారు సమాచారం పొందుపరుస్తారు.

★ ఏదైనా వస్తువును వెబ్‌సైట్ ద్వారా కొనదలచుకున్నపుడు ఆ సైట్ నమ్మదగినదేనా అనే విషయం గురించిన సమాచారాన్ని తెలుసుకోవాలి. ఆ వస్తువు, సైట్‌కు సంబంధించిన రివ్యూలు చూడడం మంచిది.

★ సాధారణంగా ఆన్‌లైన్ షాపింగ్ వెబ్‌సైట్లలో ఇంతకుముందు కొనుగోలు చేసినవారి



ఫోన్‌నెంబర్లు, మెయిల్ ఐడిలు ఉంచుతారు. అవి నామమాత్రంగా ఉంటే ఆ సైట్లను అనుమానించాల్సిందే. ఎక్కువగా ఉన్నపుడు వాటి ద్వారా సైట్ గురించి, వస్తువు మన్నిక గురించి ఆరా తీయండి. నమ్మకం కలిగితేనే కొనుగోలు చేయడం మంచిది.

★ కొన్ని వెబ్‌సైట్లు ఫ్రీ సాంపిల్స్ ఇస్తాయి. వాటి ద్వారా మూడు లేదా నాలుగు ప్రొడక్ట్సను వాడి సరైనదాన్ని ఎంచుకునే అవకాశాన్ని ఉపయోగించుకోవచ్చు.

★ ఆన్‌లైన్ షాపింగ్‌లో లావాదేవీలు జరిపేపుడు మిగతా అన్ని ప్రోగ్రామ్‌లు, బ్రౌజర్ విండోలు, కుకీస్, ఫైళ్లు మూసేయాలి.

★ లావాదేవీలు పూర్తి అయ్యేవరకు ఆటోమెటిక్ అపడేట్స్ క్లోజ్ చేసి ఉంచాలి.

★ మీ ఇంటర్‌నెట్ కనెక్షన్‌లో సమస్యలున్నపుడు లావాదేవీలు జరపకూడదు.

★ మీ ఆర్డర్‌తో పాటు తాత్కాలిక మెయిల్ ఐడి ఇవ్వడం మంచిది.

★ లావాదేవీలు జరిపేపుడు, ఆ తర్వాత.. వచ్చిన అన్ని నంబర్లు, కోడ్‌లు రాసి ఉంచుకోవడం మేలు.

## క్షణాల్లో పునరుత్సాహం!

పునరుత్సాహాన్ని పొందేందుకు మరో కప్పు కాఫీ తీసుకునే బదులు చెవి తమ్మెను నెమ్మదిగా రుద్దుకోండి. చెవి పై భాగంలోని ఒత్తిడికణాలను నెమ్మదిగా రుద్దడం వల్ల శరీర అన్ని భాగాలలోనూ రక్తప్రసరణ బాగా జరిగి క్షణాల్లో మనసు తేలికపడి ఉత్సాహవంతంగా మారుతుంది.



## క్యాన్సర్ అణిచే క్యాబేజీ

క్యాన్సర్‌ను అదుపు చేయడంలో క్యాబేజీ బాగా ఉపకరిస్తుంది. పచ్చి లేదా ఉడకబెట్టిన



క్యాబేజీ ఆకులు, జూస్ కడుపులోని మంటను తగ్గిస్తాయి. అంతేకాదు గ్యాస్ట్రోడియోడినల్ అల్సర్స్‌నూ నయం చేస్తాయి.

పురాణ విజ్ఞానం

# తండ్రి ఎవరు?

1. విశ్వామిత్రుని తండ్రి?
జ.

2. ధృతరాష్ట్రుడి తండ్రి?
జ.

3. అంగదుడి తండ్రి?
జ.

4. మేఘనాధుని తండ్రి?
జ.

5. నచికేతుని తండ్రి?
జ.

6. నరకాసురుడి తండ్రి?
జ.

7. ప్రహ్లాదుని తండ్రి?
జ.

8. పరీక్షిత్తు తండ్రి?
జ.

9. ప్రద్యుమ్నుడి తండ్రి?
జ.

10. ధ్రువుని తండ్రి?
జ.

జవాబులు ఈ సంచికలోనే..




## విజయం వెనుక!



రాజేష్: ప్రతి పురుషుడి విజయం వెనుక ఒక మహిళ ఉంటుందంటారు. ఎందుకురా?

రవి: మహిళ ఎపుడూ విజయం వెనుకే పరిగెడుతుంది, ఓటమి వెనకాల కాదు మరి!

## బతికిపోయాం



టీచర్: మనం పీల్చే గాలి 1773వ సంవత్సరంలో కనుగొన్నారు.

విద్యార్థి: మనం చాలా అదృష్టవంతులం టీచర్!

టీచర్: అదేంటిరా.. ఎందుకలా అన్నావు?

విద్యార్థి: మనం ఆక్సిజన్ కనిపెట్టిన తర్వాత పుట్టాం కనుకే బతికిపోయాం అంతకుముందు పుట్టుంటే చచ్చిపోయేవాళ్లం కదా టీచర్!

## అదృష్టవంతురాలిని



కొత్తగా పెళ్లయిన జంట మాట్లాడుకుంటున్నారు.

భార్య: పెళ్లికి ముందు మీరెవరినైనా ప్రేమించారా?

భర్త: .....

భార్య: హమ్మయ్యా! మీరేమీ మాట్లాడడం లేదంటే ఎవరినీ ప్రేమించనట్లే. నా పూజలు ఫలించాయి. నేను చాలా అదృష్టవంతురాలిని...

భర్త: సరిగా గుర్తులేక నేను మనసులో లెక్క పెట్టుకుంటుంటే ఏంటి నీ గోల?

# చక్కెరపొంగలి

చిటికెలో రుచిగా..!



## కావలసిన పదార్థాలు

- బియ్యం - 1 కప్పు
- పెసరపప్పు- 1/2 కప్పు
- పంచదార - 1 కప్పు
- నెయ్యి - 4 టేబుల్ స్పూన్లు
- పచ్చ కర్పూరము - చిటికెడు
- జీడిపప్పు, కిస్‌మిస్‌లు సరిపడా

**తయారుచేసే పద్ధతి:**

పాన్‌లో నెయ్యి వేసి వేడి చేసి పెసరపప్పు బంగారువర్ణం వచ్చేవరకూ వేయించి పక్కన పెట్టుకోవాలి. కడిగిన బియ్యం, వేయించిన పెసరపప్పు కుక్కర్‌లో వేసి మూడు కప్పుల నీళ్లు పోసి మూడు విజిల్స్ వచ్చే వరకూ స్టవ్ మీద పెట్టాలి. ఆవిరి పూర్తిగా పోయేవరకూ కుక్కర్ మూతను తీయకూడదు. ఈలోగా పాన్‌లో కొద్దిగా నెయ్యి వేసి జీడిపప్పులు దోరగా వేయించుకోవాలి. వేరొక గిన్నెలో పంచదార, సగం కప్పు నీరు పోసి కరిగే వరకు వేడిచేసుకోవాలి. ఇపుడు దానిలో ఉడికిన అన్నం, పెసరపప్పుల మిశ్రమం, పచ్చకర్పూరం, వేయించిన జీడిపప్పు, నెయ్యి వేసి బాగా కలిపి సన్నని మంట మీద ఐదు నిమిషాలు ఉడికించాలి. అంతే నోరూరించే చక్కెర పొంగలి రెడీ!

కొత్తరకం వంటలొస్తే మీరూ వివరంగా రాసి పంపండి.
వంటకాల ఫొటోలూ పంపండి. 100 రూ॥లు బహుమతి పొందండి.
అందరికీ అందుబాటులో ఉండే పదార్థాలతో తయారయ్యే వంటకాలకే ప్రాధాన్యం.

**తండ్రి ఎవరు? జవాబులు :** 1. గాధి 2. వ్యాసుడు 3. వాలి 4. రావణుడు 5. వాజశ్రవుడు 6. విష్ణువు 7. హిరణ్యకశిపుడు 8. అభిమన్యుడు 9. కృష్ణుడు 10. ఉత్థానపాదుడు

## చిట్కాలక్ష్మి



★ దుంపలు మొదలైనవి ఉడకబెడుతున్నపుడు, చారు, పులుసులు వంటి వంటలు చేస్తున్నపుడు అవసరమైనంత నీరు మాత్రమే పోయడం వల్ల తక్కువ గ్యాస్ ఖర్చవుతుంది.

★ మరగడం మొదలైన తర్వాత తక్కువ మంటైనా, ఎక్కువ మంటైనా పాత్రలోని ద్రవం అదే వేడిని తీసుకుంటుంది కాబట్టి సిమ్‌లో పెడితే గ్యాస్ వృధా కాదు.

అన్నీ సరైన సమాధానాలు రాసిన వారిలో డ్రా ద్వారా ఎంపికైన ఈ విజేతకు రూ.150/- త్వరలోనే అందుతాయి.

**వి. శ్రీలక్ష్మి**
2-1-421, 3వ ఫ్లోర్,
4వ వీధి, నల్లకుంట,
హైదరాబాద్ పిన్ : 500044

## చతురంగం - 45 జవాబులు

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 క్రై | క | 2 సి | | 3 వే | త | 4 నం | | 5 బె | 6 వి |
| క | | 7 పా | 8 పా | లు | | 9 దు | 10 ర | ద | లు |
| | 11 వా | యి | దా | | 12 వే | డు | క | లు | |
| 13 కా | మ | | 14 లు | 15 సు | ప | | ర | | 16 తు |
| 17 ల | హ | రి | | జ | | 18 శా | కా | హా | రం |
| 19 నే | స్తం | | 20 నా | ర | 21 చీ | ర | లు | | గం |
| మి | | 22 సు | ర | | 23 నా | ద | | 24 నే | |
| | 25 గ | | 26 దా | స | వా | | 27 అ | ల | 28 ము |
| 29 అ | ప | 30 వా | దు | | 31 డు | 32 ము | వ్వు | | ని |
| 33 ఆ | డ | లు | లు | పు | | 34 ది | లు | గు | |

## సరైన సమాధానాలు రాసిన వారు

1. తిప్పావఝుల తులశమ్మ, ఈస్ట్ ఆనంద్‌బాగ్, 2. జి. ప్రభాకర్‌రావు, మల్లాపూర్, హైదరాబాద్, 3. యు. విజయశేఖరరెడ్డి, కూకట్‌పల్లి, 4. ధరణి పద్మాసన, నల్లకుంట, 5. టి. ఉషశ్రీ, దగదర్తి, నెల్లూరు జిల్లా, 6. ఎస్. శ్రీనివాసమూర్తి, కుప్పం, 7. ఎస్. మణిమేగలై, తిరుపతి, 8. సి.జి. శంకర్‌రావు, ఎ.ఎస్. రావు నగర్, 9. యు.యు.యు. ఎమ్మిగనూరు, 10. యు.వి.ఎస్. శివకుమార్, హైదర్షాకోట్, 11. చింతపల్లి నాగేశ్వరరావు, విజయవాడ, 12. కె.వి.జె. దాస్, మైలార్‌గడ్డ, 13. పెద్ది దత్తాత్రేయ, రేచినీ, ఆదిలాబాద్ జిల్లా, 14. బోడపాటి కృష్ణవేణి, చెన్నై, 15. డా. శివభూషణం, కర్నూలు, 16. జి. జయచంద్రగుప్త, కర్నూలు, 17. జి. శోభ, అక్కారంపల్లి, తిరుపతి, 18. పేర్వేల రాంబాబు, మణికొండ, 19. పి. శుభ, బంజారాహిల్స్, 20. గోగాడ శ్రీనివాసరావు, మహారాష్ట్ర, 21. ఎ. రంగనాథం, బెంగళూరు, 22. బచ్చు సత్యనారాయణ, కొత్తగూడెం, 23. సి. అల్వాల్‌రెడ్డి, సరూర్‌నగర్, 24. కస్తూరి వెంకుబాబు, గుంటూరు, 25. అత్తిలి కస్తూరిభాయి, తిరుపతి, 26. ఎస్. రుత్విక్ శ్రీవాత్సవ, బెంగళూరు, 27. కరణం శివానంద రావు, కర్నూలు, 28. కొత్తపల్లి సుధాదేవి, చీరాల, 29. కె. సుబ్రహ్మణ్యం, అనంతపురం, 30. కోలా సత్య నారాయణ, విశాఖ, 31. పంతం తమ్మయ్యదొర, గెద్దనాపల్లి, తూ.గో. జిల్లా, 32. వి.వి. సత్యనారాయణ శెట్టి, తిరుపతి, 33. జె. జయశ్రీ, ట్రూప్‌బజార్, హైదరాబాద్, 34. అల్లూరి ఉమ, సింగరాయకొండ, 35. కె.వి. దుర్గామోహన్‌రావు, వనస్థలిపురం, 36. మద్దూరి లక్ష్మీరాజ్యం, హైదరాబాద్, 37. కె. శ్యాంసుంద ర్‌రెడ్డి, మంచిర్యాల, 38. ఎస్.టి.సి. అనంత్, నాగోలు, 39. శ్రీరమ్య వారణాసి, పొడగట్లపల్లి, తూ.గో. జిల్లా, 40. వారణాసి విజయలక్ష్మి, పొడగట్లపల్లి, తూ.గో. జిల్లా, 41. పట్టిసపు శేషగిరిరావు, విశాఖ పట్నం, 42. గరికిపాటి దత్తాత్రేయకృష్ణ, కాకినాడ, 43. ఎం. కృష్ణ, కాకినాడ, 44. కన్నేపల్లి నారాయణ మూర్తి, శ్రీకాకుళం, 45. బిక్కునూరి రాజేశ్వర్, నిర్మల్, 46. ఆర్. సత్యకృష్ణకుమార్, నొయిడా, 47. పి. యశోధర, హైదరాబాద్, 48. మొహమ్మద్ ఖాసిం, కల్లూరుగూడెం, ఖమ్మం జిల్లా, 49. ఆర్. బాలాజీ రావు, మియాపూర్, 50. కె. సుబ్రహ్మణ్యం, నెల్లూరు, 51. పి. సుజాత, గుంటూరు, 52. వేదుల నర సింహమూర్తి, గుడిమల్కాపూర్, 53. పి. దేవసేనమ్మ, సిద్ధార్థనగర్, 54. తటవర్తి రామకృష్ణ, హైదరా బాద్, 55. యం. శౌరిశ్రీ, విజయనగరం, 56. ఆంద్ర రామలక్ష్మి, తణుకు, 57. ఉడాలి భాస్కరయ్య, చెన్నై, 58. కొమ్మూరు వేకంట సుబ్రహ్మణ్యశాస్త్రి, గుంటూరు జిల్లా, 59. ఎం. అంజనాదేవి, నిజాంపేట, 60. వి. సీతానరసింహారావు, విజయవాడ, 61. మండ వెంకట జోగేశ్వర శర్మ, అరసవల్లి, 62. ఎం. అరుణరేఖ, ఎల్.బి. నగర్, 63. కె. కృష్ణయ్య, కల్వకుర్తి, 64. గుర్రాల పద్మావతి, విశాఖపట్నం, 65. జి. శ్రీలేఖ, తిరుపతి, 66. యు. నారప్ప, మద్దికెర, కర్నూలు జిల్లా, 67. ఎం. వీరేశ్, మద్దికెర, కర్నూలు జిల్లా, 68. పొన్నపల్లి వెంకటప్పయ్య, నూజివీడు, 69. ధప్పూరి సుధాదేవి, సీతారాంబాగ్, 70. తోకల నరేంద్రకుమార్, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 71. తోకల నారాయణరావు, మాచవరం మెట్టు, కృష్ణా జిల్లా, 72. పిశిపాటి శైలజ, నవులూరు, 73. అరుంధతీ చంద్ర, కరీంనగర్, 74. కె. మోహన్, బెంగళూరు, 75. కోడుగంటి విజయలక్ష్మి, హైదరాబాద్, 76. శీతేపల్లి కామేశ్వరి, విజయవాడ, 77. టి. లక్ష్మీ *(..128లో)*

# చతురంగం - 46 ఆధారాలు

**అడ్డం**

1. దేవుడిచ్చేది (2)
2. విఘ్నాధిపతి (5)
7. సాహసం చేస్తే - - - - - దక్కుతుందిరా (5)
8. ఇటీవలే కాలం చేసిన విరామచిహ్నం (2)
9. మలేషియా పాలక రాజధాని (4)
11. విశ్వకథావేదిక (3)
12. యోధుణ్ణి పిలవండి (2)
13. జవాబు (4)
15. చెట్టు కాండంపై మొలిచే తీగ (4)
18. విశ్వేశ్వరుడి నగరం (2)
19. విధాలు, పద్ధతులు (3)
21. 'ప్రోజ్' తెలుగులో (3)
23. కూరల్లో వేసే పోపుదినుసు (3)
24. భవిష్యత్తు (2)
25. కేరళలో ప్రసిద్ధమైన బీచ్ (3)
26. సొంత అనుభవం (4)
28. బుడంకాయ లాంటిదే.. తోక తెగింది (3)
29. ఇటీవలి మహేష్ సినిమా (3)
30. పెరుగు (2)
32. చల్లని గాలి (6)
33. స్వాతంత్ర్య దినోత్సవాన్ని ఎలా జరుపుకుంటాం? (3)

**నిలువు**

1. ప్రేమ (3)
2. అర్జునుడి పేర్లలో ఇదీ ఒకటి (3)
3. నీకు కాదు - - (2)
4. యమహో నీ - - - - అందం (4)
5. క్షీరవిప్లవనేత పేరులో మొదటి రెండక్షరాలు (2)
6. రాముడి గుడి (4)
7. ఢిల్లీ మన దేశ - - - - (4)
8. కాపలా కాయడాన్ని ఇలా కూడా అనొచ్చు (2)
10. ద్వాదశి తరువాతి తిథి (4)
11. 'వింటాం'కు వ్యతిరేకం (2)
14. నీటిచాలు, ప్రవాహం (2)
15. బాకీ (3)
16. కత్తి (4)
17. 'మైదానం' రచయిత తిరగబడ్డాడు (2)
20. నడవడానికి ఉపయోగించేది (2)
21. తెలుగు సంవత్సరాల్లో రెండోది గజిబిజి (3)
22. శివుడి వాహనం (2)
23. ఆంధ్రుల కిష్టమైన ఊరగాయ (4)
24. సూర్యుడు (3)
25. దశరథుడి దేశం (3)
26. అతిథులకి పలికేది (3)
27. నమస్కారం (3)
28. మశకం (2)
29. 'అరడజన్' అంటే? (2)
31. విశ్వామిత్రుడి తండ్రి తలకిందులు (2)

*(127వ పేజీ తరువాయి...)*

కుమారి, మచిలీపట్నం, 78. పి.వి. సుబ్బలక్ష్మి, విశాఖ, 79. పక్కి శ్రీదేవి, మెట్టపల్లి, విజయనగరం జిల్లా, 80. కాకర్లమూడి కృష్ణప్రసాదు, తణుకు, 81. బి. రామమోహనరావు, సరూర్‌నగర్, 82. టి.వి. సూర్యం, విశాఖపట్నం, 83. గుర్రపు శ్రీనివాస్, పాత సఫిల్‌గూడ, 84. కొక్కెరగడ్డ అన్నపూర్ణ, మానేపల్లి, తూ.గో. జిల్లా, 85. కొక్కెరగడ్డ శ్రీదేవి, అమలాపురం, 86. వీధి అనంతలక్ష్మి, ముమ్మిడివరప్పాడు, తూ.గో. జిల్లా, 87. వీధి బిందు, రాజమండ్రి, 88. శిష్టా హైమరాణి, విజయవాడ, 89. నార్నె చంద్రబాబునాయుడు, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 90. కొల్లూరి నాయుడమ్మ, ఇంకొల్లు, ప్రకాశం జిల్లా, 91. శ్రీపద్మ, బెంగళూరు, 92. టి. కమల, ఖమ్మం, 93. అడపా సత్యనారాయణ బాబ్జి, హైదరాబాద్, 94. సరస్వతి, హైదరాబాద్, 95. కె. వేంకట తిమ్మాజీరావు, పరవాడ, విశాఖ జిల్లా 96. ఎం. పల్లవి, బోరబండ, 97. వి.ఆర్.కె. అల్లమరాజు, కాట్రేనికోన, 98. పి.వి. రమణరావు, మల్కాజిగిరి.

# చతురంగం - 46

రూ.150/- బహుమతి

గడువు తేది : జనవరి 17

| | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | 2 | 3 | 4 | 5 | | | 6 |
| | | 7 | | | | | | 8 | |
| 9 | 10 | | | | | | 11 | | |
| | 12 | | | 13 | మా | 14 | | | |
| 15 బ | | | 16 | | | | | 17 | |
| 18 | | | 19 | 20 | | | 21 | | 22 |
| | | 23 | | | | 24 | | | |
| | 25 కో | | | | 26 | | | 27 | |
| 28 | | | | 29 | | | | 30 | 31 |
| 32 | | | | | | | 33 | | గా |

పంపినవారి పేరు: ------------------------------------

వయసు (      ) చిరునామా : ------------------------------

------------------------------------------------------------

---------------- పిన్ : ----------- ఫోన్ : ----------------

**నిబంధనలు**

✦ చతురంగాన్ని ఇదేపేజీలో పూర్తిచేసి పంపాలి. ✦ తుడుపులు, కొట్టివేతలు ఉండరాదు. ✦ మా 'కీ'తో సరిపోలిన పూరణలనే పరిగణనలోకి తీసుకుంటాం. ✦ గడువు తర్వాత అందిన పూరణలు పరిశీలించం. ✦ ఎక్కువ మంది సరైన జవాబులు రాస్తే డ్రా తీసి విజేతను ఎంపిక చేస్తాం. ✦ ఒక్కొక్కరు ఎన్ని కూపన్‌లైనా పంపవచ్చు. ✦ ఉత్తర ప్రత్యుత్తరాలకు తావులేదు. ✦ ఒకే కవరులో చతురంగం కూపన్లు ఎన్నయినా పంపవచ్చు.

చిరునామా : చతురంగం **చతుర,** ఈనాడు కాంప్లెక్స్, సోమాజీగూడ, హైదరాబాద్- 18

ఫోన్ : 04023318181, Ex: 6658, 6532

# బిడ్డ పోతే నష్టమేంటి?

'బిడ్డకు ఇంకా ఆకలిగా ఉన్నట్టుంది. కడుపు నిండా పాలిచ్చి పనిలోకెళ్లు' ఏడుస్తున్న పిల్లాడిని వదిలి వెళ్తున్న ఆఫ్రికన్ మహిళతో చెప్పింది లేడీ నికొలాయ్.

అందుకా మహిళ ఇవ్వనంటూ నిర్దయగా చెప్పింది.

'ఎందుకివ్వవు? పిల్లాడికి ఆకలి తీరక పోతే ఎలా? పసిప్రాణానికి ఏమైనా అయితే..?' అడిగింది నికొలాయ్.

'పోతే పోనీ, నష్టమేంటి?' కర్కశంగా అంది ఆ తల్లి.

కన్నబిడ్డకు పాలిచ్చేందుకు నిరాకరించిన ఆ తల్లి పరిస్థితులేంటి? తాము స్వేచ్ఛగా జీవించేందుకు హక్కుందని కూడా తెలియని బానిసల యథార్థగాథను కళ్లముందు నిలిపే పాలంకి సత్య

## మారీచమార్గం

చతుర ఫిబ్రవరి కానుక!

Printed, Published, Edited & Owned, by Ramoji Rao for Vasundhara Publications, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082 and Printed at Eenadu Press, No. 7-134 / 1& 2, Moosapet Village, Balanagar Mandal, Kukatpally - 500 072, R.R District, Office Address: CHATURA, Telugu Monthly, D.No. 6-3-569/3, Eenadu Complex, Somajiguda, Hyderabad-500 082, Tel: 23318181, Visakhapatnam: 2552211; Vijayawada: 2494900; Tirupati: 2275757; Anantapur: 273444; Karimnagar: 9959021802; Rajahmundry: 2468992; Suryapet: 221146; Guntur: 2512142; Nellore: 2338734; Srikakulam: 241101; Kurnool: 252813; Kadapa: 270011; Tadepalligudem: 228881; Warangal: 9959021804; Khammam: 9959021806; Nizamabad: 245661; Mahabubnagar: 8008706125; Ongole: 256777; New Delhi: 23753440; Mumbai: 24982498; Chennai: 28242036; Bangalore: 25599686. Toll Free Help line No. 18004258888 (Hyd.), www.eenadu.net.

Celebrate

# New Year

with fabulous offers from Sunflame

Sunflame®

THE CLEAR CHOICE

## Liva 60 SS BF

WITH BAFFLE FILTER



Suction 700 m³/hr

MRP. ₹ ~~14,990/-~~*

**Offer Price ₹ 6,990/-****

## Iris 60 BK BF

WITH BAFFLE FILTER



Suction 1100 m³/hr

MRP. ₹ ~~19,990/-~~*

**Offer Price ₹ 15,990/-****

## Exchange Offer

Exchange your old gas stove any make, any condition, for a sparkling new Sunflame Crystal Series cooktop



**and save upto ₹ 3,000/-***

*Offer on MRP.

## Introductory Offer

Exchange your old appliance any make, any condition, for a sparkling new Sunflame Champion Mixer Grinder




**and save ₹ 1,000/-***

*MRP. mentioned are inclusive of all taxes. **Handling Charges ₹ 300/- extra

*Conditions apply.

foundations

Visit us at www.sunflame.com | Available at all leading stores | Hurry! Offers available for limited period.

SUNFLAME Enterprises Pvt. Ltd. has not authorized any online sales activity. Any purchases made from sales websites / online portal will be entirely at customer's own risk and will not carry any entitlement of warranty / after sales service / installation support.

**Greater Hyderabad: Brand Store In Hyderabad Twin Cities:** Ashok Nagar: 040-66623143/ 9440854697; Attapur Pillar No.117: 9700933763/ 8142990443, Chandanagar: 8121906903, Dilshuknagar-beside Ashtalaxmi Temple: 9293227998 / 9154939838; Gachibowli Main Road: 7207265598 / 9966264403, Hubsiguda,Street No.8: 9885967786, Kukatpalli Road No 1: 9959446838; Miyapur: 9703844733; Nagole Cross Road: 040-65154575/9966154575, Neredemet X Road:9849192258/040-42212258.Trade: Agromech Industries-7416573459, Balaji Gas Appliances-8341028382, Chennai Steel & Home Appliances-04066802240, 9246282240, Jagdamba Steel Palace-9704685088, Jai Bhavani Steel Palace-04023832264, Mahalaxmi Home Needs-9247426036, Mahaveer House of Electronics-04027701254, Mamtha Sales Agencies-7702944178, Nakoda Steel Palace-04066770555, Neel Enterprises-9000103111, Pick & Pack Exclusive-8099059759, Sai Home Appliances-9963915786, Sri Krishna Enterprises-04023063704, Steel Big Bazar-9849409999, Swasthik Steel-9000244740, TT Super Bazar-04066465045, Tulsi Home Appliances-9000776417, Vasavi Steel Palace-9849640935, Vijetha Super Market-8688171333. SUNFLAME OFFICIALS: Santosh Patil: 9885511777; For Crystal & Traditional Cooktop Series, Chimneys Hobs & Cooking Range : Naresh Kumar: 9866002852, For Shakti, Crown SS, Euro/ Icon Series of Cooktops : Md Jawed: 8885066221, For Classic Series Glass Cooktops: Naresh Kumar: 9866002852, For Mixer Grinders, Geysers, Roti Maker, Rice Cookers & Heating Appliances: Aditya: 9885157700, For OTG, Kettles, Irons, Other Appliances Products: Shabaaz: 9966196300. Customer Care: 040-65546553/ 9032005021.

**Telangana:** Distributor for Adilabad Dist.: Mithili Marketing: 9700070467, Sunflame Official: VVSM Srinivas: 9246914556; Dealers: Bhainsa- Akshya Enterprises- 09440382304, 9490358304, Adilabad-Bigbazar Electronics- 9440757805, Belampally- Vasavi Steel palace- 9059632373, Manchiriyal-Royal Galary-8019702229, Distributor for Nizamabad: Trishakti Enterprises: 0878-6451929, 8019990002, Sunflame Official: VVSM Srinivas: 9246914556, Dealers: Laxmisree Enterprises-07386471790, Distributor for Karimnagar: Trishakti Enterprises: 0878-6451929, 8019990002, Sunflame Official: VVSM Srinivas: 9246914556, Dealers: Karimnagar: TV Centre 9618211600, Sai Kishore Agencies 9440852635, Jagityal: Padmaja Enterprises 9985211109, Kurotla- Laxmipriya Steel Palace- 9440142627, Godavarikhani- Saikrupa Enterprises-8728249939, Sri Ayyapa Home Needs-9849340663, Distributor for Warangal, Khammam & Nalgonda: Trishakti Enterprises: 0878-6451929, 8019990002, Sunflame Official: VVSM Srinivas : 9246914556, Dealers: Hanamkonda: Vijaya General Stores- 9704300111, Majestic Traders- 9550383304, 8374128691, Sri Venkataramana Enterprises: 9290028064, Sri Sai Sanitations: 9949555227, Sri Balaji Electronics & Home Needs: 8885888443, Kazipet- Balaji Kitchen Galary- 9059105916, Distributor for Medak, Mehboobnagar & Rangareddy : Trishakti Enterprises: 0878-6451929, 8019990002, Sunflame Official: VVSM Srinivas : 9246914556, Dealers: Siddepet: Geetha General stores- 7842220200, Ghatkasar: Krishna Enterprise: 9290909717.

**Distributor for Krishna, East & West Godavari: Central Andhra:** Teja Sai Agencies: 0866-2524551: Srinath : 8790806368; A R Enterprises: 0863-2244669, Distributor for Guntur & Prakasam: Srinath: 87908 06368; Seshbabu: 9849048522, Sri Rajendra Home Needs (Guntur): 9030956654; Venkataramana Selections (Chirala): 08594-232264; Sneha Electronics (Ongole): 9000009521; (Brand Store@ Nellore) : Vedayapalem, Beside More Super Market: 9866282122, Santosh Patil: 9885511777; Chinni Agancies: 868662833, (Brand Store@ Vijayawada): Vijaya Talkies Centre: 0866-6663143, 9642747414. Distributor for Chittor & Nellore: Vinod : 9966492665; Sri Venkataramana Arcade (Nellore); 9493005568.

**North Andhra:** Teja Sai Agencies: 0866-2524551, Distributors for West & East Goadavari: Sheshu Babu: 9849048522; Best Buy (Rajahmundry) : 9948138888; New Glass House (Kakinada): 9666788884; Vizag (Brand Store): Shakarmatam Rd: 0891-2713888/888589888, Santosh Patil: 9885511777; Sri Tirumala Agencies: 9246528333 Distributors for Vizag, Vizianagaram & Srikakulam: Shiva : 92468 97666; Preethi Emporium (Vizag): 0891-6561117; Bombay Gas Light Stores (Vizag): 0891-2755193; Sri Ganesha Enterprises (Gajuwaka): 9133356213; Srinivasa Home Appliances (Anakapalli): 9989100551; Vani Radio Home (Anakapalli): 9246666411; Koteswara Steel Center: 08942-224108; Mahalakshmi Home Appliances: 9989820435.

**Rayalseema:** Chinni Agancies: 8686628333, Distributor for Chittor & Nellore: Vinod: 9966492665; Jututru Agencies: 9866282122, Distributor for Cudapah:Vinod: 9966492665; Kurnool (Brand Store): Beside Anand Cine Complex: 8518222143/9676274080, Santosh Patil : 9885511777; L V Enterprises: 9000008805, Distributor for Kurnool & Ananthpur: Vinod : 9966492665

CHATURA Telugu Monthly, Dt. of publication : January 1, 2015.
Postal Regd No. HD/965/2015-2017 RNI No. 32186/1978

www.gangamixie.com




mother's best choice in home appliances,
since 30 years...



sricharanamedia.com

NOTE: DO NOT GET CHEATED BUYING DUPLICATE PRODUCTS CLUBBED WITH OTHER NAMES BEFORE THE NAME OF GANGA

NOTE: OBSERVE AND BUY GANGA MAATHA SYMBOL AND GANGA HOLOGRAM SYMBOL

For New Dealership Contact:
Twin Cities: Kishor - 9848239911, Sridhar - 9985380766
Telangana: Raju - 9440629403, Ravi Shankar - 9440629417
Rayalaseema: Ravi Shankar - 9440629417, Wahid - 9059099641

# 1-1-189/10/1, Street No. 6,
Vivek Nagar, Chikkadpally, Hyderabad - 20
Ph: 040-27600221, 27600227 Fax: 040-27600226
e-mail: vijayaagencieshyd@gmail.com

VIJAYA AGENCIES